

సంపుటము 20
సంచిక 3

# భారతి

చిత్రభాను ఫాల్గునము
1943 మార్చి

# ఈ గీతం!

= శ్రీ రాయప్రోలు సుబ్బారావు =



ఈగీత మెవ్వరో ఇంపుగా పాడేరు
కానరా రెవ్వ రీకనుచూపుమేరలో
పాటలో రాగంబు పైటచాటయి మీఱ
రాగాన నాదంబు అవికమాటున పొంగి
జాఱింది నాలోన
స్వాతిబిందువుభాతి,
చిమ్ములై, చిలవలై,
చెరువులై నిండింది. ఈగీత...

తుదిలేని ఆరాట మెదను వేటాడంగ
కడలేని కుతుకంబు కంఠమ్ము కబళింప,
మనసునంతా లేపి మరుగుమూలలు చూచి,
కన్నులన్నీ విప్పి మిన్ను మన్నూ కాంచి,
తలపు దీపము చూప
నలుగడా వెదికాను,
వలపు వాకిలితీయ
వాడలా వేచాను. ఈగీత...

దిక్కులా వీక్షించి ప్రక్కలా లక్షించి
స్మృతిలో పరీక్షించి మతినే సమీక్షించి
తలమున్కలయి పొలు తమక మాపగలేక
అవశమై ఉలికించు అళుకు నోపగలేక
శోధించి, వ న్నిట్లు
వేధించు ఈస్వాదు
సాధుగీతముజాడ
సాధింపలేనైతి. ఈగీత...

ముత్యాలదండలో మురియు సూత్రంబట్లు
గీతిలో రాగంబు స్యూతమై స్ఫురియించు
వాయుమండలమహావర్తంబులన్ దేలి
నక్షత్రచిత్రమండలమార్గములు దాటి
పౌన్నాకుపై బడ్డ
కన్నె తేనియబోలె
నాకర్ణయుగపాళి
సోకెనో తా నేల?. ఈగీత...

నాదమై స్వరపరిచ్ఛేదమై, తాపాప
నోదమై, నవరసాస్వాదనామోదమై,
లలితంబుగా, ప్రియావళితంబుగా, సుధా
మిళితంబుగా, నభోగళితంబుగా రాలి
పెరిగింది కొండలై
విరిగింది మంచులై
కలిసింది శ్రుతిలాగు
బలిసింది రుచిభంగి. ఈగీత...

పిలిచింది చెలివోలె, నిలిచింది నీడనై
చవిచూపి మధువట్లు సాగింది సొవలీల,
కరిగెనో నవనీతకబలరాశివిధాన
అరిగెనో సురభిచక్రాకారచక్రముచాయ

తాకింది హృదయంబు
తడిపింది నడిగుండె,
ప్రాకింది నిలువెల్ల
బ్రహ్మరంధ్రముదాక. ఈగీత...

కాదటే! ఇది విశ్వకల్యాణసుందరీ
పాదాభివాదంబు, ప్రణవోపదేశాను
వాదంబు మాధురీభగవత్ప్రసాదంబు?
అంతఃకరణమందు
ఆనందవల్లి నే
పూయించి కాయించి
పూర్ణక్రతువు సల్పె. ఈగీత...



# ఆంధ్రభాషాచరితము-ధాతువులు

= శ్రీ కోరాడ రామకృష్ణయ్య =



ఆంధ్రమున 'అగు' అనునది ధాతువుగా గ్రహింపబడగా, తమిళమున 'ఆ' అనునదే ధాతువైనది. కన్నడమున 'ఆగు-ప్రాదుర్భావే' యని శబ్దమణిదర్పణకారుడు 'ఆగు' అనుదానినే ధాతువుగా బరిగణించినాడు. కాని 'ఆగు' అనుదానికి 'అగు' అను రూపాంతరముకూడ నాభాషలో కొన్నిచోటుల కనబడుచున్నది. 'అగు' అనునదే తెలుగులో ధాతువుగా గ్రహింపబడినను భూతకాలిక రూపమగు 'ఆయెను' అనుదానిలో దీర్ఘాకారము కానవచ్చుచునే యున్నది. ఈదీర్ఘత్వమును సాధించుటకే "అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు" (బాల. క్రి. ౧౦౦ సూ)అను సూత్రమును వైయాకరణుడు కల్పించినాడు. పిదప మరల దీర్ఘమునకు హ్రస్వము విధించి, త్రికము మీది అసంయుక్తహల్లునకువలె ద్విత్వముచేసి "అకన్య-అక్కన్య" వలె 'ఆయెను' అనుదానినుండి 'అయ్యెను' రూపమును సాధించినాడు. ఇది యీధాతువునకు సంబంధించిన రూపసాధనప్రక్రియ. ఇచ్చట హ్రస్వవర్ణముతో గూడినది మూలధాతువా, లేక దీర్ఘవర్ణముతో గూడినదా యను విషయమును నిర్ణయించుట కొంత కష్టమేదైనను, ఇతరసజాతీయభాషలలోని పెక్కు రూపములలో దీర్ఘమే తరుచు కనబడుచుండుటచేతను, తెలుగునగూడ కొన్నిటిలోనైన నది గానవచ్చుట చేతను 'ఆ' అనునదే మూలధాతు వనుట సమంజసమనవచ్చును. అయితే తెలుగుకన్నడ వైయాకరణులు 'గు' వర్ణమునుగూడ ధాతురూపములోనే చేర్చియున్నారుగదా. అ దెట్లు వచ్చిన దన్న విషయము పరిశీలింపవలసియున్నది. మన చిన్నయసూరిగారికి సుమారు రెండువేల సంవత్సరములు పూర్వమున నున్న తమిళభాషా వ్యాకర్త యగు తొల్కాప్పియనార్ అనువాతడు ధాతువులపై కు, డు, తు, లు అనునవి యనుబంధములుగా జేరుచుండు నని చెప్పియున్నాడు. తరువాతి కాలపు శబ్దమణిదర్పణకారుడు కన్నడభాషలో గూడ 'కుం' అనునది ధాతువులపై జేరుచుండు ననియు, నా కుమంతరూపము కాలాదిభేదము, లింగవచనభేదము లేకయే తెలుగులోని తద్ధర్మార్థకరూపములవలె ప్రయోగింపబడుచుండు ననియు దెలిపియున్నాడు.

> "సవనాగి భూతదొళ్ లిం
> గవచనదొళ్ కర్తృ వర్తమానభవిష్య
> ద్వ్యవహృతిగళ్ గుంకుంప
> ల్యావు తావన్నైకవచనకొళ్ నెలసిర్పం"
>
> (శ. మ. ద.)

తమిళమున 'ఆ' ధాతువునుండి 'ఆగుం' అనురూపము వర్తమానభవిష్యత్తులయందు ప్రయోగింపబడును. ఇదియే తెలుగున 'అగును' అయినది. కన్నడమున 'ఆగు'పై 'కుం' చేర్చుటచేగాబోలు (ఆగుగుం) 'ఆక్కుం' అను రూప మేర్పడినది. 'పో' అనునదే తమిళమున ధాతువుగా గ్రహింపబడుచున్నది. తెనుగున 'పోవు' ధాతువు. ఈ 'వు' అనునది 'గు' వర్ణముయొక్క-

రూపాంతరమే యైనచో 'పోసు' అనునది దాని వెను
కటిరూపమగును. తమిళమున 'పో' అనునదే ధాతువు
గావున 'ఆగుం' వలెనే 'పోగుం' అను రూపముకూడ
నేర్పడియున్నది. ఇదియే తెనుగున 'పోవును' అను
రూపమున నున్నది. కన్నడమున 'అక్కుం' వలెనే
'పోక్కుం' అను రూపము నేర్పడినది. ఇట్లు కాలాది
భేదము తెలుపని-అనగా తద్ధర్మార్థకము లనబడు నీ
ఆగుం - అక్కుం - అగును; పోగుం-పోక్కుం-పోవును
మొదలగు రూపములలో 'కుం' అనునది యీ భాషల
లో సమానముగనే కనబడుచున్నను, ఇది యెట్లు వచ్చి
నదో, దీని సహజరూపమేమో తెలిసికొనుట కవకా
శము కనబడుటలేదు. ఇందుకనే కాబోలు
రెండువేలయేండ్లక్రితము తొల్కాప్పియనార్ చెప్పి
నట్లే ఆధునికశబ్దశాస్త్రజ్ఞుడగు కాల్డ్వెల్ పండితు
డుకూడ కు-గు, చు-జు, తు-దు, టు-డు, పు-బు
మొదలగునవి ధాతువులపై చేర్పబడు ననుబంధము లని
మాత్రమే చెప్పియూరకున్నాడు. కాని యివి యెట్లే
ర్పడినవో, వీని మూలరూపము లేమైయుండునో పరిశీ
లింప దొరకొనలేదు. ఎట్లు తెలిసికొనుట ? సంస్కృత
మున ధాతువుపై చేర్పబడు వికరణప్రత్యయములగు
అ, య, ను మొదలగువాని మూలరూపములుగాని,
విభక్తిప్రత్యయములగు అం, భ్యాం, భిస్, ఏ, సు
మొదలగువాని మూలరూపములుగాని తెలియవచ్చి
నవా ? అట్లే యివియు నాయాయర్థములను
సూచించు ప్రత్యయములే యైయుండు నను
భావమే ప్రబలియుండుటచే, వాని మూలస్వరూపా
న్వేషణమునుగూర్చియు నౌదాసీన్యము కలుగుట
తటస్థించినది. కాని యీదక్షిణదేశభాషాస్వరూప
లక్షణములు సంస్కృతాది భాషాలక్షణములకంటె
నించుక భిన్నములుగా గనబడుటనుబట్టి, తద్భాషాసంప్ర
దాయచిహ్నములనుబట్టి వీని జాడల నన్వేషించినచో
వాని మూలరూపముల జాడలను దెలియవచ్చునేమో
యను నాశ కలుగకపోదు. ఈద్రావిడభాషలను వ్యాక
రించినవారు సంస్కృతభాషావ్యాకరణఫక్కినే యవ
లంబించి, సప్తవిభక్తులను ఏర్పరించి ఆయావిభక్త్యర్థ
ములను సూచించు ప్రత్యయము లనువానిని విడదీసి
చూపియున్నను, అందు ద్వితీయాషష్ఠుల, లేదా చతుర్థు
లలో గనబడు 'ని, కు' అనునవిగాక తక్కిన విభక్తి
ప్రత్యయము లనబడునవి- చేత, వలన, కంటె, అందు,
లోపల మొదలగునవి కేవల ప్రాతిపదికపైనిగాని,
సంబంధార్థద్యోతకచిహ్నముతో గూడిన ప్రాతిపదికపై
గాని చేరిన స్వతంత్రపదములే యను విషయము పరిశీ
లించినవారికి వ్యక్తమగుచునేయున్నదిగదా. వీనికి
స్వతంత్రప్రయోగమును భాషలో కలదుగదా. అట్లే
యీ భాషలలో అర్థభేదమును సూచించుటకుగా శబ్ద
కల్పన మేరీతిని జరిగియున్నదో, జరుగుచున్నదో పరిశీ
లించినవారికి సామాన్యముగా నీభాషలు మొదటి
నుండియు తమ సంయుక్తపదరూపత్వలక్షణమును
(Agglutinative Nature) నిలుపుకొనుచువచ్చినవే
యను విషయము పొడకట్టకమానదు. కాలక్రమ
మున నుచ్చారణమందలి వేగము, అలసత మొద
లగు కారణములచే నాయారూపములలో కొంత
మార్పు కలుగుట తటస్థించినను, మొత్తముపై నీభాష
లలో ప్రత్యయములుగా గ్రహింపబడుచున్న ఆయా
శబ్దములు తమ ప్రత్యేకతను సంపూర్ణముగా గోలు
పోయి కేవల మర్థము గుర్తింపరాని యట్టి ప్రత్యయా
వస్థ నింకను బొందినట్లగపడదు. ఇట్టివానిలో గొన్ని
టికి వైయాకరణులు శబ్దపల్లవము లని పేరుపెట్టిరి.
"ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి
విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు
నాఁబడు" (బాల. క్రియా. ౧౧౨ సూ) అని చిన్నయ
సూరి వీనికి నామనిర్దేశము చేసెను. కొన్ని ధాతువుల
కుగాని, శబ్దములకుగాని యితరధాతువులు జతపరుప
బడినపు డాశబ్దద్వయసమ్మేళనమువలన బూర్వమం
దున్న యర్థముకంటె భిన్నమగు నర్థము బోధింపబడు
చున్న దను భావము సామాన్యమైన ఫలితార్థముగా
గ్రహింపవచ్చునుగాని, బాగుగ పరిశీలించినచో పెక్కు
స్థలములయందు మొదటి ధాతువుయొక్క, లేదా శబ్దము
యొక్క మూలార్థమును వ్యక్తీకరించి దానిని క్రియా
రూపమును బొందించుటకు దోడ్పడు సహాయధాతువు
(Auxillary root)గా నీరెండవధాతువు నిలుచుచున్న
దని చెప్పవలసియుండును. ఒక్కొక్కప్పుడు కేవలము
భిన్నార్థము కలుగుటయు లేకపోలేదు. ఈభాషలలో
నొకధాతువుపై, లేదా శబ్దముపై నర్థభేదచ్ఛాయలను

సూచించుటకు వేరుశబ్దము లన్యప్రయుక్తము లగుచు వచ్చుటచేతనే యీభాష యంతయు నిట్లు పెరుగుచు వచ్చిన దని చెప్పవచ్చును. ఇట్టిశబ్దపల్లవము లెన్ని విధములుగా చేర్పడుచున్నవో ముందు పరిశీలింతము. ఈభాషలలో నూతనశబ్దకల్పనమునకు విశేషముగా తోడ్పడినవానిలో 'కొను' ధాతు వొకటి. కొను- దీనికి తమిళకన్నడములలో 'కొళ్' అను రూపము కలదు. దీనిని సహాయధాతువుగా గ్రహించి కన్నడమున చేర్పడిన కొన్ని రూపములు:—

కన్న. కచ్ కొళ్ - తె. కన్గొను. త. కణ్డుకొళ్.
కెయ్‌కొళ్ — చేకొను, కయికొను, కైకొను. త. కైకొళ్.
దొరకొళ్ — దొరకొను.
బెంగొళ్ — వెనుకొను
మాకొళల్ — మార్కొను. త. మారుకొళ్
ముంగొళ్ — మునుకొను
నెలెకొళ్ — నెలకొను. త. నిలైకొళ్.
త. భయంగోళ్, భయంగొళ్. భీతిగొను. భయశబ్దము తెనుగున పడు ధాతువుతో చేరినది.
కూస్తుకొళ్ — కూరుచుండు. 'కూస్తు' అనుదాని మూలరూపము 'కూర్' అయియుండును. తెలుగున నది 'కూరుచు' అయి 'ఉండు' అను సహాయధాతువుతో గూడినది. కాని కొనుతో చేరలేదు.

ఆంచికొను, ఆంకొను (ఆంకలి + గొను), ఈకొను— ఈయకొను— ఇయ్యకొను. (ఇచ్చుటను గ్రహించుట—(To be prepared to yield)

క. మెయ్‌గొళ్. మేకొను — మెయికొను (తనపైవేసికొనుట)-అంగీకరించుట. (To take upon oneself)

త. విజిత్తుకొళ్ — మేలుకొను. (మేలుకను-కాంచు) = పైని (బాహ్యమును) చూచుట.

త్రెక్కొను. త. ఎడిత్తికొళ్ —ఎత్తికొను—ఎత్తికొళ్. పుచ్చుకొను. త. అడిక్కొళ్ —అడుకొను, అడికొను (అడికోలు). త. ఒప్పికొళ్ —ఒప్పుకొను, ఒప్పికొళ్. నాచికొను, పీడుకొను-బీల్ కొళ్. వలగొను-క. బలగొళ్. త. వలంగొళ్. కోలుకొను. త. తేఱికొళ్ — తేఱుకొను.

తోడ్కొను, దూకొను, పాల్గొను, పెనగొను, పూకొను, మించుకొను, ఉసికొను, అడగొను, ముసురుకొను, అడ్డుకొను, అరిగొను, అంకెగొను = కప్పుకొను, తతిగొను, తలకొను, కడుకొను, గొనకొను, సుఱుకొను, అనుకొను, తమికొను, గొదకొను, అలముకొను, కడలుకొను, తూకొను, నెట్టుకొను, తక్కొను, తార్కొను, డీకొను, పయికొను (త. మేల్ కొళ్), మొనకొను, మొదలుకొను (త. ముదల్ కొళ్), పట్టుకొను (పట్టుకోలు-త. పట్రికొళ్), దొడ్డకొను, అనుకొను, కలగొను, కొల్లగొను (త. కొళ్ళైకొళ్) చూఱగొను (త. చూఱైకొళ్), దోచుకొను.

తమిళవైయాకరణు లిట్లు సహాయధాతువులుగా వచ్చునని చెప్పినవి ముఖ్యముగా నాలుగు ధాతువులు కలవు. కొళ్, విడు, ఇరు, ఒఴి.

విడు—వందివిట్టాన్ (=వచ్చివేసినాడు), పడిత్తు విట్టాన్ (=చదివివేసినాడు). ఇరు — ఎడుత్తిరుందాన్ (=లేచియున్నాడు). ఒఴి—కెట్టొఴిందాన్ = (=చెడిపోయినాడు)

తె. క.
ఆడు:—అల్లాడు—అల్లాడు,
ఓలలాడు—ఓలాడు,
కొట్లాడు — కొట్టాడు,
కొండాడు — కొణ్డాడు.

తెనుగున కొండాడు, కొనియాడు అను రెండు రూపములు కనబడుచున్నవి. 'కొని' అనుదానితో సమానమైన భూతన్యూనరూపమే 'కొణ్డు' అనునది కన్నడమున. 'కొనియాడు' అని తెనుగురూప ముండగా 'కొండాడు' అను మఱియొకటి యీభాషలోని కన్నడభాషాసంసర్గమువలన సంక్రమించియుండును.

కొనియాడు, ఊగాడు, ఊటాడు, సునిపాడు, చెరలాడు, దోగాడు, పెన్నాడు, లాగులాడు, వేటాడు, తిరుగాడు (క. తిరిగాడు), పోరాడు (క. హోరాడు), మాటాడు (త. సొల్లాడు), వ్రేలాడు, విడపాడు

పాలపాడు, తునుమాడు, తూటాడు, తగవులాడు, తూగాడు, అసియాడు, నలుమాడు, చెండాడు, ఉల్లసమాడు, ఉరియాడు, ఇగ్గులాడు.

పడు:—అలవడు, ఏరుపడు, చొప్పడు, వెలువడు, తడబడు, తలపడు, కీడ్పడు, చేడ్పడు, ప్రాన్పడు, భయపడు, పీడ్వడు, ఉరలబడు, పాల్పడు, విరుగబడు, విడివడు—విడుపడు, వెన్పడు, అగపడు (అగ్గము=అధీనము. cf త. అగమ్=లోపల Inside), ఈడిగిలబడు, కవబడు, కూడబడు, చేరబడు, చేపడు, చిక్కువడు, కోల్పడు, తోడ్పడు, తొట్రుపడు, అదిరిపడు, కట్టుబడు, చొరబడు, వినబడు, నిలబడు, దిగబడు.

అరు:—అసలారు, ఏపారు, ఒప్పారు, అలరారు, పొంగారు, తనుపారు, పొలుపారు, పానరారు, వెలరారు, పొంగారు, చల్లారు, అణగారు, ఎలరారు, ఎసలారు.

పోవు, పోయు:—మూర్ఛబోవు, ఆపోవు, పజ్జపోవు, కొంపోవు, బుసిపోవు, అమ్ముడుపోవు, పరిపోవు, పొంపిరివోవు, ఈచబోవు, పొలివోవు - పారివోవు, ఈడ్చబోవు, పాలువోవు, పీటిబోవు, తలపోయు, బుసిపోవు, వాపోవు, ఎత్తువోవు, లొట్టపోవు.

తెంచు, దేరు:—అరుగుదెంచు - అరుదెంచు, అడరుదెంచు, ఏతెంచు-ఏగుదెంచు, తోఁతెంచు, తారుదెంచు, పోవుదెంచు, పుత్తెంచు, నడతెంచు, బయలుతెంచు, వీతెంచు, చనుదెంచు, మెలతెంచు, కవియుదెంచు, చొత్తెంచు, పఱతెంచు, అగుదెంచు, నెగయుదెంచు.

అలు:-ఉక్కలు, ఏపలు, పెంపలు, పొలుపలు, రూపలు, సిగ్గలు.

ఉండు:— కూరుచుండు. 'కూరిచి+ఉండు=' అనియు, నిందు 'కూరుచు' ధాతువునకు క్రియపడు నని యర్థ మనియు సుప్తార్థప్రకాశికాకారుని మతము. కన్నడమున 'కూస్తుకొండు', 'కూడ్రువడు' అను రూపములు గలవు. 'కూడ్రు' అనునది అర్వాచీనము, వ్యావహారికము. దీనినిబట్టి 'కూఱు' అనునది మూలధాతువై యుండునేమో యని తోచుచున్నది. కూఱు, కూస్తు, కూస్తు అయియుండవచ్చును. 'కూడ్రు' అను నాసికరహితరూపము కావచ్చును. కూరు, కూర్చు = ప్రియము అను నర్థము కలది వేరుధాతువై యుండును. కన్నడమున 'కూర్ — కూరు' అను ధాతువు (To sit down) ఈయర్థమునందే గలదు. ఇది 'కుళిర్' అనుదాని రూపాంతర మని నిఘంటుకారుని యభిప్రాయము. 'కుళిర్' 'కుళ్లిర్' యొక్క రూపాంతరమైయుండును. ఇదియే ఆభాషలో ప్రాచీనరూపము. 'కుళ్లిర్' అనుదానినుండి యేర్పడిన అర్వాచీన రూపములు కుళిర్, కుణ్ఱి, కుళ్లు, కూడ్రు, కూర్ అనునవి కలవని కిట్టెల్ పండితుడు నిఘంటువులో నిచ్చియున్నాడు. 'కుళితు' నుండి కుళితుకొండు— కుళితుకొళ్లు—కూతుకొళు— కూస్తుకొళ్ అను రూపములు పెరిగినవి. వీనినుండియే తెలుగున (కూతుకొను) 'కూకొను' అను బ్రాహ్మణేతరులలో వ్యవహారమునందున్న రూప మేర్పడియుండును. కుళ్ + ఇరు = కుళ్లిర్ — కూడ్రు — కూరు—కూరు-చు-ఉండు = కూర్చుండు—ఇట్లీరూప మేర్పడియుండును. దీనినిబట్టి చూడగా మొత్తముమీద వీని కన్నిటికి 'కుళ్లు' (కుఌ్) అనునదే మూలరూపముగా నున్నట్లగపడుచున్నది. 'కుళ్లిర్' కుడ్రు — కూరు అని శిష్టభాషలో నేర్పడి దానిపై ఇచు — ఉండు చేరగా కూరిచు - కూర్చు — కూర్చు + ఉండు='కూర్చుండు' అను రూపము కలిగియుండును. 'కుళిర్' అనుదానికి 'వంగు' అను నర్థముకూడ కన్నడమున నుండుటచేతను, ('కుళిర్ ఋజు ఖ జే' అని శబ్దమణిదర్పణము. To bend, To stoop, Squat) 'కుళిర్' (To seat, Rest) అని తమిళమునను, 'కూండు' అని వ్యావహారికతమిళమున నుండుటచేత నిది కూను, గూను, కుని మొదలగు శబ్దములకు సంబంధించినదై "వంగి ఆసీనుడగట" అను మూలార్థముగల ధాతువుగా గావవచ్చుచున్నది.

'ఉండు' సహాయధాతువుగా గలిగిన మఱికొన్ని శబ్దపల్లవములు : పరుండు, పన్నుండు, నిలుచుండు.

ఇంచు:—అంగవించు, అగ్గలించు, అప్పళించు, ఉంకించు, ఊకించు, ఉమ్మలించు, ఏసులించు, ప్రశ్నగించు, గమకించు, మొక్కలించు, సుంపించు, ఒత్త

రించు, పిచ్చలించు, వెగ్గలించు, ప్రుచ్చలించు, దొంగిలించు, అడ్డగించు, పంతగించు, మందలించు, పాటించు, గొందలించు, కళవళించు, తమకించు, వేగిరించు, ఈసడించు, తులంగలించు, తొంగలించు, చెంగలించు.

ఇల్లు:—ఘల్లుగిల్లు, వెగ్గడిల్లు, దద్దరిల్లు, తల్లడిల్లు, తారసిల్లు, ఝల్లుసిల్లు, జురపిల్లు, తత్తరిల్లు, గాసిల్లు, పల్లటిల్లు, ఊరడిల్లు, నివ్వటిల్లు, దూపిల్లు, అంపిల్లు, పిక్కటిల్లు, పరిఢవిల్లు.

ఈ ఇంచు, ఇల్లు అను ధాతువు అనేకములగు సంస్కృతధాతువులను తెలుగుధాతువులుగా మార్చుట కుపయోగపడుచున్నది: రంజ్ – రంజిల్లు; ఖిద్ – ఖేదించు, ఖేదిల్లు; గర్జ్ – గర్జించు, గర్జిల్లు; జి – జయించు; భుజ్ – భుజించు; గుణించు, అర్థించు, యాచించు, శయనించు, పోషించు, సంతోషించు, వర్షించు, హర్షించు.

ఇట్లు సంస్కృతధాతువులను తెలుగుధాతువులుగా మార్చుట కుపయోగపడిన సహాయధాతువగు 'ఇంచు' అనునది ఈ, ఇచ్చు, ఇంచు, ఇసు ఇత్యాదిరూపములు గల 'ఈ' ధాతువే యైనను, దీని నొక 'ఇంచుక్' ప్రత్యయముగా జేసి యీప్రత్యయము సంస్కృతధాతువుల పై వచ్చు నని వైయాకరణులు సూత్రించినారు: "సంస్కృతంబునకు, అంగలాదులకు ఇంచుక్కగు" (బాల వ్యా. క్రి. ౬౩)

కావున నీ 'ఇంచు' అను సహాయధాతువుమూలముగా ననేకములగు సంస్కృతధాతువులకేకాక, పెక్కు దేశీయధాతువులకు, శబ్దములకును ఈభాషలో ప్రయోగార్హత, మరల ధాతుత్వసిద్ధి యేర్పడినది.

అంగలాదులలో కొన్నిటిని పరికింపుడు:

అడకించు, పరికించు, పలవించు, ఒప్పగించు, అరగించు, ఆవులించు, ఉంకించు, ఓసరించు, కారించు, గాలించు, జాడించు, తిలకించు, తులకించు, అప్పగించు, ఆలించు మొదలైనవి.

వీనిలో తద్భవరూపములు కొన్ని గలవు. అప్పగించు– 'అర్పణ' అనుదానినుండి, ఆలకించు– 'ఆలక్ష్' అనుదానినుండి యేర్పడియుండవచ్చును. 'ఒప్పగించు' అనుదానిలో 'ఒప్పు' అంగీకారమును దెలుపును. రూపాంతరము 'ఒవ్వు' (వ్యతి. ఒవ్వని). త. ఒవ్వు = To be like, To be congruous. ఇది త. 'ఓ' = To be of the same mind — ఏకీభావము అను నర్థము గల ధాతువునుండి యేర్పడియుండవచ్చును. లేదా త. ఒల్లు (To agree, To be fit, Suitable, To combine, Unite, Join) అను ధాతువునుండి ఒల్ + పు=ఒప్పు, అని యేర్పడినను ఏర్పడియుండవచ్చును. 'ఒల్లు' నుండియే వ్యతిరేకరూపము త. ఒల్లామై=Contempt, Absence of desire, తె. ఒల్లమి అనునది యేర్పడియుండును. దీనినుండియే 'వలచు' ధాతువుకూడ తరువాత నేర్పడియుండును.

ఇట్టి భాషలలోని మూలరూపములను బరికింపగా 'ఒప్పు' అనునదే మూలధాతు వని చెప్పుటకు వీలులే దనియు, ఇది 'ఒల్' అనుదానినుండియో, 'ఓ' అనుదానినుండియో యేర్పడిన రూప మనియు తెలియవచ్చుచుండగా, ఈ 'ఒప్పు' అనుదానికి 'ఇంచు' అను సహాయధాతువును జేర్చి దానిని ధాతుపల్లవముగా జేయు సందర్భమున అది 'ఒప్పించు' అనియేకాక 'ఒప్పగించు' అను రూపముగాగూడ నేర్పడుచున్నది. భాషలో నదివరకు ఏర్పడియున్న యీ రెండవరూపమునుగూడ సాధించుటకొరకే వైయాకరణుడు "అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమం బగు, నప్పాదులకు విభాష నగు" అను సూత్రముచే నొక గుగాగమమును వికల్పముగా విధింపవలసివచ్చినది. ఈ 'గు' గాగమము తొల్కాప్పియర్ తమిళ భాషావ్యాకరణమున ధాతువులపై గలుగు నని విధించిన 'గు-కు' అనుదానితోను, కన్నడమున శబ్దమణిదర్పణకారుడు విధించిన 'గుం-కుం' అనుదానితోను, కాల్డ్వెల్ పండితుడు తెల్పిన 'కు-గు' అనుదానితోను సమానమైనదేకాని, తద్భిన్నమని తలపవలసిన ట్లగపడదు. అయితే ఇది మూలధాతువులతో సంబంధించినదికాక కొన్నింటిపై నేదో యొక్క ప్రత్యేకార్థమున నేర్పడుచు

వచ్చిన దనిమాత్రము మన మూహించుట కవకాశము కలుగుచున్నది. ఇంతకుపూర్వము మనము గమనించిన యీ భాషలలోని సంప్రదాయమునుబట్టి యీ 'గు' అనునది యితర ధాతువులపై నొక కాలమున జేర్పబడిన యొక సహాయధాతువుయొక్క యవశిష్టరూపమా యను సందేహమును గలుగకమానదు. ఆంధ్రవైయాకరణుని సూత్రముప్రకారము ప్రేరణార్థమును సూచించుటకుగా అడ్డాదులపై నించుక్కు, లేదా 'ఇంచు' అనుదానిని జేర్చి రూపనిష్పత్తి చేయు సందర్భమున నడుమ నొకప్పుడు 'గు'గాగమము రా నగత్య మేమి? ఇది శాస్త్రఫక్కి ననుసరించి చేయబడిన విధానము గాని వాస్తవముగా నీ 'ఇంచు' అనునది 'అడ్డగు' అనుదానికి జేర్పబడియుండును. 'అడ్డు' అనుదానిపై జేర్చి కల్పింపబడిన రూపము భాషలో లేకపోవుటచే కాబోలు దీనికి వైకల్పికత్వమును చెప్పలేదు. 'ఒప్పించు-ఒప్పగించు' అనుదానివలె 'అడ్డించు - అడ్డగించు' అని రెండు రూపములు లేవన్నమాట. 'అడ్డు' సకర్మకమైనపుడు 'అడ్డివేయు' అను రూపము వ్యవహారమున గలదు. నామవాచకమైనపుడు 'అడ్డు' అనగా అభ్యంతరము. దీనినుండి క్రియారూపము, లేదా ధాతుపల్లవము 'అడ్డగు' (అడ్డు+అగు) = అభ్యంతరము కలుగు. దీనినుండి ణిజర్థకము - ప్రేరణార్థకరూపము చేయవలసినప్పుడు 'ఇంచుక్' లేదా 'ఇచ్చు' అను సహాయధాతువు యొక్క సానునాసికరూపమును జేర్పగా 'అడ్డగు + ఇంచు=అడ్డగించు' అగును. అనగా అభ్యంతరము అగునట్లుగా ఇచ్చుట—లేదా చేయుట. ఇదియే 'కాన్ (అగ) ఇచ్చుట=కావించుట + అభ్యంతరము కావించుట' కూడ నగును. దీనినిబట్టి 'అడ్డగించు'లోని 'గు' గాగమస్వరూప మెట్టిదో మనకు కొంతవరకైన బోధపడుట లేదా ?

తక్కినవానినిగూడ బరిశీలింతము. 'ఓరగించు'- 'ఓర' అనగా ప్రక్క, అంచు. ఇది విశేషణము గానే కాని క్రియారూపముగా వ్యవహారమునుండి తొలగినది. cf. ఓరచూపు. కావున దీనిని క్రియగా జేయుట కొక సహాయధాతు వావశ్యకము. ప్రాచీన కాలమున 'అగు' ధాతువు ఇట్టి సహాయధాతువుగా చాల పనిచేసినట్లగపడుచున్నది. కావుననే యీ భాషల లోని యనేకమూలధాతువులపై 'అగు' అను సహజ స్వరూపముతో గాని, యొకప్పుడు తదవశిష్టరూపమగు కేవల 'గు' వర్ణముగా గాని యది పొడసూపుచున్నది. ఓర + అగు=అనగా ప్రక్కకు అగు—వంగు అను నర్థమున 'ఓరగు' అనునది యేర్పడినది. దీని రూపాంతరమే 'ఒరగు' అనునది. ఒరగునట్లుగా ఇచ్చుట, లేదా కావించుట-చేయుట=ఓరగు + ఇంచు=ఓరగించు. పెల్లగించు — పెల్ల అనగా ఎండి ముక్కలుగానైన మంటిగడ్డ (A chip, A flake, A clod). పెల్ల అగునట్లుగా ఇచ్చుటకావించుట- పెల్ల + అగు + ఇంచు పెల్లగించుట. (పెల్ల) అగు (నట్లు)- ఇచ్చుటయే అగించుట. ఇదియే వర్ణవ్యత్యయముచే 'కావించుట' అగుచున్నది. భూమిలోపల వ్రేళ్లు గల యొక మొక్కను పైకి లాగి ఉన్మూలించినచో, దాని మొదట నున్న భూభాగము పగిలి పెల్ల అగునట్లు చేయుటయే అగును గదా. కావుననే పెల్లగించుట అనుదానికి ఉన్మూలించుట అను నర్థ మేర్పడినది. ఇదియే దీనికి సహజమగు మూలార్థము. దీనినిబట్టి "హృదయమునుండి భావములను పెల్లగించు" అను సందర్భములలోగూడ లాక్షణికముగా నిది ప్రయోగింపబడుచుండును. ఇట్లే చిత్తగించు, మేళగించు మొదలగునవి. చిత్తము (దాని యందు) అగునట్లు ఇచ్చుట (=చేయుట)= చిత్తగించుట. (రెండువస్తువులు) మేళవము అగునట్లు ఇచ్చుట= మేళగించుట. 'గ' కారము 'వ' కారముగా మారుటచే 'మేళవించుట' కూడను. వీనికి పెల్లించు, చిత్తించు, మేళించు అను రూపములు లేవు. కాలేదు. కాని 'ఒప్పు' మొదలగు కొన్ని దేశ్యశబ్దములపైని, 'కుప' మొదలగు కొన్ని సంస్కృతశబ్దములపైని 'ఇంచు' అనునది చేరునప్పుడు 'గు' గాగమము విభాష అన్నారు. ఒప్పించు-ఒప్పగించు, అప్పించు - అప్పగించు, కోపించు-కోపగించు, పల్లించు- పల్లగించు— ఇవి యుదాహృతులుగా జెప్పబడినవి. వీనిలో అప్పగించు అను రూపము ప్రయోగములతో నిఘంటువులలోగూడ గ్రహింపబడినది గాని 'అప్పించు'రూపము కనబడుట లేదు. వ్యవహారమునను గానరాదు. 'అప్పగించు' 'ఒప్పగించు' అనుదానితో సమానార్థకము

గనే తెలుపబడినది. ఇక పల్లము—సున్నముపై వేసెడు లేను. దీనినుండి 'పల్లించు' రూపమే ప్రాచీనప్రయోగములందు గానవచ్చుచున్నదిగాని పల్లగించు అను రూపము కానవచ్చుట లేదు. క్వాచిత్కముగా నెచ్చటనైన నుండుటనుబట్టి వైయాకరణుడు గ్రహించనేమో. కోపించు, కోపగించు అను రూపము లున్నవి. నిఘంటువులలో నీరూపద్వయమును సమానార్థకమే లైనట్లు సూచింపబడియున్నదిగాని (అప్పగించు - ఒప్పగించు - ఒప్పించు; కోపించు-కోపగించు) వీనికి గొంతయర్థభేద మున్నట్లు పొడకట్టకపోదు. ఒకవిషయమై వానిని ఒప్పించుట-తనతో నేకీభావము కలవానినిగా జేసికొనుట ఒప్పించుట. లేదా ఒకపనిని చేయుట కంగీకరించునట్లుగా జేయుట ఒప్పించుట. ఈ యర్థమునసే 'ఒప్పగించు'అనునది ప్రయోగింపబడునా? మూలార్థము ఒప్పు-ఏకీభావము-అగునట్లుగా చేయుటయే లైనను, వ్యవహారమున నొక వస్తువును వానియొద్ద నుంచుకొని రక్షించుటకు అంగీకరించునట్లు చేయుట అను నర్థములో బ్రయోగింపబడుచున్నది. ప్రాచీనకాలమున "తన కానుక లొప్పగించి" - "కానుకలను ఇచ్చి" అను నర్థములోగూడ నుండియుండును. కాని 'ఒప్పించుట' 'ఇచ్చుట' కాదుగదా. ఒకనిని పట్టి మఱియొకని కొప్పగించుటకును, ఒప్పించుటకును భేద మున్నది.

ఇంతకును ముఖ్యముగా మనము గమనింపవలసిన దేమనగా, నీభాషలలో కొన్ని మూలధాతువులపై నాధాత్వర్థమును క్రియారూపముగా మార్చుటకు, లేదా ధాత్వర్థమునందలి క్రియాభావవ్యక్తీకరణమునకు గాని, ఆభావముయొక్క భిన్నచ్ఛాయలను సూచింపవలసినప్పుడుగాని వేరొక ధాతువును జేర్చి చెప్పుచుండెడివారనియు, కొంతకాల మైనపిదప నుచ్చారణవేగముచేతగాని, స్వరము, ఊనిక మొదలగువాని యందు గలిగిన భేదముచేగాని యా చేర్చబడిన ధాతువులోని భాగము లేశమైన లోపించినచో, తరువాతి కాలమువా రది యంతయు గలిసి యొకే ధాతువనియో, లేదా అర్థభేదమును సూచించు నాయావర్ణము లేమూలధాతువుయొక్క యవశిష్టభాగములో తెలియనప్పుడు అవి ఆయాయర్థములను సూచించు ప్రత్యయములనియో తలచుట సంభవించిన దనియు తెలియవచ్చుచున్నది. ఇంతేకాక యావర్ణముల నితరధాతువులపై గూడ నాయర్థమున జేర్చుచుండుటయు గలుగవచ్చును. ఇట్లాయావర్ణములు మూలార్థమేమో తెలియక ఒక ప్రత్యేకార్థమును సూచించు వ్యాకరణచిహ్నములుగా బరిణమించును. ఇట్టి చిహ్నములు పెరిగినకొలది ఆ భాషయొక్క ప్రత్యయాంశావస్థ ముదురుచుండును. కొంతకాలమున కిప్పటి ఇండోయూరపియన్ భాషలయందువలెనే వాని పూర్వ చరిత్రమును దెలిసికొనుట కవకాశము లేని స్థితి యేర్పడవచ్చును. ప్రస్తుతము ద్రావిడభాష లనునవి యట్టి స్థితి కింకను వచ్చినట్లగపడదు. వాని సంయుక్తపదరూపావస్థ (Agglutinative nature) కొంతవర కింకను సువ్యక్తముగానే యుండుటచేత, తత్తద్భాషాసంప్రదాయరీతులనుబట్టి, అందు ప్రత్యయావస్థను బొందినవాని పూర్వచరిత్ర నన్వేషింప యత్నించినచో, వాని మూలరూపములను కనిపట్టుటయేకాక, వీని కన్నిటికిని మూలభాష యనదగిన ప్రాచీనద్రావిడ భాషయొక్క స్వరూపలక్షణముల నూహించి తెలిసికొనుటకు దగిన యవకాశ మేర్పడగలదని తోచుచున్నది.

ప్రస్తుతము అద్దానులకు,అప్పానులకు ఇంచుక్ పరమైనపుడు చేయబడిన 'గు'గాగమము కేవల మర్థము లేని 'గు'వర్ణమాత్రముగాక అద్దు, ఒప్పు మొదలగు వానికి ధాతుత్వమును కల్పించుటకుగా జేర్చబడిన 'అగు' అను సహాయధాతువుయొక్క యవశిష్టరూపమైయుండు నని ఆయారూపముల యర్థవిచారణవలన మనకు దెలియవచ్చుచున్నదిగదా. వాస్తవముగా అద్దను, అప్పను, కోపను అనునవి స్వతంత్రధాతువులుగా నీభాషలో లేకపోవుటనుబట్టియు, 'ఇంచు' చేర్చినప్పుడే ఈ గువర్ణము కనబడుచుండుటనుబట్టియు ఇది 'ఇంచు' అనుదానిని జేర్చినపుడే వచ్చు నొక ఆగమ మని వైయాకరణులు తలచుటలో నాశ్చర్యము లేదు.

ఈ 'గు' వర్ణమిట్టిసందర్భమునసే కాక యీ భాషలలో ధాతువులుగ బరిగణింపబడుచున్న యనేక

రూపములలోఁగూడ గనబడుచున్నది. ఆంధ్రవైయాకరణు లట్టి సువర్ణాంతరూపమునే ధాతువుగ గ్రహించి, దానినుండి క్రియారూపనిష్పత్తి సలుపుచున్నారు. అట్టి వానిని గొన్నిటిని బరిశీలింతము. వైయాకరణులు చెప్పిన అడంగ్యాసులు కలవు. వీనికిని ప్రేరణేంచుక్కు పరమ సువవుడు వీని కడవ్రాలికి బహుళముగా లోపమును విధించినారు. అనగా 'ఒప్పగించు-ఒప్పించు' వలెనే అడగించు-అడచు; కరగించు-కరచు; నలిగించు-నలచు- ఈరీతిగా సువర్ణాంతములుగా గ్రహింపబడిన ధాతువుల నుండి సువర్ణవిరహితములగు ప్రేరణార్థకరూపము లేర్పడుచున్నవి. వెనుకటివానికిని, వీనికిని భేద మేమనగా, అవి—అప్పారులు — సువర్ణాంతములు కావు. కావున ఇంచుగాగమము చేసినప్పుడు నుక్ విధానము చేయవలసివచ్చినది. ఇవి సువర్ణాంతములు. కావున రెండవ రూపమును సాధించుటకు కడవ్రాలికి లోపము చేయవలసివచ్చినది. మొత్తముమీద ప్రేరణార్థమున 'ఉ' వర్ణవిరహితరూపములు అచ్చట నిచ్చటగూడ నుండుట నిశ్చయము. ఇట్లే ఇంకను కొన్ని క్రియారూపములలో నీ సువర్ణము కావరాకుండుటచేతనే ఇది మూలధాతువునకు సంబంధించినది కాదని, 'అగు' అను సహాయధాతువుయొక్క అవశిష్టభాగమని ఎంచబడినది.

వీని నితర భాషారూపములతో బోల్చిచూచినచో వీనియందలి 'ఉ'వర్ణము సహజముగ ధాతుగతమో, లేక యాగంతుకమో యను విషయమే కాక ఆయాధాతువుల మూలరూపము లేమైయుండునో యను విషయము గూడ గొంతవరకైనను దెలియకపోదు. అట్టివానిని గొన్నింటిని బరిశీలింతము.

అడఁగు—అణఁగు—అడఁగు < అఁగు. cf అఁగ= అడ్డము. త. అడి=To strike, Press; అడై Obstruct, Hide, Conceal. క. అడె, అడగు = To hide, Disappear.

అఱుగు = జీర్ణించు. త. అఱు; క. అఱుగు.

అలఁగు = శ్రమపడు. త. అలు; క. అల=To be tired, weary.

ఇలుగు = చచ్చు, త. మ. ఇఱ=To die.

ఉడుగు = కృశించు. త. ఉడై; క. ఒడె = To break, Crack, Despair. క. ఉడుగు=To shrink, To desist. (సం. ఉపహత ?)

ఊఁగు—త. మ. క. ఉఱల్ = To swing, Oscillate. త. ఊఁజ్ఞ, ఊచల్, ఊంచల్ = ఉయ్యాల.

ఎఱఁగు = దిగు, నమస్కరించు. త. క. ఇఱి; తు. ఇళి = To come down. త. ఇఱంకు; క. ఎఱగు.

ఎఱుఁగు = తెలియు. త. మ. క. అఱి = To know, Understand.

ఒదుఁగు = తొలఁగు. త. ఒత్తు=To make room for, ఒదుంగు=To step aside.

ఒరగు=వంగు, వ్రాలు. త. ఓరం=Sideways, Edge. క. ఉఱగు=To be bent (సం. ఉద్వర్త్?)

కడఁగు=యత్నించు. త. మ. తు. కడ (కడచు) To pass through, To excel, Overcome. త. కడమై=Duty, Obligation (సం. కృత?)

కదుగు=ప్రక్షాళించు. త. కఴు, క. కళె = To remove.

కరఁగు=ద్రవించు-త. కరై=To be reduced from a solid to liquid form, dissolve. క. కరంగు.

కలఁగు=కలతపడు. త. కల=To mix, Mingle కలక్కం=Distress, Perplexity.

కలుగు=అగు, క. కలి=To join, To come together.

కాఁగు=తపించు. త. క. కాయ్.

క్రుంగు=దిగబడు. త. కుఴి=To dig, Make hollow.

గొఱుగు=క. కెరె-కెరె=to Shave. త. చిరై.

చినుఁగు, చిరుఁగు=ఛిన్నమగు. త. క. కీఱ్= To tear, Rend, (సం. ఛిద్?)

చివుకు-చీఁకు=సారహీనమగు. క. కి-ర క్తపక్వే, కివు=To be decomposed. త. చీ, చీఱ్.

చెరుగు—క. కేఱు; మ. చేఱు=To Winnow.

డాఁగు=దాఁగు. త. అడై=To hide. అడఁగు> డాఁగు (Skt ధా?)

డిగు=దిగు. త. ఇఱి, ఇఱు=Come down, Descend-క. ఇళిదు.

తఱుగు=ఖండించు. త. క. తఱి=To cut off, Chop off into small pieces.

తరుగు-తగ్గు. ఇది 'తా-తరు' అనుధాతువునుండి యేర్పడినట్లున్నది. త. తా-తరుదల్ = To give, Hand over. తరువు=Giving. తరుకు=Brokerage.

తొలగు, త. తొలై, తులె. క. తొలగు=To go away; To go aside.

తిరుగు=సంచరించు. త. మ. క. తిరి=To turn round.

తునుఁగు=ఖండితమగు-త. తుని=To cut. క. తుండు, తునుకు, తె. తుండు, తునియ, తుంపర...

తూఁగు-త. తుయల్ = To wave, Swing, Hang.

తొడఁగు=ప్రారంభించు, త. తొడు=to touch మ. తుడజ్ఞు; క. తొడగు=To commence, Undertake.

తోఁగు, దోఁగు—త. క. తుదు, తోయ్=To dip, Soak.

తొరఁగు=స్రవించు-త. చోరి, చురి, క. తొరి=To flow down.

నుడుగు=త. నొడి, క. నుడి=To sound, Utter, Speak.

పఱఁగు=త-పఱ=To fly, Run swiftly. క. పఱె, పఱు.

పెరుఁగు=త. క. పెర్, పేర్=big. Largeness, పెర్పు. Increase.

పెనఁగు=త. మ. పిన్ను=To twist, To be entangled. క. పెణె=To entwine.

మడఁగు=వంగు-త. క. మడి=To fold, A fold క. మడిసు=To fold. cf మడచు.

లేఁగు=క. త. ఎళ్, ఏఱు=To rise.

విఱుగు=త. మ. విరి. క. బిరి = To burst, Open, To crack.

వెలుఁగు=ప్రకాశించు. త. వెళ్, క. బెళ్=White, Shining త. వెళక్కు=Light. cf. వెండి-క. బెళ్లి, వెళ్ల.

తెలుగులోవలెనే కన్నడమునను పెక్కుధాతువులు గువర్ణాంతములుగనే గ్రహింపబడినవి.

అగు-ప్రాదుర్భావే; కూగు - ఉచ్చైర్ధ్వనౌ; తూగు - తులనే; పొంగు - స్ఫుటనే; తొలగు - వివిక్తే; కరగు- విలీనే; ఎఱగు - ప్రణతే; మఱుగు - సంతాపే; తుఱుగు - సంఘర్షే; ఉడుగు - సంకోచనే; తొడగు - ప్రారంభే; ముఱుగు - నిమగ్నే; తగ్గు - క్షీణత్వే; మొగ్గు - నమనే; మొఱగు - వాదనక్రియాయాం; నుగ్గు-సంచూర్ణే; కుగ్గు- ఆకుంచనే; కగ్గు - కార్ష్ణ్యే ఇ మొ. (శబ్ద. ద. ధాతుప్రకరణ.)

వీనిలో కొన్ని తెలుగులోగూడ నట్లే యున్నను, మఱికొన్ని తెలుగురూపములకు వెనుకటి రూపములను జూపుచున్నవి వలెనే యున్నవి. 'ముఱుగు' అనునది 'మునుగు' అనుదాని ప్రాచీనరూప మన వచ్చును. అట్లే తగ్గు — తగ్గు; మొగ్గు - మ్రొగ్గు, మ్రొక్కు; మొఱగు - మ్రోగు; నుగ్గు - నుగ్గు; కుగ్గు - క్రుంగు; కగ్గు - కగ్గు అనురీతిగా తెనుగులో మారినవి. ఇవి చిరకాలమునుండి యీభాషలలో గువర్ణాంతములే యైయుండు ననుటకు సందేహము లేదు. కాని యీభాష లన్నిటిలో గూడ నాయాధాతువులనుండి యేర్పడిన యనేక శబ్దములలో-ముఖ్యముగ నామవాచక శబ్దములలో నీ గువర్ణ మగపడకుండుటనుబట్టి ఇది ఆయా మూల ధాతువుల క్రియాభావమును వ్యక్తీకరించుటకుగా జేర్పబడిన యొక సహాయధాతువునకు సంబంధించిన భాగముగాని వేరు కాదనుట స్పష్టముగునుగదా. అట్టి

సహాయధాతువుగా చేర్పబడుటకు దగిన ధాతువు 'అగు' అనున దొకటి కనబడుచునేయున్నది. కావున నతిప్రాచీనకాలముననే యనేకమూలధాతువులపై నీ 'అగు' అనునది చేరి, వానిని ధాతుపల్లవములనుగా చేయుటకు దోడ్పడియుండు ననుటకు సందేహింప నక్కరలేదు. ఒకవేళ 'కుం' అనునది వర్తమానార్థక ద్యోతకము, లేదా చిహ్నమైయుండునా అని తలచుటకును వీలులేదు. ఏలయనగా ననేకములగు నితరధాతువులపై 'కుం' వచ్చుట లేదు. కాని 'ఉం' అనునదిమాత్రమే వచ్చుచున్నది. నడచును, పాడును, తినును, వెడలును, పీడును, మానును, ఆగును. తమిళమునందును అకుం, పాడుం, వరుం మొదలగువానిలో 'ఉం' అనునదే తద్ధర్మార్థకరూపమును గల్పించుచున్నది గాని 'కుం' వచ్చుటలేదు.

దీనినిబట్టి తేలిన దేమనగా ప్రాచీనకాలము నందలి ద్రావిడభాషలో అడ్, కలి, వలి, అలె, అజి, కిల్, తిర్, తల్, కుతి, తుఱ్, పెర్, పెనె, పలు, ముగి, మడి, వెళ్ మొదలగునవి మూలరూపములుగా నుండగా, వాని క్రియాభావములను వ్యక్తము చేయుటకు అగుట, సంభవించుట, ప్రాప్తించుట అను సామాన్యార్థము గల 'అగు' ధాతువు వీనిపై చేర్పబడియుండుటచే, అడఁగు, కలుగు, నలుగు, ఎలుగు, తిరుగు, తునుగు, పెరుగు, పెనగు, మూగు, మడగు, వెలుగు మొదలగు రూపము లేర్పడిన వనియు, వీనిపై 'ఉం' చేరుటచే తద్ధర్మార్థకరూప మేర్పడిన దనియు తలపదగియున్నది.

ఈ గువర్ణాంతము, లేదా 'అగు'ధాత్వంతరూపము పైవలెనే కొను, ఆడు మొదలగు సహాయధాతువులతో గూడిన ధాతుపల్లవ రూపములనుండియు తద్ధర్మార్థక రూపము 'ఉం' చేర్చుటచేత నీగదా యేర్పడుచున్నది. చూడుడు.

చేసికొను—చేసికొనును. త. శెయ్దుకొళ్లుం.

పోరాడు—పోరాడును.

ఏర్పడు—ఏర్పడును.

ఒప్పారు—ఒప్పారును.

కొనిపోవు—కొనిపోవును.

కూర్చుండు—కూర్చుండును.

అడ్డగించు—అడ్డగించును.

తల్లడిల్లు—తల్లడిల్లును.

ఏగురెంచు—ఏగురెంచును—ఏతేరును. ఇచ్చట మాత్రము 'తెంచు' నకు 'తేరు' కూడ వచ్చి రెండు రూపము లగుచున్నవి.

ఇట్లే వచ్చు, తెచ్చు మొదలైన ధాతువులకు వచ్చును, తెచ్చును అనియే తెలుగున రూపము లగుచున్నను తమిళమున వరుం, తరుం అని రేఫసహిత రూపము లగపడుచున్నవి. దీనినిబట్టి విచారింపగా అడఁగు, తలఁగు, వెలఁగు మొదలగువానిలోని 'గు' వర్ణము సహజముగా మూలధాతువునకు సంబంధించినది కాకపోయినట్లే ఈ తెచ్చు, వచ్చు, పుచ్చు, మెచ్చు, విచ్చు, త్రచ్చు, గ్రుచ్చు, నచ్చు, చొచ్చు, నొచ్చు, చచ్చు మొదలగు రూపములలోని తుది 'చు' వర్ణముకూడ నేదో యొక సహాయధాతువుయొక్క యవశిష్టభాగమే యేమో యని తలంపదగియున్నది. ఈ 'చు' వర్ణ మీధాతువులనుండి నిష్పన్నమైన రూపము లన్నిటిలో కనబడుట లేదనియు, కొన్నిటిలో వేరు రూపము లగుచున్నవనియు వ్యాకరణమున జెప్పబడినదానిని బట్టియే తెలియుచున్నది గదా. 'తెచ్చు'నకు తే - తేరులు, 'వచ్చు'నకు రా, 'చొచ్చు'నకు 'చొరు', చచ్చు నొచ్చులకు చా-నోవులు—ఇవి కొన్ని రూపములలో నాదేశము లగుచున్నవి. సామాన్యముగా నొక ధాతువుయొక్క సహజరూపము, లేదా మూలరూపము విధ్యర్థకమధ్యమపురుష క్రియారూపములో గానబడుచుండును. ఇది వ్యవహారములో తొలుదొల్త ప్రయోగములోనికి వచ్చియుండదగు రూపముగనుక. కాని ఇటీవలి భాషలో కాలక్రమమున గువర్ణాంతములు, చువర్ణాంతములుగూడ విధ్యర్థకములుగా బ్రయోగింపబడుచునే వచ్చినవి. ఏలయనగా అవియే ధాతువులుగా గ్రహింపబడినవి గనుక. 'తెచ్చు'నకు విధ్యర్థకము 'తే' అని, 'వచ్చు'నకు 'రా' అని మన భాషలో నున్నవి

గాని, ఇతర భాషారూపములతో బోల్చిచూచినచో, ఈభాషలోని యితరరూపములతోగూడ బోల్చినచో తెర్, వర్ అనునవి మూలరూపము లనిపించును. తమిళమున నివి తర్, వర్ అను రూపముల నున్నవి. ఆభాషలో 'తా' ధాతు వనియు, 'తర్' దాని రూపాంతర మనియు, అట్లే వర్, (క. బర్) ధాతు వనియు, 'వా' 'బా' వాని విధ్యర్థకరూపములనియు చెప్పెదరు. విచారింపగా 'తర్' 'వర్' అనునవి మూలరూపము లని తోచకపోదు. వ్యతిరేకరూపము త. 'వరాదు' క. 'బారదు'. ఇందు వర్—బర్ అను రూపము కనబడుచునే యున్నది.

ఇట్లే చొచ్చు—చొరు; మెచ్చు—మెఱు; పుచ్చు—పురు; త్రెచ్చు—తెఱు; విచ్చు—విడు; గ్రుచ్చు—కో—కోర్; నచ్చు—నమ్; చచ్చు—చా; నొచ్చు — నో అనియు మూలరూపములైనట్లు వ్యక్తమగుచున్నది. ఐనచో నీ 'చు' అనునది మరియొక ధాతువునకు సంబంధించిన దనియు, నాయాధాతువుల లోని రేఫాదుల కీచువర్ణముతో గలిగిన సవిూకరణము (Assimilation) మూలముగా నీధాతువులు 'చ్చు' వర్ణాంతము లైనవనియు తెలియుచున్నది. విచ్చు, గ్రుచ్చు మొదలగువాని యర్థమునుబట్టి యివి విడు, కో-కోర్ అనువాని ప్రేరణార్థక రూపములుగా గనబడుటచే నీ 'చు' అనునది కన్నడమున 'ఇసు' అను రూపము గలిగియున్న 'ఈ' ధాతురూపమగు 'ఇచ్చు' అను దానికి సంబంధించిన దని యూహింపనగును. విడు-వదలుట; విడిసు-విడుచు=వదలునట్లుగా జేయుట-విచ్చుట. దీనినుండి మరల ప్రేరణార్థకము 'విప్పుట' అనియు నేర్పడినది. కాని విడుచు - విచ్చు అయిన దనుటకు సందేహము లేదుగదా. అట్లే తెర్ + ఇచు= తెరిచు > తెర్చు < తెచ్చు. వర్ + ఇచు = వచ్చు, (క. బరిసు); చొర్ + ఇచు = చొర్చు, చొచ్చు; మెల్ + (ఇ)చు = మెచ్చు (క. మెఱయిసు); తె- మెఱయించు; కో—కోర్ + (ఇ)చు = (కోరిచు) గ్రుచ్చు; నో + (ఇ)చు = నొచ్చు; చా + (ఇ)చు = చచ్చు; పుర్ + (ఇ)చు = పుచ్చు (cf. ప్రుచ్చు, ప్రువ్వులు—పురుగులు, ప్రువ్వంటిట్టు) ఈ మొదలగు రూపము లేర్పడియుండును. కావున వర్, తర్, చొర్, మెఱ్, కోర్, చా, నో మొదలైనవే మూల ధాతువు లనియు, తెలుగున ధాతువులుగా గ్రహింపబడినవాని తుద గనబడు 'చ్చు' అనునది 'ఈ' ధాతు రూపాంతరమగు 'ఇచు' అనుదానిలోని 'చు' వర్ణ మాయాధాతువులలోని యంత్యవర్ణముతో గలియుటచే నేర్పడిన దనియు స్పష్టమగుచున్నది.

ఇట్లొక కాలమున సహాయధాతువుగనో, ప్రేరణార్థమునకో చేర్పబడిన 'ఇచు' అనున దాయామూల ధాతువులతో జేరి మార్పు జెందిన దగుటచే దీని తొలి రూపము మరుగుపడి, కాలక్రమమున 'చు' వర్ణకమో, ఇంచు గాగమమో యనుట తటస్థించినది. ఈవర్ణములు మరికొంతకాలమున కాయాయర్థములను బాగుగ వ్యక్తీకరింపకున్నచో మరల వానిపై వేరుశబ్దములు, ధాతువులు చేర్పబడుచుండును.

మెఱ్ - మెఱయు: ధాతువు, మెఱ్ + ఇంచు- మెచ్చు, మెరయించు, మెఱయనిచ్చు. దీనిపై 'కొను'- మెచ్చుకొను. దీనిపై ప్రేరణము మెచ్చుకొనజేయు. దీనిపై విధి మెచ్చుకొనజేయవలయు. విర్-విడు + ఇచు=విడుచు-విచ్చు-విడిపించు. దీనిపై కొను - విడిపించుకొను. దీనిపై చేయు-విడిపించుకొనజేయు.దీనిపై వలయు - విడిపించుకొనజేయవలయు (+ ఉమ్)ను.

ఇట్లీభాషలలో నర్థభేదమును సూచించుటకుగా నొక ధాతువుపై మఱియొక ధాతువును జేర్చుటచే రూపకల్పనము జరుగుచుండుటయేకాక ఆయా ధాతువులు సామాన్యముగా నారూపములందు తమ స్వరూపమును, స్థానమును నిలుపుకొనుచు నుండుటనుబట్టియే యీభాషలు సంయుక్తపదరూపము (agglutinative) లని చెప్పుటకును, వాని పూర్వరూపము లన్వేషించి తెలిసికొనుటకును గొంతవరకైనను సాధ్యమగుచున్నది.

# వైచిత్ర్యము

= శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ =

●

చిత్రకవిత్వము మునుపు మనము విచారణచేసిన వక్రరచనావిశేషమే కాని యన్యము కాదు. కనుకనే మనము సౌలభ్యముకొఱకై, వక్రతచే చిత్రరచనయు, నీచిత్రరచనాపరిణామముగ ధ్వనిశ్లేషాదులును క్రమముగ కలుగుచున్నవని సూచించునట్లు వీనిని వేర్వేరు ప్రకరణములందు చర్చించుచుంటిమి. ఆనందవర్ధనుని ధ్వనియు, నభినవగుప్తుని వైచిత్రియు, కుంతకుని వక్రతయు సహోదరములే కాక యభేదము లనుట సర్వాలంకారికసమ్మతము. "కావ్యమనెడు కాంతకు రసము జీవితము; శబ్దార్థములు శరీరము; గుణములు శౌర్యాది గుణములు; రీతు లంగస్థానవిశేషములు; ఉపమాద్యలంకారములు కటకకుండలాద్యలంకారములు; దోషములు కాణత్వఖంజత్వాదులు" అనికూడ వారు చెప్పియున్నారు. ఇంతకును చిత్రకవిత వక్రోక్తిరూపాంతరమును, పైజెప్పిన ట్లలంకారగుణరీత్యాదిగర్భితము ననుట నిస్సందేహము.

ప్రపంచమందలి యన్నివస్తువులవలెనే కవిత్వమందలి యాంతరప్రేరణయు[1] నొక్కొక్కప్పుడు క్షీణించుచుండును. కాగా భావనాశక్తి[2] కుంటువడును. ఐనను కవిత్వము వ్రాయవలయు ననునపేక్ష యొకటుండును. ఇది విరుద్ధముగ గన్పడవచ్చునేమో కాని సత్యము. ఇట్టి యిచ్ఛ ప్రేరణ కాజాలదు.[3] వాంఛనే విశుద్ధమైన ప్రేరణగ భ్రమించి రచనకు బూనుకొనిన కవుల కృతులు నిర్జీవముగ నుండుట తటస్థించుచున్నది. ఆంతరప్రేరణ క్షీణించి, భావనాబల ముడిగినపిదప కవిత్వము వ్రాయవలెనని కేవలము కలిగెడి యాస్థచే నిర్మించు కావ్యమందు గత్యంతరము లేక చిత్రరచన తలయెత్తి తీవ్రప్రయత్నసాధితముగ గన్పడును.

ఒకానొక కవి ప్రతిభాశాలి గాకయు, నిశితమైన భావనాశక్తి లేకయు, నొకేభావమును మాత్రము గల్గియుండి తన భావశూన్యతను మరుగుపరచుటకై యా యేకైకభావమును నానావర్ణకిమ్మీరితము చేయుట యిట్టి రచనావిధానమునకు ప్రథమసోపాన మని తోచును. దీనినే యేకభావోన్మాద[4] మందురు. ఇట్లు రసభావములందు వివిధత్వము ప్రదర్శింపలేకపోవుట యను జడిమ యొకానొక యుగమున కంతకు తటస్థించును. భావనాశక్తి యుడిగిన కాల మని దీనినే యందుము. ఆంగ్లమందుకూడ నొక్కొక్క యుగ మిట్లే ప్రతిభాశూన్యమైపోవు టెల్లరు నెరుగుదురు. ఆంధ్రమున ప్రబంధయుగమంతయు నిట్టిదే! ప్రబంధాకాశమునకు వేగుచుక్క 'శృంగారశాకుంతలము' పొడచూపెను. ప్రబంధయుగము పలపలమని తెల్లవారినది. శ్రీనాథపోతనల దీర్ఘసమాసములే కావు. ఎన్నియో యనుకరణములు ప్రబలినవి. స్వతంత్రకథావిధానము లేదు. స్వతంత్రభావనాబలము లేదు. జాతీయమైన భాష లేదు. శుద్ధాధ్యాత్మికవిషయమే లేదు. ఆత్మశూన్యము; వీర్యము శూన్యము; శక్తి శూన్యము; సారము శూన్యము; వైశద్యము శూన్యము; ప్రాణమే శూన్యము. బహుదూరాన్వయము; బలాత్కృతాలంకారములు; ఉజ్జ్వలత్ప్రతిభాదూరములు, నసంబద్ధములు నగు ప్రలాపములు; జీవకళాహీనములై జడసమానము

1. Inspiration.

2. Imagination.

3. "Poetic inspiration is one thing and the inclination to writing poetry is another."

4. Mono-mania.

లగు పాత్రలు; అంగాంగసాంగత్యభంజకములగు నష్టాదశవర్ణనలు; శిల్పము రసము లేని ద్వ్యర్థి త్ర్యర్థి శబ్దపై చిత్రులు—సర్వము స్వాభావికవిరుద్ధము. ఎచ్చట జూచినను నీచదాస్యము! ఇట్టి భావనాశక్తి శూన్యులైన కవులనే సంకుసాల నృసింహమహాకవి నిరసించుచు వారి కవితనుగూర్చి "పరికింపఁగ లజ్జలేని బానిసగాదే!" (కవికర్ణ. పీఠిక, ప. ౧౫) అని పల్కినాడు. 5

అనుచో నిట్టి రచన మెట్లు ప్రజాదరపాత్రమైనది యని కొందఱు ప్రశ్నింపవచ్చును. దీనికి ప్రత్యుత్తరము బహుక్లిష్టము. భావములందు నానాత్వము, వ్యక్తీకరణమునందు సౌలభ్యమును లేని యానాటి కవులెట్లీవైచిత్రిని ఆదరించిరో యట్లే ప్రజాభిరుచియు దాని నానందించియుండును. లేదా ప్రజాభిరుచిని బట్టియే కవులు అసలు దీని నారాధించియుందురు. ఏలయన, కవిత ప్రజాభిరుచి ననుసరించియుండును. లేనిచో నది యాయుగమువారికి కవితయే కాదు. తన యుగమున కుపకరించునదే మహాకవిత. ఈప్రతిభాభావమైన కేవలచమత్కారసమన్వితచిత్రకవిత యొకప్పుడు జనామోదము నొంది వారి నానందింపజేసినది. కనుక దీనిని కవిత్వము కాదనలేము. మన తెలుగుల కవితాత్మ కది యొకరకమైన యభిరుచి యబ్బిన దనుకొనవలెనేకాని దానిని నిరసింపరాదు. ప్రయోజనము లేకపోవుటయేకాక నిరసించుటలో నర్థము లేదు. ఆనాటి ప్రాతపదార్థములు క్రొత్తచవుల మరగిన మన జిహ్వల కెట్లు రుచ్యములుగ నుండును? ఆకాలమే యాయభిరుచిపై నధికారి. అదియే దాని నిందింపవలెను; లేదా యభినందింపవలెను.

కాకున్నచో మన దృష్టిపథమునుండి పరిశీలించి యొక్క విషయముమాత్రము చెప్పవచ్చును. భావన క్షీణించు యుగములలో నేకార్థప్రవణమయ్యు నానావిధశబ్దవర్ణకిమ్మీరితమై ప్రత్యేకప్రత్యేక భావనలుగా కనుపించునట్లు కృతులు చెప్పుట ప్రజల కిష్టమై యుండుటచే నది సులభముగనుక నాకవులు దాని నవలంబించియుందురు. ఒకే భావమును బోధించునట్టి గ్రంథముల నెన్నియో కష్టము లేకయే పాఠకులు పారాయణ చేయవచ్చును. రచన సులభమగుటచే కవులకును, ప్రయాసము లేకయే భావము గోచరించుటచే పాఠకులకును తద్రచన మానందము గల్గించియుండును. అంత చమత్కృతి జూపగల్గినందుకు కవులు గర్వించియుందురు. క్లిష్టపదసంశ్లిష్టమైన భాషాకావ్యమునందలి భావమును సర్వకవిసామాన్యమగుటచే సులభముగ గ్రాహ్యముచేసికొనగల్గినందుకు పఠితలును విఱ్ఱవీగియుందురు. ఇది మన బాలకుల పద్ధతి. గణితశాస్త్రమునం దొక సూత్రమును వల్లించి, యాసూత్రము నుపయోగింపవలసిన యభ్యాసములోని లెక్కల నొక వందవఱకు జేసి, మన బాలురు క్రొత్త క్రొత్త లెక్కల జేయుచుంటి మని పొంగి పొరలి యానందించుచుందురు. ఎన్ని యభ్యాసము లిట్టివి జేసినను తమరు గ్రహించిన విషయ మొక్కటియే యని వా రెంచరు. నూతనవిషయము బోధించు నింకొక సూత్రమును నేర్చుకొనుట కష్టముగనుక దానికంటె కంఠోపాఠముగ వచ్చిన యాప్రథమసూత్రమే సహాయపడు నభ్యాసము లెన్నియైన జేయుట కిష్టపడుదురు. నూతనవిషయమును గ్రహించుట యనినచో వారికి తలనొప్పి వచ్చును. ఈ తెలిసిన సూత్రముపై సాధన జేయుటయే మహావిజ్ఞాన మని సంతోషింతురుగాని యిది యొక యూరుచుట్టును వేయిసార్లు దినదినమును తిరిగి, వచ్చినచోటునకే వచ్చుటవంటి దని తలపరు. పైపెచ్చు ఎంతో దేశాటన జేసివచ్చితి మనుకొందురు. ఇట్టిదే యానాటి కవులయు, పాఠకులయు నానందము.

ఆధునిక భావకవిత్వమందుగూడ నిట్టి యేకభావమును వివిధపద్యశబలతతో ప్రకటించుట గలదు. అందును ప్రణయైకజీవనమే పల్లవిగా గల్గిన రచనలకు ప్రచారము నిచ్చు కవుల పరిమత్తులు గలవు. కవులీరీతిసాహిత్యపథల దీర్చుకొను నాచారము తెలుగుల కవితను రాజులు పోషించు దినములనుండియు వచ్చు

5. "Whose mind is but the mind of
his own eyes,
He is a slave, the meanest we can
meet."
[Personal Talk-Wordsworth.]

చున్నది. సంస్కృతాంగ్లవాఙ్మయములందును నిట్టి విద్వత్సభ[6] లుండెడివి. దినమంతయు కష్టపడుచు శ్రమభూయిష్ఠమైన జీవనము గడపువారికి నానందము గొల్పుటయు, భాషాసేవ సేయుటయు ననునవి పెక్కులు వీరి యాశయములుగా నుండును. కాని యవి నెరవేరకపోవచ్చును. ప్రస్తుతము మన యాంధ్రదేశమునం దిట్టి సభలు కొన్ని కలవు. అందు ప్రపంచానుభవ మధికముగ గల కవులును గలరు. వారిలో కొందఱు కొలఁది భావమును పిష్టపేషణముగ రచించుటాచారమైపోయినది. అందును దేశకాలానుగుణముగాని ప్రణయైకసరణిచే ప్రసంగించుట మఱియు నధికము. కనుక నేకొద్దిగనో రూపము మాఱినను, ఈవైచిత్ర్యరీతి యాంధ్రుల కవితయందు యుగయుగములుగ పాదుకొని చెట్టివలెను నిల్చియేయున్నది.

అర్వాచీనులలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారియం దిది నిబిడము. వీరి రచన లన్నియు స్త్రీపరములుగా నుండును. ఏకభావోన్మాదమునకు మొత్తము మీద వీ రుత్తమోదాహరణము. శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి గారియందుకూడ నీవైచిత్ర్యము కొంతగా కలదు. కాని దానిని కనుబడనీయక వేర్వేరువిషయములనుగూర్చి రచించునట్లు పాఠకులకు దోపజేయుటయందు వీరు సమర్థులు. ఇట్లు శృంగారమును, అందును విప్రలంభశృంగారమునేకాక, పెక్కు రసములను పెక్కు భావములందు జూపగల కవులు మన యాధునికులలో బహుసంఖ్యాకు లున్నారు.

అనగా నీవైచిత్రికి ప్రాధాన్యము నీయక రసవత్తరముగ బహువిషయములపై కవిత చెప్పగలవారని యర్థము. బ్రహ్మశ్రీ రాయప్రోలు సుబ్బారావు, పింగళి లక్ష్మీకాంతముగారు, కాటూరి వేంకటేశ్వరరావుగారు, విశ్వనాథ సత్యనారాయణకవిగారు, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు, మ-రా-శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు, కీ. శే. గురజాడ అప్పారావుపంతులుగారు మొదలగు కొంద ఱిందు ప్రముఖులు.

వైచిత్రి యనునది ప్రబలుటకు భావబాహుళ్యము, భావగాంభీర్యము, విశుద్ధకవితాత్మయు మొదలుగా గలవి లోపించుటయే కారణము లనవలెను. ఈలోపములు బయలుపడనంతవఱకు నాయేకభావోన్మాదకవుల[7] కొకానొక యుగము బ్రహ్మరథము పట్టును. ఇట్టి దౌర్బల్యము పైకి ఉబికినవెంటనే వీ రథోగతిపా లగుదురు. అనంతమైన విశ్వసారస్వతాకాశమున నిట్టి నక్షత్రము లెన్నియో వెలవెలపోవుచుండుట మనము చూచుచుంటిమి. ఇది వారిని నిరసించుటకు గాదు. వాస్తవ మూహింప నేకవిషయోన్మాదులందు కొందఱు సత్కవులే కారు- మహాకవులును గలరు. ఆంగ్లేయులలో 'కౌలీ' యసమానౌన్నత్యము నను భవించిన మహాకవి. కొంతవఱకు నాంధ్రకవులలో భావకవితారీతులందు కీ. శే. గురజాడ అప్పారావు పంతులుగారు, బ్రహ్మశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ప్రభృతు లట్టివారే! వీరి యప్రతిమానఘనత వీరి నభినందించి, స్తుతించుటకై యనుకరించు యువకుల సంఖ్యనుబట్టియే గ్రహింపవచ్చును. కాని యీయనుకర్తలు వీరి నవంతముగ, నన్యాయముగ, దురాగతముగ దోచికొనిపోయిరి. ఐనను వీరుమాత్ర మాంగ్లకవుల నట్లు చేయలేదా యని కొంద ఱందురు. ఎట్లైనను భాషాంతరమునుండి సంగ్రహించుట యొక భాషకు బలుపు నిచ్చును. కాని యాభాషలోనే యొక కవి నింకొకరు దోచుకొని వారు చెప్పినదే వీరును చెప్పుట వాపువంటిది. ఏది యేలం? ఇట్టి యుపగ్రహములు కౌలీప్రభృతుల నాంగ్లమునగూడ నాశ్రయించినవి. ఏకభావోన్మాదులైనను విచిత్రరచన గల కవి కవులకు కవియై (Poets' Poet) కొంతకాలము రాణించును. కాని యాయుత్సవవిగ్రహముల జడత్వమునుమాత్రము తక్షణమే కాలము గుఱుతింపగలదు. అనంతముగ ననుకరణములను వినివినియుండుటచే మనకు మూలముపైకూడ గౌరవము తగ్గును. కాలక్రమమున ననాదరముచే మాతృకలు నశించును. అనుకరణము లరటిగెలలవంటివి, ఇట్లే చిత్రప్రబంధములును తల్లులగండమున బుట్టిన పిల్లలు.

పర్యవసానముగ మనము గ్రహించిన దొక సంగతి. విషయవిభిన్నత్వము లేకపోవుట వైచిత్రికి

6. Poetic Academies.
7. Mono-maniac Poets.

ప్రధానకారణ మనియు, నేకభావవ్యగ్రోన్మాదము దీనికి ముఖ్యఫలిత మనియు నుగ్రాహ్యము. దీనిని యోచింప మనకు విచారము గల్గును. అపూర్వవ్యక్తికరణచమత్కారమును జూపబోయిన మనము తుట్టతుదకు నేడు ఫలితముగ నేకభావోన్మాదకవిత్వమును పొందుచుంటిమి. విలాసార్థము విల్లెక్కుపెట్టి గురి చూచినది పాదములకు; కాని బాణము పోయి తగిలినది యవయవభారకేంద్రమైన నాభిస్థానమునకు. ఇది బహు శోచ్యము. ఇట్టివానిని గురించి చెప్పుటకే కాబోలు,

"అటుకై శెడ్డ విసరి కాలాహి లేపి
తత్ఫలము నందు బాలువిద్ధంబు గంటి."

నని శ్రీయుత విశ్వనాథ సత్యనారాయణకవిగారు పల్కిరి.

విమర్శకు లిందుచేతనే వైచిత్ర్యప్రధానముగ నుండక, కవిత యప్రయత్నలబ్ధముగ నుండవలె నని మొఱలిడుదురు. రస భావాదులకు భంజకములుగ నుండక, ప్రబలప్రయత్నపూర్వకముగను, కడు బలాత్కల్పితముగను తెచ్చి తొడిగిన యాభరణముల వలె కావ్యమం దలంకారము లుండరాదని యానంద వర్ధనుడు ఘోషించెను. అతివర్ణనావిపర్యాసమును నిరసించుచు లొల్లటాదు లీసంగతినే ధ్రువపరచిరి. "అంగినః ప్రధానస్య అనానుసంధానమ్" అని హేమ చంద్రుడు చెప్పుచు, సంగాంగసంయోగము లేని యతివిస్తరవర్ణనాదులు కావ్యకాంతకు ముఖముపైని వ్రణములవంటి వనెను. "ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్న విద్యతే" యను పల్కునకు నిదియే భావము. ఇవి యన్నియు బొందుపరచి విచారించిన యెడల వర్ణనాద్రాఘిష్ఠము, తీవ్రప్రయత్నలబ్ధబంధము నగు చిత్రకవితకు సంస్కృతాలంకారికు లున్నతస్థాన మిచ్చినట్లు లేదు.

చిత్రకావ్య మనగా వ్యంగ్యార్థవాసన లేనిదని యభిప్రాయము. ఆనందవర్ధనాచార్యుడు రసభావాదితాత్పర్యహీనము,వ్యంగ్యార్థవిశేషప్రకాశనశక్తిరహితము, వాచ్యవాచకవైచిత్ర్యాశ్రయోపనిబద్ధమాత్రము, నాలేఖ్యప్రాయము నగునది చిత్రకావ్య మనెను. మఱియు శబ్దవైచిత్ర్య వాగ్వికల్పన ప్రధానమై కావ్యామకారి యగు నిట్టిదానికి కావ్యత్వము సిద్ధింప దని యతడు నిష్కర్షగ జెప్పెను. కాని నూత్నరసికుని దృష్టి ప్రప్రథమమున బాహిరమైన శరీరసంపదపైననే ప్రసరించును. అట్లే కన్యాప్రయత్నమందు చాలమంది కవుల కిట్టి రచన మనివార్య మగుట యోచించి చిట్టచివర కాతడు "ఇట్టిదాని నొక కావ్యవిశేష మందుము" అనెను. మమ్మటుడు నిట్లే యనెను. వాగ్భటు లిద్దఱు. జ్యేష్ఠుడు "సాధుశబ్దార్థసందర్భగుణాలంకార భూషితమ్, స్ఫుటరీతిరసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే"(వాగ్భటాలంకారము)అనియు,హేమచంద్రు ననుసరించి కనిష్ఠుడు "శబ్దార్థా నిర్దోషా సగుణాప్రాయః సాలంకారా కావ్యమ్" (కావ్యానుశాసనము) అనియు ననిరి. వామనుడు కావ్యమునకు నలంకారములు సంయోగసంబంధము (అనిత్యసంబంధము) గలవి యనెను. క్షుద్రము, ననాస్వాద్యము నని ధిక్కరించి విశ్వనాథుడుమాత్ర మిట్టి చిత్రరచనకు కావ్యత నంగీకరింప లేదు. విద్యానాథపండితుడు "దోషవర్జితము, గుణాలంకార సహితము నగు గద్యపద్యరచన కావ్య" మగు ననెను. ఈ విధముననే శబ్దాలంకారభూయిష్ఠమైన చిత్రకవితనుగుఱించి సంస్కృతాలంకారికులు పలువురు పలువిధముల నుడివిరి. అందరు నేకొలదిగనో మొత్తముమీద నలంకారములు కావలె నన్నవారే!

ఇక తెనుగున నాధునికులలో కావ్యవిమర్శక శ్రేష్ఠు లనబరగు మ. రా. శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగా రలంకారములనుగూర్చి యిట్లు చెప్పుచున్నారు: "అలంకారములలో ప్రధానములైనవి యుపమోత్ప్రేక్షాదులు...అనగా పోలికలు స్థాపించుట......భావములు తీవ్రముగ చెలరేగునపుడు వాని యుద్భవోద్రేకములకు హేతువులగు వస్తువులందప్ప నితరములయెడ దృష్టి పారుట యసంభవము. మనసు రేగినపుడు ఆలోచనకు బూనుట యౌచిత్యభంగమునకు ముఖ్యకారణము ...సాదృశ్యములలో గొన్ని సహజములును, అనివార్యములును...కాని భావములు మహోజ్జ్వలముగ రేగునపుడు ప్రకృతమునందే యవధానముంచుట మంచిది" (కవిత్వతత్త్వవిచారము, పుటలు ౨౬, ౨౭, ౨౨) అనగా సంగాంగసంయోగమునకు, రసపుష్టికిని

భంజకములుగాక నాతివిస్తరములు, నప్రయాసలబ్ధము లు, సరళములు నగు నలంకారములు ప్రకరణోచితిని బట్టి యుండవచ్చునని వీ రంగీకరించుచున్నారు. ఇది సరసముగనే యున్నది.

ఇంకొక్కటి మన మాలోచింపవలెను. భావనా శక్తి యంత యధికముగ కాకపోయినను కవికి సామ్య శక్తికూడ కొంత ముఖ్యము. ఎట్టి సామ్యశక్తియు లేని కవి యలంకారాన్వితముగ రచింపలేడు. అలంకార వైచిత్రు లన్యోన్యాశ్రితములు. కాగా చిత్రరచన ముద్భవించుచున్నది. ఈ సామ్యశక్తియే ప్రజ్ఞ, కౌశలము ననియు, వైచిత్ర్యమే విచ్ఛిత్తి, చారుత్వము, చమత్కారము ననియు నాలంకారికగ్రంథములందు పేర్కొనబడినది. ఇది యిట్లుండ భావనాబలము క్షీణించి, కవిత నశింపనున్న యుగములం దీచిత్రత్వ ముద్భవించి కవితకు కొంతవఱకు ప్రాణదానము చేయుచున్నది. ఇందుచే సామ్యశక్తియుక్తమగు చిత్రరచన ముత్తమము గాకపోయినను ద్వితీయస్థానమునైన నాక్రమించుచున్న దనవచ్చును. ఈ యలంకార గుణ వృత్తి రీతి శయ్యా పాకాదు లల్పముగ రసభంగకరములుగాన ట్లుచితరీతిని ప్రయుక్తమగుచో కవిత్వమునకు కొంత శోభగనే యుండును. ఇది కవిత కెట్టి యందమును పొందుపరచుచున్నదో కొన్ని యుదాహరణల జూత ము. అవి యాయాకవుల రచనకు వన్నెతెచ్చిన వను టలో సందేహ ముండరాదు :

నన్నపార్యుడు:—
"ప్రమదాపాదిపయఃప్రపూర్ణమిదిగో
పద్మాకరంబంచు..."
(ఆదిపర్వము, ౬-౧౬౨)

నన్నెచోడుడు:—
"మలపగనున్న కల్పలత
మన్మథునారి నమర్చనున్న కో
మలతరపుష్పబాణము......"
"స్ఫురదాలోకనదీప్తలంగణములం
బొల్పొందగాజూచుచున్"
(కుమార. ౨౪౩-౨౬౬)

తిక్కనార్యుడు: —
"కమగ్గోని కోపవేగమున...
.........నితాంతదంతకీ
డనరటదాస్యరంగవిక
టభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయ
దస్ఫురణాపరిణద్ధమూర్తియై"
"లలితంబులగు మట్టియల చప్పు డింపార
నంచకైవడి నడ నల్లనచ్చి."

నాచనసోమన:—
"అర్ధాంకమంబైన యాలపోకు నతండు
త్రుంచినా డీతండు పెంచినాడు..."
"ఇందుండు హరుమౌళి నిందుండు పెద్దయై
నెత్తంబు నిండు వెన్నెలలు గాయు..."
(ఉత్తరహరి. ౨-౧౫౦, ౬౧)

శ్రీనాథకవి:—
"అహరారంభములందు బ్రస్రవణనై
లాదిత్యకాశందరా
కుహరక్రోడకటాహగద్గదనద
ద్గోదావరీసింధువా
ర్లహరీశీకరమాలికాశిశిరముల్......"
(కాశీ. ౩-౧౪)
"లలితకలాపికోమలక
లాపకలాపకలాపలాపపే
శలమృదుకేశమంజరులు......"
(శైవ. ౬-౫౧)

పెదపాటి ఎఱ్ఱాప్రగడ:—
"మన్మథదివ్యాగమమున కోంకారంబు
భూతేశు నాదల పూలదండ.........
.......................
చంద్రు డుదయించె కాంతిని స్తంద్రు డగుచు"
(కుమారశైవధము, అసమగ్రగ్రంథము)

పోతనామాత్యుడు:—
"స్వస్తిజగత్రయీభువనశాసనకర్తకు, హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు......" (భాగవతము, ౧)
"బలిశైత్యేంద్రకరద్వయీకృతజల
ప్రక్షాళనవ్యాప్తికిన్" (౧-౬౦౧)

"అమరారాతికరాళతోర్ఝితపవి
    క్రాంథికకణశ్రేణికిన్" (౪-౬౧౫)

మడికిసింగన:—

"అతరుణీలలామకు ప్రి
    యంబున చే చని కాంచె నాజగ
త్ప్రాతము, నతయార్తిపరి
    భూతివిధానసమర్థసత్ఫల
వ్రాతము, నవ్యపుష్పమక
    రందవిలోలమత్తషట్పదో
పేతము, దత్తనిర్జరప
    మోహితజాతము పారిజాతమున్."
(పద్మపురాణము)

ఇట్టి చిత్రవిచిత్రగుణాలంకారరీతివృత్త్యాదులకు శ్రీనాథపోతనలు నిధులు. భట్టుమూర్తి ఖని. ఇవి యెంత రమ్యములుగ నున్నవో చూడుడు :

పిల్లలమఱ్ఱి పినవీరన:—

"నిటలంబున నటించు కుటిలాలకంబులు
    షట్పదంబుల విలాసముల గెలువ"
(జైమిని భా. ౪-౩౪)

అల్లసాని పెద్దన:—

"...తుహినభూధరశృంగ
శ్యామలకోమలకానన
హేమాఢ్యదరీఝరీనిరీక్షాపేక్షన్"
(స్వారో. ౧-౮౯)

"అట చని కాంచె భూమిసురుడు..."
(౨-౩)

"ఉల్లలదలకాజలకణ......" (౨-౬)

"సహసావఖంపచ స్తనదత్తపరిరంభ
    మామాలపరిచుంబితాధరోష్ఠ(ము)"
(౩-౧౧౬)

తెనాలిరామకృష్ణుడు:—

"అచలసుతాభర్త కర్పించి మఱిగాని
    మృగములు లేబూరి మేయ వచట..."

"అభ్రగంగాప్రవాహము లెన్నిరో గాని
    తల ధరియింతు రందరును నదుల......"
(ఉద్భటా)

"సంపాతరంగరింఖణ
ఝంపాసంపాత్యమానజలకణరేఖా
సంపాతశీతలానిల
సంపద వొదలించె పరమశైవోత్తంసున్."

"నఖరాగ్రలూనావన స్వేదకోరకం
    బర్థకపాయదృగంచలంబు......"

"కఠినకంఠీరవాకుంఠనఖకుఠజర
    ఠక్కరికరకృత్తికారకకరిలతలము(లు)"

"...............రూపాజీవరాజాననం
దాపింఛచ్ఛదగుచ్ఛదచ్ఛవిమదాం
    ధక్, బంధురశ్రోణిపి
ణాపాణింధమపాణి నొక్క ప్లవక
    స్యం గూడి క్రీడింపగన్."

"ఉష్ణాన హోమాగ్ని నూద నొల్లదు గాని
    విరహజ్వరార్తుడై వెచ్చ నూర్చు"

"పరమేష్ఠినుండి నీతరముదాక విశుద్ధ
    తరమైన వంశంబు దలపనైతి"

"హుంకారములు లేవి, యూపపురందరహాకో
    త్పాటనంబునకు పాల్పడవుగాక"

(పాండురంగ. ౧-౯౯, ౧౨౪, ౧౨౯, ౧౬౬, ౨౧౮; ౨-౪౩, ౪౪; ౩-౧౨, ౩౬; ౫-౧౮౬.)

పింగళి సూరనార్యుడు:—

"విశ్రాంతి విరతి గావింపక"
"శేషుదర్పము చివ్వి శీతాంశురుచి నవ్వి"
"మెఱుగుటద్దము మించు మించుబాగుల నింపు"
"ఈరంభయును వీడు సేవేళయును రతి
    క్రీడాపరాయణుల్ కేవలమును"
"యమునం బాచెను వీచికాచయమునం
    బ్రాంచద్ఘనశ్యామతో
యమునన్"

(కళాపూర్ణ. పీఠిక ౪, ౮౬; ౧-౩౦, ౯౦; ౨-౧౧౭)

భట్టుమూర్తి:—

"ఏరాజా భూరితేజోరుణాలోకంబు
    లోకంబు తమము నిరాకరించు"

"లలనాజనాపాంగవలనావసదనంగ
తులనాభికాభంగదోఃప్రసంగ(ము)"

"ఏపారు పొదరిండ్ల నాపాటలాశోక
దీపార్చికనకకలాప మరసె"

"ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ
మొకచాయ నానామయూరనినద(ము)"

"కనకవల్లీమతల్లీ కలశెంపుజడగుంపు
పువ్వుపరాగసంభూతి భూతి"

"సుమనోధివాసభాసురశిఖోన్నతివాడు
ఘనసారతిలకవాసనలవాడు"

"తలిరుప్రాయమువాని నలరాజు నలరాజు
నలరాజు నెగడు సోయగమువాని"

"పవమానమానవప్లవమానకైరవ
చ్యవమానరజము మైనంట దివురు"

(వసుచరిత్ర, ౧-౩౦,౧౨౫,౧౩౩; ౨-౭,౭౮, ౧౦౭;౩-౮౬,౧౧౮)

ఇట్టి వెన్నియో ప్రబంధములం దిల్లెడను వెలది వెన్నెలల నారబోసిన ట్లున్నవి. వసుచరిత్ర ననుసరించినవారి రచనలం దిట్టివి పెక్కు గలవు. ప్రాచీనుల చిత్రకవిత యొక్కొక్కప్పుడు గుణవృత్తిరీత్యలంకార పాకాదులతో నిట్లు హృద్యముగ నుండు ననుటకై యింతగ విపులీకరింపవలసెను.

సారస్వతచరిత్రయం దంతటను మహోజ్జ్వలమైన భావనాబలముచే భావములు తీవ్రముగ రేగుట యనునదికూడ సర్వదా శ్రేయము కాదు. అంతటి తీవ్రమైన యూహమ్మలతోచే కవిత్వ ముదుక్కిపోవును. కనుక చిత్రరచనావ్యవహారముకూడ నప్పుడప్పుడు పొసగుట మంచిది. ఊహాబలముచే శాస్త్రము, భావనాశక్తిచే కళయు నేర్పడుచున్న వనదగును. అయ్యది మహాశక్తివంతులైన కవులే యొక్కొక్కప్పుడు కొన్ని కృతులను, కొన్ని ఘట్టములను పులిమివేసినట్లు రచించిరి. ఉచితవాక్యపరణితో, నింగితపరిజ్ఞానముతో మనకు కడు సన్నిహితములగు పాత్రల సృష్టించి, నన్నపార్యునంతటివాడైన నంతగ లేదనదగు దృశ్యానుకరణ ధ్వనియందు మిన్నలై, కథాసంవిధానమున మంచి శిల్పము వెలార్చిన యాంధ్రకవితాపితామహుని మనుచరిత్రములోమాత్రము పూర్వార్ధమున గొంత యౌచిత్యము సన్నగిలుటయేకాక, యితిహాసము ప్రబంధమునకు మించినదై కర్త్రైక్యమును చెరచిన దనిపించుట లేదా? ఆంగ్లసారస్వతమందు 'Lake School Poetry' అనునొక సంస్కారప్రధానమగు కవిత పుట్టుట కింకను మూడుశతాబ్దులు పూర్వమే, కళాపూర్ణోదయమున మహాసంస్కృతప్రభావముతో హీనకులసంజాతయగు నాయికను నైగొని శాస్త్రవిరుద్ధమైన శృంగారమును, కడువక్రమైన కల్పితకథయందు దక్షుడై నిర్వహింపగల్గిన పింగళి సూరనార్యుడు "మంగళాంతాని కావ్యాని"యను వృద్ధాచారమును పాటింపక శోకముగూడ నానంద మొసగునుగదా యని మణికంధరఖండితమస్తకయగు నాలలనామణిని పునర్జీవితగ జేయకున్నయెడల నెంత రసానందము కల్గెడిదోకదా! ఇంతియేకాక యీతని కృత్యంతమున చాల కల్పనాశైథిల్యములు వాటిల్లినవి. కథలోని చిక్కు విప్పిచెప్పునపుడు పునరుక్తి కల్గి యది పులిమివేయబడినట్లైనది. షేక్స్పియరు మహాకవివంటివానియం దిది యధికము. అతని 'Measure for Measure' అను దృశ్యకావ్యము భావనాశక్తిశూన్యమై, రంగులుపులిమిన కొయ్యబొమ్మవలె నున్నది. కనుక నిట్టి రచనలు మహాకవులే వెలార్చిరనుట సిద్ధము. అవి యనివార్యము లగుటయేకాక, ద్వితీయస్థాన మాక్రమించు నిట్టి కృతు లనునవి యసలు కొన్ని లేనిచో నిక ప్రథమశ్రేణికావ్యములని కొన్నిటిని విభజించుటయం దర్థము లేకపోవలసివచ్చును. ఇది గల్గుటచేతనే గ్రంథములందు తారతమ్యము నిరూపింప వీలగుచున్నది. లేనిచో నేదియేదో చెప్పలేము. భిన్నభిన్నగ్రంథములందేకాక, యొకేగ్రంథమునందు నీరసములగు ఘట్టము లుండుటయు చూచితిమి. శ్రీ తిరుపతివేంకటేశ్వరుల గ్రంథసంపుటి నంతయు నొక్కమారు చదివినచో నెచ్చట మహాకవిత్వము వెలుగొందినదో, యెచట నల్పరచన వెల్వడినదో తెలియును. కవిత్రయమువారి భారతమునే పరిశీలింపుడు. జిగిలేని రచనము కొంత యుండుట

సర్వత్ర సాధారణము. "నడచుచు నుండువాని చరణంబులకేకద రాళ్ల తాకుడుల్"

ఒక కాలమం దందరును కవిత్వము వ్రాయుట కారంభింతురు. ఎవ్వరు నీయుత్సాహము మాపలేరు. శ్రీ తిరుపతివేంకటేశ్వరకవు లవధానములు మొదలిడిరి. ఇక నందరు వానినే సాగించిరి. "త్యాగయ్య కృతులు పాడిన బోగయ్యయు పాడినట్లు" (గీరతం). కనుక కవిత్వ మొక్కొక్కయుగమందు చెలియలికట్ట మునిగి పోవునంతగ పొంగివచ్చుచుండును. ఏకవికి తన ప్రవృత్తి ననుసరించి ఏరచన మిష్టమగునో, ఆకవి యప్పు డారచనావిధానమునకు పూనుకొనును. ఒకరు అనుకరణములకును, మఱియొకరు శాస్త్రనిబంధనావ్యతిరిక్తములగు వక్రరచనలకును, వేఱొకరలంకారప్రధానమగు చిత్రకవితలకును దారిదీయుచుందురు. ఇట్టివి జడసమానము లనుట సత్యము. కాని యొక సంగతి. సర్వసారస్వతములకు నిట్టిది యనివార్యము. చరిత్రకు తెలిసినంతలో వేయియేండ్ల తెనుగుల కవితయందు, మరియు నీరసమైన ప్రబంధయుగ మతినిరంకుశముగ తన ప్రభావము సాగించినది యొకటి రెండు శతాబ్దులుమాత్రమే! ఇది యొక లక్ష్యపెట్టదగినది కాదు. అదియుగాక లాటిన్ సారస్వతమందలి 'అగస్టన్' యుగమువలెను, ఆంగ్లమందలి షేక్స్పియర్, మిల్టన్ మహాకవులకు జెందిన యుగములవలెను, సంస్కృతమందలి కాళిదాస విక్రమాదిత్యయుగములవలెను, ఆంధ్రుల తిక్కన శ్రీనాథయుగములవలెను ఉత్తమోత్తమకవితాధికారము గల స్వర్ణయుగ మనిపించుకొనలేదుగాని, సరళరచనను పేలవతయు, మాంద్యమును గలదిగ భ్రమించి నిరసించినట్టి రోమనుల 'Silver age of Latinity' వలెనే యాంధ్రుల కవితలోని చిత్రరచన కూడ 'రజతయుగము' కాగలదు. బంగార మెంతయున్నను వెండిని వీథిలో పారవేయము. శ్రీ తిరుపతి కవులు చెప్పినట్లు కాలమునుబట్టి దేశభాషాలలితాంగి మారుట సత్కవిసమ్మతము. ఆవశ్యకతచే నుత్పత్తి గల్గుటయు, నుత్పత్తిచే నావశ్యకత యధికమగుటయు మనము సర్వవిద్యలందు చూచుచున్న విషయము.[8] కనుక నాయాకవులయు, చదువరులయు నభిరుచి సౌలభ్యమును కాదని త్రోసిపుచ్చి, అలంకారభూయస్త్వక్లిష్టబంధనై చిత్రిని సంగ్రహింప మొదలిడిన దని మన మూహించికొందము. వారివారి పరమావధి యేదియో, వారు దాని నెట్లు సక్రమముగ జేరగల్గిరో విచారింపక, ప్రస్తుతము మన యభిరుచితో వారి కృతులను విమర్శించి నిరసించుట ఉప్పు తీయగా లేదనియు, చక్కెర ఉప్పగ లేదనియు వగచుట వంటిది.

ఇక చిత్రరచన మన కెట్లుండునో విచారింతము. స్థూలముగ దీనికి మూడు విలక్షణము లున్నట్లు గోచరించును. వామనుని 'రీతి'యు, భామహాదుల యలంకారసహితశబ్దార్థమును మనకు ప్రస్తుత మతపరమగు విలక్షణములు. మూడవదగు శ్లేషనుగురించి సౌకర్యార్థము 'వైపరీత్యము' అను ప్రత్యేక శీర్షిక క్రింద విపులముగ వ్రాయదగును. దండ్యాచార్యులు 'గుణము' కావ్యమునకు ప్రాణ మనెను. వామనుడు 'రీతి' కావ్యాత్మ యనెను. చిత్రరచన నాదరించు మన కవులు వామనీయులు కారు. వీరు వ్యుత్పన్నవైషమ్యదీప్తిసేయత్వాదుల నవలంబింతురు. ఈనాల్గు నధికముగ చిత్రరచనలం దగుపడును. కనుక స్థూలముగ వీని లక్షణముల వ్రాయుదము :

గుణమతావలంబుల 'ప్రసాదము'నకు 'వ్యుత్పన్నము' విపర్యయ మనవలెను. అనగా ప్రసాదము సులభార్థగోచరతగలది. వ్యుత్పన్నము గాఢమగు బంధమై చిత్ర్యాదులు గల్గి చదువరులకు మనఃక్షోభక్లేశాదులను పుట్టించును. దాని నాదరించుటకు సారస్వతసర్వవిజ్ఞానము సిద్ధింపవలెను.

'వైషమ్యము' 'సమతా'గుణమునకు విపర్యయము. అనగా పరుషకోమలసమ్మిశ్రితము సమత. వైషమ్య మర్థాలంకారదాంభికమును, వికటబంధౌద్ధత్య ప్రకటనమును గలది.

---

8. The demand creates the supply and so often the supply in turn stimulates the demand.

'దీప్త' మనిష్ఠురాక్షరప్రాయికమగు సౌకుమార్యమునకు విపర్యయము. పరుషవర్ణఘటన గల్గి కృచ్ఛ్రోచ్చారణభూయిష్ఠమగుదానినే దీప్త మందురు.

అధ్యాహారాది కష్టకల్పనలు లేక చదివిన తక్షణమే యర్థము బోధపడునట్టి 'అర్థవ్యక్తి' గుణమునకు దూరార్థగోచరత గల 'నేయత్వము' విపర్యయ మనదగును.

ఇంతకు మించి మన కప్రస్తుతము. కనుక యీ వక్రీతిగుణములును, వానిలోని యంతర్భేదములును ఈదృశములగు వ్యత్యాసములు గల్గినవే యని యూహించుకొనిన జాలును. తెనుగుల చిత్రరచనలం దీరీతిమార్గ మధికము. ఉదాహరణల జూపబోయినచో శతగ్రంథపరిమాణ మగును. ప్రతిప్రబంధమందలి ప్రతి పద్యము నేదోయొక యలంకార గుణ రీతి వృత్తి పాకాదులకు సంబంధించియేయుండు ననవచ్చును. వీనిని వేర్వేరు గ్రంథములనుండి యెత్తిచూపుట యిపుడు దుస్సాధ్యము.

కొంతగ నలంకారవిషయ మాలోచింతము. నన్నపార్యుని నాటినుండియు నేటివఱకు నేకొలదిగనో యలంకారసమన్వితముగాని రచనయే లేదు. వ్యాసపరిమితికి సాధ్యమైనంతవరకు నలంకారశయ్యారీత్యాదులు గల పద్యములను ప్రముఖులైన కొందఱి కవుల రచనలనుండి మున్నే యెత్తిచూపితిని. ఇక ఉదాహరణలవంక బోక అలంకారమునుగూర్చి యోచింతము.

"అసలు అలంకార మన నేమి" యని ప్రశ్నించుకొనినచో శబ్దార్థములకు అందమునుగూర్చు రచనయే యని తేలును.

"శబ్దార్థయోః ప్రసిద్ధ్యావా కవేః ప్రౌఢివశేన వా,
హారాదివ దలంకారః సన్నివేశో మనోహరః"
(చంద్రాలోకము, ౫–౧)

అని జయదేవమహాపండితుడు పల్కెను. భరత మహర్షి నాట్యశాస్త్రమున (పదునారవ యధ్యాయము) చతుర్విధాలంకారములను ముచ్చటించెను. పిదప శబ్దార్థాభిధేయాలంకారభేదములు రెండును సమ్మానార్హము లని భామహాదులు నుడివిరి. అలంకారములు కావ్యశరీరమై, శబ్దార్థములకు మొదట సౌందర్యము నాపాదించు ననియు, పిదప కావ్యాత్మభూతమైన రసాదులను శరీరమూలమున శోభస్కరము లగుచున్న వనియు మమ్మటాదులు విశ్వసించిరి. మొత్తముమీద మన యాంధ్రమునందు నిట్టి యలంకారగుణరీతివివర్జితమైన రచన మృగ్యము. వాని నాయాకాలము లాదరించినవి. ఇపుడు నిందించుటకు గాని, పూర్వులవలె లేమని మనలను మన మభినందించుకొనుటకుగాని యెట్టి యగత్యము నున్నట్లు తోచదు.

ఆధునికులందైన నాలంకారికచిత్రరచన లే కొలదిగనో లేవని ధ్రువముగ జెప్పలేము. దుర్గ్రాహ్యమను దూరానేయార్థము లాధునికకవితయందును హెచ్చు నినచో నసత్యము కాదు. అర్జవభావవ్యక్తీకరణము, సరళశైలియు నేటి కవులయం దసలే లేవు. పాఠకుని కంపింపజేసి కీర్తిబుద్బుదమును మూటగట్టుకొనిపోవు నుద్దేశముతో విపరీతభావములను, బీభత్సమును కల్గించు శైలియం దప్పుడప్పుడు అధునాతనకవులుకూడ వ్యక్తపరచుచునేయుందురు. ఒక్కొక్కప్పుడు కవిహృదయమును కన్గొనుటకు పాఠకులము సంభ్రమపడుచుందుము. ఈయవస్థ మన కవిత్వమునకే కాక లలితకళల కన్నిటికిని బట్టిన దనవచ్చును. మహామహు లనదగు మన కొందఱు విద్వాంసుల సంగీతమందు రక్తి కలుగదు. చిత్రలేఖనమందు నిదే యవస్థ పొసగట్టును. చిత్రకారు డీ చిత్తరువునందు విశదపరుపదలచిన విషయ మేమియో యను నది మన కొక సమస్య యగుచున్నది. తాము వాస్తవముగ ప్రజ్ఞావంతులైనను గాకపోయినను పాఠకులును, శ్రోతలును, ద్రష్టలునుమాత్రము అధికధీశాలులుగ నుండవలెనని మన కళోపాసకుల యభిప్రాయ మైనట్లు స్ఫురించును. వారు బుద్ధిపూర్వకముగ కళాగోపనము చేయునట్లగుపడుటయే దీనికి ముఖ్యకారణము.

నిష్కాపట్యముతో, సుఖదుఃఖాదిద్వంద్వవివశమగు మనఃప్రవృత్తిని ప్రత్యక్షముచేయుటయే యాశయముగ గల భావకవిత్వరచనమునందు, నేటి కవులలో కొందఱి కసలు భావ మనునది యున్నచో, నది మర్మము చేయబడుటచే వివిధకంటకావృతమగు

న్రగారణ్యమునందు మనము మార్గమును ఛేదించుకొని పోవలసివచ్చునంత విశేషశ్రమ కల్గుచున్నది. భావాస్పష్టతయే భావగాంభీర్య మనుకొనుట దీనికి ప్రబల హేతువు. అది చిత్రకవిత్వమైనను, మర్మకవిత్వమైనను, తాము చెప్పిన మహనీయవిషయమునకంటె నాశ్చర్యకరమగు విధానమునకై కేవలము మనచే ప్రశంసింపబడుటయే బహుశః మన నేటి కొందరు కవుల ప్రధానవాంఛ కావచ్చు ననిపించును. ఒక్కొక్కప్పు డిది కేవలము అర్థరహితముగ నున్నను, ఇట్టి యద్భుతావహమగు పద్ధతిని ప్రదర్శింపగలిగినందులకుమాత్రము వారు శ్లాఘాపాత్రు లగుదురు.

దుర్గ్రాహ్యమగు భావమయు, భావములను గలిగి, చిత్రప్రజ్ఞాన్వితములై యందమునకు పొందుపడక దానిని మరుగుచేయు నలంకారములను మోయుచు, తుదకు మన శ్రమ కర్హమైన సంతోషవిషయ మేమియును వ్యక్తపరుపని రచనను చదువుటకు వ్యక్తిగతముగ మనము వాంఛింపకపోయినను, ప్రతివాదుల పక్షము నవలంబించినచో నొక సంగతిమాత్రము సమ్మతింప వలసివచ్చును. వాఙ్మయమందలి కవులందరు నొకేవిధముగ తమ భావములను కృతులలో ప్రతిబింబించినచో నవి యన్నియు నొకే యంత్రమున తయారుచేయబడిన వస్తువులవలె నుండి కవుల కర్త్రహంకారమునే (Poetic Personality) నశింపజేయును. భిన్నభిన్న కవులకు భిన్నభిన్న భావవ్యక్తీకరణపద్ధతు లుండవలెను. ఉండుటయు సిద్ధము. కనుక చిత్రకవు లొక శాఖకు చెందినవా రనుకొందము.

కొందఱు కవు లొకశాఖకు చెందుట యటుండ ప్రతికవియు వ్యక్తిత్వము గల్గియుండవలెను. కీట్సు మహాశయుని వ్యక్తిత్వమును గుఱించి ప్రసంగించుచు, 'సైటో' (Saito) పండితుడు పల్కిన పల్కులను9, శైలినిగూర్చి ముచ్చటించుచు ఛార్లటన్ విమర్శకుడును, 10 న్యూమన్ పండితుడును11 చెప్పిన వాక్కులను మరువరానివి. ఇందుచే చిత్రకవుల నొకశాఖకు చెందినవా రనవలెనుగాని కేవలము నిరంకుశముగ, నిర్హేతుకముగ నిందింపలేము.

ఇప్పుడు రెండవ పక్ష మవలంబింతము. అనలంకృతయైన అంగనను రూపవతి యగుచో రూపవతి యనియు, రూపహీనయగుచో రూపహీన యనియు చెప్పవచ్చునుగాని, యొడలంతయు బంగరుతొడవులు గల యీవిద యందగత్తెయో కాదో నిర్ణయించుట దుస్సాధ్యము. ఇట్లే చదువగనే సహృదయుల కర్థము స్ఫుటముగ బోధపడు కవితయే వాసిగల్గి వరణీయ మగును. అదియుగాక యలంకృతగాని ప్రత్యబలయు నందహీనురా లనికూడ ననలేము. యౌవనమందు మాత్రము నిరలంకృతలై, యర్థగంభీరనిష్ఠాన్వితమైన భారతాదిరచనలు కొందఱ నాకర్షింపలేవు. ఉద్రేకమును స్వేచ్ఛావిహారము సలుపనీయక, నిష్ఠురమైన భావనాబలముచే శిక్షించి, యా నిరుద్ధోద్రేకమును యథావిధిగ వ్యక్తపరచుటయే భారతాదిగ్రంథములందలి యాకర్షకహేతువు. ఉదాహరణగ పరీక్షింపుడు:

"చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగ నేటికి తల్లుల కడుపుచేటు!"

---

9. "He (Keats) still felt that 'Paradise Lost' is a great poem, but he was unwilling to imitate it. As Milton had his own style, so Keats had his own, and no poet can write anything genuine unless he is true to himself." ('Keats' view of poetry': page 31.)

10. "Style is the man" ('Art of Literary Study': page 45.) "What makes a writer's style is his use of characteristic words of characteristic order in which he shapes them into sentences of characteristic manner of treating the topics which are the subject of his sentences."

('Art of Literary Study': page 51.)

11. "Style follows man as his shadow." (Newman.)

అనిన భాగవతోత్తముడగు పోతనార్యుని "ఏక మేవా ఽ ద్వితీయం బ్రహ్మ"యను శ్రుతివాక్యార్థము చిన్నవాడు మన కేమి యర్థమగును? ఆత్మవలో కనచే చిత్తశాంతి చేకూర్చికొని పరతత్త్వసందర్శనా నందము నొందిన కవియొక్క సుశ్రావ్యమధుర గాన మందలి యర్థము మన కప్పుడు గోచరింపదు.

"పారవు ధర్మముల్ విమల
సత్యము పాపముచేత బొంకుచే
బారము బొందలేక చెడ
బారిన దైన యవస్థ దత్తు లె
వ్వార లుపేక్ష చేసి రది
వారల చేటుగాని ధర్మని
స్తారకమయ్యు, సత్యశుభ
దాయకమయ్యును దైవ ముండెడున్"
(భారతము, ఉద్యో. 3-౨౮3)

ఇందలి ధర్మార్థసౌభాగ్య మేమియు చిన్నవాడు గ్రహింపలేడు సరిగదా పైపెచ్చు దీనిని పేలవ మనికూడ అనుకొనువారు గలరు.

"హా! యను ధర్మరాజ తన
యా! యను నన్నడబాయ నీకు జ
న్నే యను దల్లి చేపజను
చేయను, కృష్ణుడు నీకెఱచ్చె రా
వే యను, నొంటి నోక దగ
వే యను, నేగతి బోవువాడ నే
నో యభిమన్యుడా యను బ్రి
యోక్తుల నుత్తర దేర్చవే యనున్."
(భార. ద్రోణ. ౨-౨౮౨)

ఇది వట్టి పొడిమాటలతో గూర్చిన పద్య మను కొందురుగాని, సాలంకారములైన యచ్చతెనుగు రామాయణమందలి "రా యనుగాయమం దోగలరా యని సేరు నిగారపుం గొటా రాయను." ఇత్యాదుల చేతనలెనో, లేక రామాభ్యుదయమున సీతావిరహ ఘట్టమందలి "జాయన జాపవేమి యనుజా యను" (౫-౧౦) ఇత్యాదులచేతనలెనో మన మాకర్షింపబడ లేము. దీనికి కారణము భారతమందు కచ్చితముగ విశుద్ధరచన ముండుటయే! చిత్రకృతులం దిట్లుగాక యలంకారకృత్రిమత మనలను శీఘ్రమే కళవరచు కొనును. పోనుపోను మన యభిరుచి స్వచ్ఛశోభిత మగుకొలదియు భారతాదిగంభీరరచనలు మన కెక్కు గలవు. అప్పుడు నిర్వ్యాజమణతయే మహోద్భావన మని గ్రహింపగల్గుదుము. ఉద్రేకములను మొదట సడించు కొని పిదప భావనచే సమన్వయించి రచించుటే యుత్త మోత్తమ మని పరిణతబుద్ధుల మగుకొలదియు గ్రహిం తుము.

ఈ ప్రకరణమందలి పరిశీలనఫలితముగ రెండు విషయములను గుర్తెరిగిన మేలు. చిత్రరచన మీయలేని వరములను చదువరులు కోరకుండుట మంచిది యనుట మొదటిది. తా మాసించు సారస్వతపట్టభద్రతతో భాషాకవులు సంతుష్టు లగుట శ్రేయోదాయక మనునది రెండవది. మానవస్వభావ మును ప్రపంచించుటలో చిత్రకవిత యెప్పుడును ద్వితీ యస్థానార్హమే యగును కనుక నది శంకవహింపక తన యద్భుతావహ మగు పాండితీప్రకర్షకు పారితోషిక ముగ లభించుచున్న జగద్విఖ్యాతకీర్తితో సంతృప్తి చెందిన చాలును. కవియొక్క వ్యాపారము పాఠకులను తనతో కూర్చుకొనిపోవుటయే కాని తన బుద్ధికి తోచి నట్లు అనన్యగమనసాధ్యమగు దుర్గమారణ్యమున బడి నిర్గమించుట కాదు. చదువరులకు చిత్తక్షోభము గల్గిం చుట అసలు కవితాశయమునకు విరుద్ధము. 'సత్యం శివం సుందరం' అనువానియందలి రహస్యములకు రస వ్యాఖ్య జేసి తేటమాటలలో చెప్పుటయే కవికి కర్తవ్యము.

మానవుని కవస్థలవలెనే జాతికి వివిధయుగము లుండును. ఇట్టి యొక్కొక్క యుగమునకు నొక్కొక్క యధిదేవత యుండు నని యూహింతము. ఒకానొక యుగమునం దొక జాతి దుర్నయపథమున బ్రవర్తించుచుండును. ఆ దుర్నీతి నా యుగాధిదైవ తముకూడ మాపలే దనుకొందము. ఇట్లా యుగము గడచిపోవును. అనివార్యముగ నాజాతి మఱియొక యుగభేదమును బ్రాపించును. ఇది యతిధర్మ యుగ మని భావింతము. ఈ ద్వితీయయుగాధిదేవత ప్రథమ

యుగమును దూషించుటయే కాక, యానాటి యుగా ధి దేవతనుగూడ నీ దూషణయందు తనతో నేకీభవింపు మని యెంతయో వెంరలిడి గర్జించి తుదకు శపించును కూడ ననుకొందము. అప్పు డేమి లభించుచున్నది? నిరుత్తరమే ప్రత్యుత్తరము. ఇట్లే చిత్ర కవితా యుగ మును శపించు మన శాపోచ్చాటన లన్నియు శూన్య మహాబిల గహ్వర విలీనము లగును. కాలమే దుర్వ్యవ సాయమునకు ప్రతీకారము చేయ సమర్థము. కాని యీ కాల మనునదియు స్థిరతగలది కాదు. దీనికి పర్యా యదోష మున్నది. అవృత్తత్వంధత్వము గల యీ కాల మహాసర్పము తను గన్న కావ్యము తానే పొట్ట బెట్టు కొనును; తిరిగి మఱల గ్రుడ్లనిడును. ఇది కాలమున కున్న దోషమే! మనది కాదు. తన్ను పదభ్రష్టుని జేసి షేర్ఖానుడు రాజైన పిదప నతని సంతతిని రాజ్యచ్యుతు ల జేసి తిరిగి తాను సింహాసనారూఢుడైన హుమ యూనుని జీవితగాథవంటిది కాలము. దీని నేమని ప్రయోజనము?

---

# గోపాల భిక్ష

"సంపత్"



నందె కవళం తాయి - నందె కవళం తాయి
నందె గోపాల మమ్మా (ప.)

నందె గోపాల మమ్మా! - నందె గోపాల మమ్మా!!
నందె కవళం తాయి, నందె కవళం తాయి,
నందె గోపాల మమ్మా
పేదలకు
నందె గోపాల మమ్మా! (అను ప.)

నందె గోపాల మమ్మా - నందె గోపాల మమ్మా
అనదలకు, ఆకలికి, కలిగింది, మిగిలింది.
నందె గోపాల మమ్మా
చేయెత్తి
నందె గోపాల మమ్మా!

ముక్కోటి దేవతలకై - కర్పూర హారతులకై,
కట్టి పెట్టిన ముడుపు, ఆకొన్న మా కడుపు
అన్నపూర్ణాదేవివై
ఆదుకొను
నందె గోపాల మమ్మా!

అనదలము అన్నదాత! - అలసితిమి లోకమాత!
కరుణించి 'రాకాసి - కడుపు' చల్లగచేసి
నదె నదా కోటిపుణ్యం
మా తల్లి
నందె గోపాలమమ్మా!

అలలెత్తి పిలుచు నమ్మా! - తలయెత్తి చూడవమ్మా!
యుగయుగపు కన్నీరు, ఎదనున్న మున్నీరు
పొంగి రానీయకమ్మా
అనదలకు
నందె గోపాల మమ్మా!

మా రక్తతైల మదిగో! - మా కళ్లజ్యోతి అదిగో!
ఆ యింట వెలిగినది, ఈ ఇంట మెలగినది,
నిత్య నందాదీపమై
మా! లక్ష్మి
నందె గోపాలమమ్మా!

క్షామదేవత పంటిలో — చావుబ్రదుకుల రెంటిలో
పడి చీలి చెడినాము, చెడి ప్రీలి పడినాము
తిరుగలికి పోసి విసరే
గింజలము
నందె గోపాల మమ్మా!

ఇది విలయ నిద్ర కాదా - ఇట మృత్యుముద్ర లేదా?
బరువైన దిక బ్రతుకు - కరువైన దోక మెతుకు
పడలేము బాధ లకటా!

అకటకట
నందె గోపాల మమ్మా!

చీలికలు చీలికలుగా - పేలికలు పేలికలుగా
కులమనెడి, మతమనెడి, తలమనెడి, నుడియనెడి
సుడిగుండములకు చిక్కి
స్రుక్కితిమి
నందె గోపాల మమ్మా!

దారిద్ర్య రాహుదృష్టి - పటు జటిల వజ్రముష్టి
ఎద పిసికి పిండినది - జీవమును పిండినది
కుతకుతన ప్రాణ మెదలో
ఉడికినది
నందె గోపాల మమ్మా!

ఆకొన్న పేదకోపం - ఎత్తైనా విశ్వరూపం
ఈ భువనములు మూడు, ఈ అర్ణవము లేదు
ఆపోశనము పట్టునో
అనలమై
నందె గోపాల మమ్మా!

బరవసము చేసి ఎదలో - సమరసము జోపి మదిలో
"భుజమెత్తి, ధ్వజమెత్తి, అందరిలో తలయెత్తి
రారండి రండి రండో"
యని పిలుము;
నందె గోపాల మమ్మా!

విడు విడుము సైంహికేయా - నడు నడుము కార్తికేయా!
భసిత భండారమున, గరళ డిండీరమును
మధు రసాయనము చేసి
త్రాగించు
నందె గోపాల మమ్మా!

---

మూలివిచ్చిన యూడుగు మొగ్గలకును - బెదరి పోవు నీ పొలయుల్క పేరులేక;
ఇట్టిదానిని నిల్పుకోనెట్లువచ్చుఁ - బ్రియువదనచంద్రు నెదుర దర్శించినపుడు? (౬౬౭)

కారణము గల్గి కొన్నయుల్కయును నాకుఁ - గడవఁ జొచ్చిన దిట్లె; యాకస్మికముగఁ
బూనివూచిన యూడుగుమ్రాన! దాని-పాపమంతయు నీ నెత్తిఁ బడునుగాక! (౬౬౯)

శిశిరమందుఁ గారుచిచ్చునఁ గాలి, యా - మనికిఁ బాటమరించి, మరల ముంగి
చెవులఁబోలి మెదుగు చివురాకుతోడమో-దుగులు కనులఁదన్పఁదొడఁగెఁగంటె! (౬౭౧)

చివురులంచులగుచుఁ జెలఁగ నెత్తావుల - దవులఁజల్లుచున్న పువులవలువ
మదనుఁడిచ్చెఁబోలె మధుమాసలక్ష్మికి - నలువువిరాలు పసదనంబుగాఁగ. (౬౭౨)

కారణంబుగల్గి కైకొన్న పొలయుల్క - నేని, చూడు, మానిపింప నేర్చుఁ,
జెవినిజేరి, యనుఁగుఁజెలికత్తెయునుబోలె,-మానినులకుఁ గ్రొత్తమావిచివురు. (౬౭౩)

'నేఁడు పండుగుదినము సూ; నీదుప్రియుఁడు - వచ్చు నిజముగ; నీ వేడ్వవలదు బిడ్డ!'
అనుచుఁగోడలి నూరార్చికొనుచు మొగము-నావలకుఁద్రిప్పి తానేడ్చునత్తగారు! (౬౭౪)

అతివ వీడుకొన్నయప్పుడు మెడకుఁ గేల్ - దీగ సాఁచి కౌఁగిలించి విడువఁ,
బయనమయినప్రియుని పాదాలపైఁ గంక-ణములు జాఱె సరిపణలునుబోలె. (౬౭౫)

నవకమగు క్రొత్తవరిపైరుచవికి మరగి, - వింధ్యపర్వతసీమను విడిచి దిగెడు
తరుణకుంజరమునకు యూథపతిపట్ట-మెట్టులబ్బును సుగుణంబు లెన్నియున్న? (౬౭౭)

పువులుఁగోయు చెలువనవకంపుగోళులఁ - గొంతతడవు, పువులఁ గొంతతడవు,
చివురులందుఁ గొంత, చేతులపైఁ గొంత-తడవు, మునరు గుర్తువడక తేంట్లు. (౬౯౫)

ఇండ్లు వేసవిమెండ వాకిండ్లకనులు - మూసికొని, లోనివారి చప్పుడు లడంగి,
గఱిగఱిమటంచుఁ దిరుగళ్లు తిరుగురొదల-గొఱకవెట్టుచు నిదిరించుకరణిఁ దోఁచు. (౭౦౦)

(సా గ వ చ్చ సు)



## శక్తిసంజీవనిమాత్రలు

శరీరములోని అవయవములన్నిటికి పటుత్వముచేకూర్చి దార్ఢ్యము, ధాతుపుష్టి ప్రసాదించును సోమరితనము, త్వరగా అలసట చెందుట మున్నగు దోషములను పోగొట్టును. రక్తపుష్టి, నిగ్రహశక్తి, యౌవనపటుత్వము అతిశయింపచేయును.

బంగారమురేకుతో కప్పబడిన 60 మాత్రలు సీసా ఖరీదు రు. 12/- (12½ % డిస్కౌంటు)

బంగారమురేకుతో కప్పబడిన 30 మాత్రలు సీసా ఖరీదు రు. 6/-

ఆతంక నిగ్రహ మాత్రలు,
26, బ్రాడ్వే, మదరాసు.

ఏజంట్లు:—
శ్రీనివాస మెడికల్ స్టోర్సు, బెజవాడ.

## ప్రమద



స్త్రీల పాలిటి వర ప్రసాదిని. ప్రదరము, కుసుమరోగము (స్త్రీలు చీరెలువిడుచు వ్యాధులు) బుతుశూలల, దుర్బలత్వము, మేహదుడుకు, సెగ రోగము, బహిష్టు చక్కగా కాకపోవుట, వంధ్యాదోషము మొదలగువానిని హరించి సంతానవతులనుగా చేయుటలో శ్రేష్ఠమయినది. 8 ఔన్సుల సీసా రు. 1-12-0. 4 ఔ॥ సీసా రు. 1-0-0. పోస్టేజి ప్రత్యేకం. రు. 0-11-0. అగును. అన్నిఔషధముల క్యాట్లాగు ఉచితము.

పి. శి. ఏ. అండు కంపెనీ,
ఆయుర్వేదసమాజం,
పెరిదేపి, నెల్లూరుజిల్లా.

# GOLDEN
# SANDALWOOD SOAP

శ్రేష్ఠమైన టాయిలెట్ చందనము సబ్బు

శ్రేష్ఠమైన తెల్లని చందనమునుండి తయారైన నూనెతోను, ప్రత్యేక దినుసులతోను ప్రత్యేక విధానముద్వారా తయారు చేయబడినది.

అద్భుతమైన సువాసన,
ఆకారముగల
శ్రోత్తరకము సబ్బు.




బెంగాల్ కెమికల్ & ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్, కలకత్తా మరియు బొంబాయి.

ఏజంట్లు:— యస్. దేశాయిగౌండర్ అండ్ కంపెనీ, 17, మైలర్సురోడ్డు, కీల్పాక్ మదరాసు

# భగవద్గీత - శ్రీకృష్ణుడు

= శ్రీ డా. సి. కున్హన్‌రాజా* =

నవీన విమర్శనా పద్ధతులలో జదువబడిన భగవద్గీత యనేకసమస్యలను వెలువరించి నది. అం దతిముఖ్యమైనవి రెండు గలవు— (౧) మహాభారత మూలగ్రంథమందు మొట్ట మొదటినుంచి భగవద్గీత కలదా, లేక తత్త్వ జ్ఞానముపై వ్రాయబడిన ఈగ్రంథము తర్వాత నితిహాసమున జేర్పబడినదా? (౨) ప్రస్తు తము మనకు లభించిన గీత ప్రప్రథమముననే ఈ రూపమున నున్నదా, లేక తర్వాత నిట నేమైన గొన్నిశ్లోకములు జేర్పబడినవా?

వివిధపండితులచే వివిధ వాదములు, వివిధములైన సమాధానములు నివ్వబడినవి గాని, యుక్తియుతమై సమంజస మైన ప్రత్యుత్తర మింకను రాలేదు; ఇకముందు రాదు; వచ్చునని యెవ్వరును తలచబనిలేదు.

రణరంగమున నీ శాస్త్రోపదేశ మసంబద్ధ మనియు, నసమంజస మనియు పలువురు పండితులు వాదించుచు క్లిష్టపరిస్థితుల జిక్కుకొనినారు. మహత్తర మైన జ్ఞానము, బ్రహ్మ విద్య నుపదేశించెడి యుపనిషత్తుగ సంప్రదాయముచే పరిగణింపబడుచున్న దీ గ్రంథము. శాంతివైరాగ్యములు విలసిల్లెడు నాశ్రమములకును,ఋషికులములకును నుపనిషత్తులన్నియు సంబంధించియున్నవి. రణరంగము యుద్ధారంభము, సంకులతుములములు, నాశనకరములగు నాయుధములు గల ప్రదేశము; భగవంతునిచే శిష్యునకు రహస్యముపదేశింపబడుట కయోగ్యమైనది. కావున భగవద్గీత ఈ సందర్భమున మహాభారతమున దగ దనియు, నిది యొక స్వతంత్రగ్రంథ మనియు పండితులు కొందర భిప్రాయపడుచున్నారు.

ఉపనిషత్తుల విషయ మాలోచింప, శాస్త్రజ్ఞుల యభిప్రాయము లనేకవిధములుగ నున్నవి. 'గార్బే' వంటివారు యాజ్ఞికాది గ్రంథములు బ్రాహ్మణులకు జెందిన వనియు, జ్ఞానకాండకు చెందినవి క్షత్రియులకు సంబంధించిన వనియు ఉపనిషత్ప్రమాణముల నిచ్చుచున్నారు. అరణ్యములందలి ఋషులు ప్రాసాదములందున్న రాజులకడ కేతెంచి బ్రహ్మజ్ఞానము తెలిసికొనిపోవుచుండి రని వాక్యములు గలవు. భగవద్గీతలో సహితము—

"ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవా నహ మవ్యయం,
వివస్వా న్మనవే ప్రాహ
మను రిక్ష్వాకవేఽబ్రవీత్.
ఏవం పరంపరాప్రాప్త
మిమం రాజర్షయో విదుః" (౪—౧,౨)

---

* అనువాదము: శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి.

అను శ్లోకముల తత్త్వజ్ఞానము క్షత్రియుల యధీనమున నున్నదని కలదు. ప్రాసాదములం దున్న రాజులచే కాపాడబడిన తత్త్వజ్ఞానము అరణ్యవాసముతో సన్నిహిత సంబంధము గలిగియుండుట జూడ నిట నొక క్లిష్టత గన్పడును. రాజభవనములు, అరణ్యవాసములు నొకేసారి యుపనిషత్సంబంధము నందజాలవు.

తత్త్వ మనుభూతమగు జీవితముతో నవిభక్తసంబంధము గలిగియున్న దని నొక్కివక్కాణించుటయే ఉపనిషత్తుల ముఖ్యాశయ మై యుండవచ్చును. అరణ్యాశ్రమములు తపోనిష్ఠ, సమాధి మొదలైనవాని కుచితప్రదేశములు. జీవితయుద్ధ మతి తీవ్రగతి జెలరేగెడి నగరములలోననే తత్త్వమును నిర్ధారణ జేయుటకు గావలసిన ప్రమాణములు గలవు. ప్రమేయమైన తత్త్వ మన్ని దేశముల గలదు. కాని తత్త్వవేదన జీవిత రణరంగముననే తెలియబడును. అరణ్యముల నున్న బ్రాహ్మణ ఋషులు రహస్యజ్ఞానమును గోరి నగరములందలి రాజులకడ కేతెంచి రను విషయము నీవిధమున సమన్వయింపవచ్చును.

ఇదేవిధముగ నుపనిషత్తుల ముఖ్యాశయమునుగూడ తెలిసికొనవచ్చును. మానవున కత్యుత్తమజ్ఞానము జీవితయుద్ధదశయందు తెలియును. చారిత్రకవిషయములపై కొంతవర కాధారపడి, ప్రయోజన సహితమైన సారస్వతము మహాభారతము. జరుగదగని యసమంజస విషయములను మహాసారస్వత ముపయోగింపదు. ఈదృక్పథము ననుసరించి చూచినను, మహాభారతమునం దివ్వబడిన సందర్భమున నర్జునునకు శ్రీకృష్ణునిచే జ్ఞానోపదేశము చేయబడుటలో నసమంజస మావంత యైనను గానరాదు. ఆదినముల యుద్ధము న్యాయబద్ధమైన గతుల నందెడిది. భ్రాతృసహితుడగు నర్జునుడు శత్రుశిబిరముల కేగి భీష్మద్రోణాదులను నమస్కరించి వచ్చుట యుక్తమైనచో, రణరంగమున వాదరూపమైన జ్ఞానోపదేశ మేల కూడదు? శరీరాపాయము గల్గదని, స్థిరచిత్తులై నిర్భయముగ నున్నవారు గురుశిష్యులు. సమయోచితముగాని సానుభూతికి వశుడైన అర్జునుని యథాస్థితికి దెచ్చి, మహత్తరమైన కార్యమునకు తాను చేయవలసిన విధిని బోధించినవాడు శ్రీకృష్ణుడు.

అమానుషములు, ననైతికములు నైన ప్రస్తుతయుద్ధపరిస్థితులతో నాకాలపు యుద్ధములను పరిశీలించి యసమంజస సిద్ధాంతములను తేల్పరాదు. కావున నాసందర్భమున నీయుపదేశము జరుగుటకు వీలులే దనరాదు. మహాభారతమూలగ్రంథమున నీగీతాశాస్త్ర మీరీతిగనే యున్నదని నాస్థిరాభిప్రాయము.

కొందరీసందర్భమున నుపదేశము యుక్తమే యని యంగీకరించి, మూలగ్రంథ మిది గా దనినారు. మూల మింతకన్నను సంక్షిప్తగ్రంథ మనియు, ననవసరచర్చలు లేని దనియు, పరస్పరసమ్మేళనము నందని సాంఖ్యమీమాంసాది దర్శనసిద్ధాంతములు తర్వాత జేర్చి రనియు, ప్రథమమున కేవల భక్తిప్రతిపాదకగ్రంథ మనియు వీరి వాదము.

“ప్రవృత్తే శస్త్రసంపాతే.” (౧-౨౦) అను శ్లోకమువలన యుద్ధ మారంభమైనట్లు తెలియుచున్నది. అట్టి సందర్భమున ౭౦౦ శ్లోకములు గల దీర్ఘచర్చ జరుగ దని వీరి ప్రధానద్వితీయాక్షేపము.

ఈ గ్రంథమున శ్రీకృష్ణునిచే నుచ్చరింపబడిన శ్లోకములు ౫౭౪, అర్జునునివి ౮౪, ధృతరాష్ట్రుని దొక్కటి, సంజయునివి ౪౧. ధృతరాష్ట్రసంజయుల వాక్యములు రణరంగమండలివి కావుగనుక, మొదట మిగిలిన వానిని పరిశీలింతము. వెనుక జరిగిన విషయములను జెప్పెడి సంజయుని వాక్యములలో శ్రీకృష్ణుడు పల్కినవి రెండు శ్లోకములు, అర్జునునివి యైదుశ్లోకములు (౨: ౨-౮). అసలు సంవాదము ౨-౧౧ తో నారంభ మైనదని తీసికొనినచో శ్రీకృష్ణునివి ౫౭౨ శ్లోకములు, అర్జునునివి ౭౯ శ్లోకములు. ఈ మొత్తము ౬౫౧ శ్లోకములసంవాదము సుమారు మూడు గంటలు తీసికొనును. ఇది యుక్తమగునా? సారస్వతమున యుక్తత, ఔచిత్యతలు కాపాడబడవలెను. రెండు సన్నివేశముల మధ్య నొక సంవాదము జేర్చబడిన తత్కాలపరిమితి కిది సరిపోవలెను. ఇట నట్టిది గలదా?

ప్రస్తుతసంవాదముకన్న చిన్నది మూలగ్రంథమునందలి దని కొంద రందురు. వ్యాసునిచే నివ్వబడిన (version) ఆసంవాద మిది యని యన్యవాదము. కాని సాక్షాత్ శ్రీకృష్ణుని వాక్యములే భగవద్గీతలో జేర్చబడిన వని భారతసంప్రదాయము నొక్కి చెప్పుచున్నది. దీనిపైననే గీతాప్రాముఖ్యత, పవిత్రత లాధారపడియున్నవి.

యుద్ధారంభ మైనతర్వాత రణరంగమున నింతటి దీర్ఘసంవాదము యుక్తమా యని ప్రశ్నించిన, నంతకన్న ముఖ్యములైన ప్రశ్నలను గొన్నిటిని విచారింపవలెను. శ్రీకృష్ణార్జునులు ఛందస్సు నుపయోగించి సంవాద మొనర్చిరా? అపాణినీయములు, ఆస్వైరగతులు (halting) గలిగిన భాష నుపయోగించిన వీరు సంస్కృతమున సరియైన పాండిత్యము గలిగినవారు కారా?

సరియగు విమర్శనాబుద్ధితో పరిశోధించినచో మహాభారత మొక సారస్వతశాఖయనియు, తత్కృతికర్త శ్రీకృష్ణార్జునుల రూపమున తత్త్వజ్ఞానమును గురించిన సంవాదమును జేర్చినా డనియు తేలును. అట్టిచో గీతావిషయమున నీ ద్వైవిధమున నున్న శంక లేవియును రాజాలవు. యద్విధమైన అనౌచిత్యత ఉన్నను, అది గ్రంథకర్త కంటగట్టవలసిన దోషమే యగును. యుక్తాయుక్తవిచారణ, ఔచిత్యజ్ఞానము, వివిధ విషయముల సంబంధము కృతికర్తకు తెలియని వని యనాయాసముగ పల్కవచ్చును. కాని ఈవిధమున నింతదనుక నాకు తెలిసినంతవర కెవ్వరును నీ వాదమును గ్రహించ లేదు. పైపెచ్చు గీతను నిజమైన జగద్గురువైన శ్రీకృష్ణునితో సన్నిహితసంబంధము గల పవిత్రగ్రంథముగ స్వీకరించినారు. ఈ గ్రంథ మంతయు శ్రీకృష్ణునితో సంబంధము గలిగియున్నదా, లేక ఒక భాగమా యనియే వివాదవిషయము. గీత కేవల మితిహాసమందొక భాగము కాదు. దివ్యజ్ఞానసంపన్నుడైన జగద్గురునిచే పల్కబడిన సత్యమగు జ్ఞానశ్రుతి భగవద్గీత.

ఈదృక్పథము ననుసరించినచో భౌతికమార్గమే కాక, తదతిరిక్తమగు భౌతికాతీత (Transcendent, Super - Physical) గతినిగూడ నంగీకరించవలెను. మహాభారతమందలి సందర్భముగూడ నింద్రియాతీతజగమును సూచించుచున్నది.

౨-౧౧ మొదలుకొని ౧౮-వ అధ్యాయమందలి చివరి యైదుశ్లోకములవరకు, మధ్య

౧౧, ౯-౧౪, ౩౫, ౩౭ శ్లోకములను వదలి వేసినచో శ్రీకృష్ణార్జునుల సంవాదము గలదు. సంవాద మైన కొలదిదినములతర్వాత నీ యుదంతము ధృతరాష్ట్రునకు సంజయునిచే జెప్పబడినది. ప్రయోజనసాకాంక్షతో వ్యాసు డిచ్చిన దివ్యదృష్టివలన సంజయు డీవిషయ మును దెలిసికొన శక్తుడైనాడు. మహాభారత మున మనము చదివెడిది గ్రంథకర్త యొసగిన శ్రీకృష్ణార్జునసంవాదము గాదు. కాని కొద్ది రోజులతర్వాత ధృతరాష్ట్రునకు సంజయు డిచ్చిన సంవాదపు నివేదిక. ఇది వైశంపాయ నుడు జనమేజయునకు జెప్పిన దని నైమిశా రణ్యమందలి మునులకు దెలిపినవాడు సూతుడు. ఈవిధముగ చాలకాలమైన తర్వాత నీసంవాద ముల్లేఖింపబడినది. దీని నంతను భారతసంప్రదాయ మంగీకరించినది గాని, భగవద్గీతయందలి శ్రీకృష్ణార్జునసం వాదమున శ్రీకృష్ణుని వాక్యములే ఏమార్పు ను లేక ఇవ్వబడినవని ఘంటాపథముగ బలుకుచున్నది.

సంజయున కీ సంవాద మెట్లు తెలిసి నది? ఆరంగమున నతడు లేడు. శత్రుశిబిర మున నున్నాడు. శ్రీకృష్ణుడు తాను పల్కిన వాక్యములను లిఖితపూర్వకముగా గాని,మరే విధముగాగాని యుంచలేదు. విశేషశాంతి గలిగి, మరల నీ యుపదేశము నర్జునుడు వినగోర శ్రీకృష్ణుడు చెప్పజాలకపోయినట్లు మహాభారతముననే తెలియవచ్చుచున్నది. అర్జునుడుగూడ దానిని శాశ్వతముగ నుంచ లేదు; విస్మరించినాడు. పాండవులపక్షమున నెవ్వరును దానిని వినలేదు. అట్టి సంవాదము జరిగినదనికూడ నెవ్వరికిని దెలియదు.

ఎచ్చటనో దాచబడినదానిద్వారా సంజయు డీ సంవాదమును తెలిసికొనలేదు. కాని వ్యాసదత్తమైన దివ్యదృష్టివలన నెరిగి నాడు. సంజయు డీ సంవాదమును తెలిసికొని నప్పుడు శ్రీకృష్ణార్జునులలో నంతర్గతిగ ప్రవృత్తిరహితమగు (inactive) అవస్థలోని భావశేషమైనదిగా నీవాక్కుండియుండవలెను; లేక భౌతికాతీతమైన శబ్దచలనములలో* నీవాక్కు లుండవలెను. భౌతికాతీతమైన యోగదృష్టి ద్వారా ఈభావశేషములు, సూక్ష్మశబ్దచలనములు సంజయునిపై ప్రవర్తించి నప్పుడు సంజయుని మనస్సులో ఫలించెడి భావద్రుతి (thought response) ధృతరాష్ట్రు నకు " అశోచ్యా నన్వశోచస్త్వం" అనుపద ముల నారంభించియే చెప్పబడియుండవలెను గాని, అన్యపదములతో గాదు. ఒకే పదమున భావద్వయ ముచ్చరింపబడదు. అదే విధముగ పదద్వయమున నొకేభావమును పలుకబడదు. శ్రీకృష్ణుడు నిజముగ నీ సంవాదమున నున్న ఆవాక్యముల నెవ్వరైన వ్రాసికొన జూచిన, ధృతరాష్ట్రునకు సంజయుడు పల్కిన వాక్కు లేమాత్రమును వానికన్న భిన్నములు గావని నిశ్చయముగ జెప్పవచ్చును.

భగవద్గీతలోని యుపదేశమున శ్రీ కృష్ణార్జునులమధ్య సత్యమైన, శ్రావ్యమైన

---

* భావశేష మైనతర్వాత తత్సంస్కారజన్య మైన వాసనాబుద్ధి స్మృతిప్రత్యభిజ్ఞాదిరూపమున గాక నాక యతీంద్రియగతిగా శేషించియుండును. ఇదే భావ శేషము (mental residue). భావోచ్చారణ మైన తర్వాత నిత్యమగు శబ్దము వాయువీచికలవలె చలన ముల నిలచి యతీంద్రియత్వము నందును. ఇవే శబ్దచలన ములు (Sound vibrations). మనస్సునం దంతర్లీనమై యున్న నివి వాటి ప్రోద్బల మెక్కువైన తద్రూప మునసే భౌతిక వాక్కున భాషాంతరీకరణము నందును.

భౌతికపదములు నడచిన వని చూపుటకు మహాభారతమున ప్రమాణ మేమియు లేదు. వారి సంవాదము సంజయుడు ధృతరాష్ట్రునకు నివేదించినప్పుడే శ్రావ్యవాక్కులోనికి, భాషలోనికి అనువదింపబడినది. భావశేషము గాని, వాక్శేషము (Thought residue, voice residue) గానిమాత్రమే యోగదృష్టిన తెలిసికొనబడినది. సంవాదసమయమున సంజయుడు నివేదించుచుండినయెడల, శ్రీకృష్ణుడు వస్తుతః పల్కుచున్నాడనిగాని, పల్కినాడనిగాని చెప్పుటకు ప్రబలప్రమాణము దొరకదిది.

శ్రీ కృష్ణునిగురించి భావించుటయే జగత్తునందలి భౌతికాతీతసత్యముల సంగీకరించుట యని ధ్వనించును. భగవంతుడు, తదవతారములు కేవలభౌతికవిషయములు కావు. భగవంతుని సత్యతను, శ్రీకృష్ణ రూపమున తదవతారము సంగీకరించిన, నర్జునిని భౌతికవాక్కులను వినకయే ఆసందేహముల నెరిగి, తన్నమాధానాదిభౌతికపదజాలము లేకయే శ్రీకృష్ణు డర్జునుని మనఃప్రవృత్తిని మార్చిచేయ శక్తుడైనా డనుటలో ననౌచిత్య మేమి గలదు ?

సాక్షాత్ శ్రీకృష్ణుని వాక్కును గురించి భగవద్గీతలో నెట్టిప్రమాణమును లేదు. భగవానుని భౌతికవాక్కును భౌతికముగగాని, భౌతికాతీతముగగాని యేసందర్భమున నెవ్వరును వినలేదు. భౌతికాతీతత సంగీకరించుట యవసరమైన, దాని ననుసరించి సర్వమును సమన్వయింపజాలిన, నాసంవాదమున నిజమైన భౌతికవాక్కులనుగురించి విచారింప నవసర మావంతయు లేదు. భౌతికస్థలమందాసంవాదము జరుగకపోయిన నీయుపదేశము తీసికొనిన పరిచ్ఛిన్నకాలముగూడ విచారానర్హమగును.

ఈవిధమున సమన్వయించినచో, ధృతరాష్ట్రునకు నివేదించిన సంవాదమున, భౌతిక భౌతికాతీతవిషయములను, వాటి సత్యతను, అటగల ప్రయోజనకార్యాదులను గురించిన విషయముల మన నమ్మకములు, సిద్ధాంతములు ప్రవేశింపవు. భౌతికాతీతవిషయసత్యత నంగీకరించిన సంప్రదాయమును నిర్వచించుటయే ముఖ్యవిషయము. మహాభారతములో ప్రతిబింబించిన నమ్మకములలో నీవిధమైన సత్యత, తత్క్రియలు నతిముఖ్యమైన భాగములని యందరు నంగీకరింపకతప్పదు. గీతా గ్రంథవివరణపై అభిప్రాయభేదము లుండవచ్చును. కాని సంజయప్రోక్తమగు గీతయేతదతిరిక్తమనిన సంప్రదాయమును సమన్వయింపలేము. భారతసంప్రదాయమునే త్రోసివైచిన, గ్రంథవిమర్శలో నేవిధమైన సమస్యయు బయలుదేరదు. సంప్రదాయము నంగీకరించి, శ్రీకృష్ణార్జునుల సంవాదము భౌతికాతీతవిషయమందలి వృత్తులతో సంబంధించనిదని పల్కి, మామూలుప్రపంచమున జరిగెడి భౌతికకార్యముగ పరిగణించెడియెడల, శ్లోకరూపమైన సంవాదము, భాషాదోషములు, సంవాదము తీసికొనిన కాల పరిమితి మొదలగు ననమంజస వ్యవహారములు తప్పక వచ్చును.

కావున భగవానునిచే భౌతికాతీతపథమున కనుగుణముగ నిది యుపదేశింపబడినదని, వ్యాసునివలన యోగదృష్టిని సంపాదించిన సంజయు డీరహస్యజ్ఞానమును భౌతిక పథమునకు భాషాంతరీకరించినా డని చెప్పికొనిన ఏవిధమైన సంశయములును గలుగవు.

ఒకవేళ శ్రీకృష్ణుడు నిజముగ భౌతికవాక్కు-తో నుపదేశించినప్పటికిని సంజయుడు కనిన, వినిన శ్రుతి మూలమున కెచ్చటను భిన్నముగ గన్పడదనియు చెప్పికొనవలెను. అప్పుడే సంప్రదాయానుగుణ నిర్వచనమిది యగును.

వేదములందలి సూక్తములను రచించిన వారు ఋషులు గారని, వారి పేరుతో నున్న భాగముల నాకవులు దివ్యదృష్టితో గాంచినారని సంప్రదాయము నొక్కి చెప్పుచున్నది. భౌతికాతీతములైన రూపముల వేదములను, తద్భాగములను దివ్యదృష్టితో చూడజాలని పామరుల కా తత్త్వమును (vision) భౌతిక ప్రపంచభాషలోనికి మార్చినారు. ఈ యభిప్రాయమే నిరుక్తకారుడైన యాస్కునిచే—

"సాక్షాత్కృతధర్మాణ ఋషయో బభూవుః, తేఽవరేభ్యోఽసాక్షాత్కృతధర్మభ్య ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః. ఉపదేశ గ్రహణాయ గ్లాయంతో ఽవరే బిల్వగ్రహణా యేమం గ్రంథం సమామ్నాసిషు ర్వేదంచ వేదాంగానిచ."

అని వచింపబడినది.

భగవద్గీతలోని భగవదుపదేశమునకు, గ్రంథమునకు గల సంజయుని సంబంధము వేదములందలి జ్ఞానమునకు, వేదములకు గల ఋషులసంబంధమువంటిది. ఇట్లే అర్జునునకు గల సంబంధము గూడ నభిన్నమే. కాని అర్జును డా యుపదేశమును భౌతికముగ భాషాంతరీకరింపలేదు. సంజయుడు, వైదిక ఋషులు తమ భౌతికాతీతములగు జ్ఞాన దృష్టులను భాషాంతరీకరించినారు.



# నిరీక్షణ

— శ్రీ సుందరాచారి —

౧

ఆకులయింటిలో, కనుల కందియు నందని చుక్కవెల్గులో
వాకిలి కాచికాచి తెలవారునురా! నెలరేకవైన నీ
రాకలు చూపకే మసకరాతిరిలో కనరాకపోయె, నా
లోకము శోకగీతికలలో పడి శూన్యము కౌగలించురా!

౨

తలుపులు బారుగా తెరచి, తావక దివ్యపదాలు కొల్చి, నా
వలపుల నోము నోచికొను వాంఛలతో, నిలువెల్ల కండ్లుగా
పలపల రాలు నా నయనబాష్పములన్ కలశాలు నింపి, నీ
యలతలు వాయగా జలకమార్చుటకై యిటు వేచియుంటిరా!

౩

పూవులు రాలినా, పొదలపొంచున గాలులు ముర్మరించినా
కోవెల కున్కులో కలతకూతలు రాలిన, తత్తరింపుతో
నీవని యెంచి పొంగితిని— నీలపయోధర గర్భసీమలో
లేవని నవ్వెపోయె నొక లేతమెఱుంగుల కన్నె సన్నగా!

౪

తిలకము చెమ్మగిల్లినది; దిద్దిన కాటుకకంటి గీటులో
నిలువక నీరమై కరగి నిద్దపుచెక్కిళులంటి పారగా
పులకల పొంగులో చనులు పోవిడద్రోసిన పైటచెంగుతో
మొలవిడి తానుగా వలువ మూగపదాలు రచించి జారెరా!

౫

తరువులనీడలో మలగు తక్కరి గాలులె తాకిపోయెనో,
ఇరులముసుంగులో వెలుగు లీనెడు చుక్కలె తొంగిచూచెనో,
వరదలుగట్టి చెమ్మటలు వాగుల కేమి వచింపబోయెనో,
పరువులు మాపెరా మరులు;—వంచిన మోమెటు లెత్తనోర్తురా!

౬

విరులసరాలు భారమయి, వెచ్చనియూర్పులవేపుపాటులో
పరిమళశూన్యమై, వెగటువాసనలే వెదజల్లు ; కొప్పులో
తురిమిన పూలతేనియల తుమ్మెదలే తెగత్రావిపోవు— నీ
కొరకయి నిల్చునా వలపుకోనల పూచిన పూలు వాడకే !

౭

అల తొలినాడు నీ వలపు లందగ జేసిన కంటిచూపులో
మలగిన మర్మభావములు, మాటికిమాటికి గుండెచాటులో
పలుకులు లేని పాటలను పాడుచునున్నవి ; తంతిమీటులో
మెలిగొను వీణనో మహతి మేళనమందునో పంచమశ్రుతిన్.

౮

తరణి మునింగెనా కడపదాటి యెరుంగని వేల నేను ; ఈ
తెరల నిశీథిలో కళలు దేరిన నీ యనురాగకేళియే
తెరవులు చూపవచ్చు నని తెంపరి నైతిని గాని, దానికే
విరహము తోడునీడయని వేడుకకైన తలంచియుంటినా.

౯

తారల తీరు మాపి, జలదంబులతో సరితూగి మూగి, సం
చారము సేయు సాంద్రతమసంబులు కొండలు ద్రిమ్మింగి, చెట్లపై
జారి, మరింతగా పెరిగి చప్పున నీలకు దూకి, గుండెలో
చేరినరీతి దోచె ; దయసేయుమురా ! నిలువైన నిల్వనీ !



# ఇంగ్లీషు నాగరికత - దాని ప్రభావము

= శ్రీ దిగవల్లి వెంకటశివరావు =

●

భారతదేశం రాజకీయంగా స్వాతంత్ర్యాన్ని గోల్పోయి బ్రిటీషువారి అధికారానికి లోబడగా ఒక విజాతీయనాగరికతయొక్క ప్రభావానికి కూడా అది లోనైంది. దేశాన్ని పరిపాలించే పురాతన రాజ్యాంగపద్ధతులు విచ్ఛిన్నంకాగా ఈ దేశంయొక్క పురాతనసభ్యతయందుకూడా ప్రజలకు నమ్మకం పోయింది. ఈ దేశాన్ని జయించిన భీమబలులైన ఈ విదేశీయుల అధిక్యతముందర మనము ఎంతో అల్పజ్ఞుల మనే భావం ప్రబలింది. బ్రిటీషువారి ప్రాబల్యముతో పాటు ఈ దేశంలోనికి పాశ్చాత్యభావాలూ, ఆశయాలూ రావడమే తరవాయిగా మన సభ్యతయొక్క పునాదులు పూర్తిగా కదిలిపోయినాయి.

ఈ కొత్త హయాములో ప్రజలకు ఇంగ్లీషు రుచులూ, భావాలూ బలపరచి వారిని ఆంగ్లమానస పుత్రులుగా చేయాలనే వుద్దేశ్యంతో ప్రారంభింపబడిన ఇంగ్లీషువిద్యావిధానము ప్రజల ఆధ్యాత్మికధర్మాలకే చేరుపురుగా పరిణమించింది. ఈ కొత్త పరిస్థితులలో చదువుకునేవారికి నిజదేశ వేషభావాలపైన అభిమానము, గౌరవమూ పోయి తమకు నిజంగా ఒక ప్రాచీన సభ్యత అనేదే లేదనిన్నీ, తమ పూర్వులందరూ తెలివి తక్కువదారులలో పడి మూఢులైపోయినవారనిన్నీ, తమ దేశం-బాగుపడాలంటే పాతదారులన్నీ కట్టిపెట్టి, కేవలం పాశ్చాత్యనాగరికత చూపే మార్గాలనే అనుసరించాలనిన్నీ మొదలైన విపరీతబుద్ధులు అలవడ్డాయి.

ఇంగ్లీషుభావమూలాన దేశంలో అంతులేని నాస్తికత్వం వ్యాపించింది. కేవల నాస్తికులూ ప్రకృతిశాస్త్రజ్ఞులై కుమ్మకు వేదాంతులు వ్రాసిన గ్రంథాలు, వారి భావాలు ప్రచారంలోకి వచ్చి హిందూధర్మచ్యుతికి దారితీయడం ప్రారంభమైనది. వందలకొద్ది యువకులు ఈ కొత్త పద్ధతులలో దిగారు. నాస్తికవాదంలోనూ, అలాటి జీవితవిధానంలోనూ మునిగిపోయారు. హిందూధర్మం తాళలేక విచ్ఛిన్నంకావడం మొదలుపెట్టింది.

భారతీయులు ఇలాగ పాశ్చాత్యసభ్యతయొక్క వ్యామోహానికి లోబడగా కొత్త విద్యావిధానానికి దగ్గరసంబంధం గల కొన్ని పాపిష్ఠిశక్తులు విజృంభించి ప్రజల దేశాచారాలకు భంగకరమైన దారులలోకి దింపినాయి. ఈ దెబ్బకు తట్టుకున్నవారి నింకొక బ్రహ్మాండమైన శక్తి ఎదుర్కొన్నది. ఈ దేశంలో ఇంగ్లీషు విద్యావిధానం ప్రారంభించడంతోపాటు క్రైస్తవ మతప్రచారం కూడా విజృంభించింది. ఈ క్రైస్తవ మతబోధకులు ఇంగ్లీషు నేర్పడంతోపాటు బైబిలు మతం కూడా బోధించే పనికి పూనుకున్నారు. ఈ మిషనరీలు మంచి తెలివైన బడిపంతుళ్లుగా వుండేవారు. అయితే క్రైస్తవమతప్రచారంపైన వారికి గల ఆసక్తి వల్ల వారు దేశీయుల మతాచారాలను సహించలేకపోయేవారు. ఇతరమతాలలో మంచిగాని, సత్యముగాని ఏ మాత్రమైనా వున్నదని ఏ రంగీకరించకపోవ

డమేగాక సర్వకాలసర్వావస్థలయందును పరమతాలను దూషించడమే పనిగా పెట్టుకునేవారు.

మన దేశంయొక్క దురదృష్టవశాత్తూ ఈ మిషనరీలు విద్యాబోధకులుగానూ, పత్రికాధిపతులుగానూ, సంఘసేవకులుగానూ, పరోపకారులుగానూ, దేశపరిపాలకులైన దొరల జాతివారుగానూ వుండి నందువల్ల వీరికి స్థానబలమూ, అధికారబలమూ కూడా వుండి వీరిమాట చెల్లుబడి అవుతూవుండేది. మిషనరీల లో కొందరు నిజంగా ఈ దేశీయులపట్ల సానుభూతి, ప్రేమ కలవారుగా వుండేవారు. అందువల్ల వీరి ప్రభావము మరీ ఎక్కువగా వుండేది. విద్యాలయాల ద్వారము లేం దీ క్రైస్తవమతప్రచారకులు స్థావర మేర్పర చుకొని తమదగ్గర చదువుకునే యువకులను విద్యలో తర్ఫీదుచేస్తూ క్రైస్తవమతంలో కలుపుకోవడానికి ద్రోహదం చేసేవారు.

ఇలాగ కొన్నాళ్లు జరిగేటప్పటికి విపరీతవిద్యాబుద్ధులు నేర్చిన సంకరజాతిసభ్యతలో పెరిగిన ఒక తరమువారు దేశములో అన్ని పక్కలా కుక్క గొడుగులలాగున బయలుదేరారు. వీళ్లు తమ రుచులలో, భావాలలో, మనఃప్రవృత్తిలో, జీవితపద్ధతిలో ఇంగ్లీషు వాళ్లూ కారు. భారతీయులూ కారు. వీరికి తమపూర్వులమైన, పూర్వనాగరికతపైన గౌరవమూ లేదు. తమ దేశానికి ఏలికలుగానూ, తమ విజ్ఞానానికి గురువులుగానూ అవతరించిన యింగ్లీషుయజమానులను అనుకరించడమే గొప్పదనం అనుకునేవారు. (*Article by Swami Nirvanananda on Sri Rama Krishna and his times. Cultural Heritage of India. vol. II. pp. 441-443.*)

## వేషభాషలలో మార్పు

1823-26 మధ్య కలకత్తాలో కుంపినీవారి కొలువులో ప్రధానక్రైస్తవమతాచార్యుడుగా వుండిన బిషప్ హెబరుగారు ఇంగ్లీషువారి సంపర్కంవల్ల హిందూదేశంలో ఫలిగిన మార్పులనుగురించి ఇలాగ వ్రాశారు:

"ఇప్పటి హిందువుల లౌకికఆచారవ్యవహారాలలో నగంవంతు ఈ దేశాన్ని జయించిన మహమ్మదీయ ప్రభువులవల్ల సంక్రమించినవే అని తెలిసినవారు కొందరు నాకు స్పష్టంగా చెప్పారు. ఇప్పుడు అన్ని విషయాల లోనూ ఇంగ్లీషువారిని అనుకరించడం ప్రారంభమైనది. దీనివల్ల దేశంలో చాలా మార్పులు కలిగాయి. ఇంకా ముఖ్యమైన మార్పులు కలిగితీరతాయి. డబ్బుగల దేశీయులు తమ ఇళ్లకు అందంకోసం గ్రీకుదేశపు కొరింథియన్ స్తంభాలు కట్టిస్తున్నారు. దొరలు ఉపయోగించే కుర్చీలు, బల్లలు మొదలైన గృహోపకరణాలు కొని ఇళ్లలో వుంచుతున్నారు. వాళ్లు మంచి అందమైన గుఱ్ఱపుబళ్లు నెక్కి తిరుగుతున్నారు. వారిలో చాలామంది ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడతారు. కొన్ని ముఖ్యమైన ఇంగ్లీషుగ్రంథాలనుకూడా చదివి వుంటారు. మాతో పరిచయం గల ఒక దేశీయుని పిల్లలు దొరలపిల్లలలాగ చిన్నకోటు, ఇజారు తొడుక్కొని, తలకు దొరటోపీ పెట్టి, కాళ్లకు మేజోళ్లూ, జోళ్లూ వేసుకోవడం నేను స్వయంగా చూశాను. బంగాళీ భాషలో రెండుమూడు వార్తాపత్రిక లున్నాయి. అందులో ఇంగ్లాండులోని ఉదారరాజనీతిజ్ఞుల రాజకీయసిద్ధాంతాలను సమర్థిస్తూ వ్రాస్తూవుంటారు. కొద్ది రోజులకిందట ఈ దేశీయప్రముఖులలో ఒకరు స్పెయిను దేశంలోని విప్లవం జరిగినందుకు గౌరవార్థంగా ఒక విందు చేశాడు. జనసామాన్యంలో కిందితరగతులలో కూడా మార్పులు కనబడుతున్నాయి. వారు తమ వర్ణాశ్రమధర్మాలపట్ల అశ్రద్ధ వహిస్తున్నారు. తమ పిల్లలను ఇంగ్లీషుపాఠశాలలకు పంపడానికి కుతూహల పడుతున్నారు. పాఠశాలలో బైబిలుబోధకు అభ్యంతరం చెప్పడంలేదు." (*Bishop Heber's Journal, p. 252*)

## పాశ్చాత్యవ్యామోహం

గవర్నరుజనరలైన విలియంబెంటింకు 1829-వ సం.రం మే నెల 30-వ తేదీన తన మినీటులో ఇలాగ వ్రాశాడు:

"ఇప్పుడు క్రొత్త డబ్బుగలవారందరిలోనూ కేవలమూ ఐరోపాదేశాల వస్తువులయందు ఆసక్తి క్రమక్రమంగా హెచ్చుతూవున్నది. కొన్ని విషయా

లలో ఇది చాలా చిత్రంగా వున్నది. హిందువులకు చాలా పవిత్రమైన పండుగలలోనూ, శుభకార్యాల లోనూకూడా కలకత్తాలో ఒక మార్పు వచ్చినదని విన్నాను. ఇదివరకు బిచ్చగాళ్లకూ, బ్రాహ్మలకూ పంచిపెట్టే సొమ్మును ఇప్పుడు దొరలకు ఆతిథ్యం యిచ్చేటందుకు ఖర్చు పెడుతున్నారు. అనవసరదాన ధర్మాలను తగ్గించివేస్తున్నారని వింటున్నాను."

హిందూదేశస్థితిగతులను గురించి కామన్సు సభలో జరిగిన విచారణలో 23-2-1832 తేదీన హోల్టు మెకంజీగారీవిధంగా సాక్ష్యం యిచ్చారు:

"పాశ్చాత్యులతో సంపర్కం కలగడంవల్ల దేశీయులలో మద్యపానము ఎక్కువ అయింది. ఇది నీతికి భంగకరమని విచారించవలసివున్నా దీనివల్ల ప్రభుత్వానికి ఆదాయం ఎక్కువ అయినందుకు సంతోషించాలి. దేశీయుల నౌకరులకు పూర్వంకన్న మంచి దుస్తులు వేస్తున్నారు. ఈబట్టలమీదకూడా పన్ను వున్నందువల్ల మన ఆదాయం వృద్ధి అవుతుంది. కలకత్తాలోని పరిస్థితులనుబట్టి చూస్తే దేశీయులలో ఇంగ్లీషు భోగవస్తువులను వుపయోగించడం ఎక్కువ అయినట్లు కనపడుతూవున్నది. వాళ్లు మంచి గృహోపకరణాలతో నింపిన ఇళ్లలో కాపురం వుంటున్నారు. చాలామంది గడియారములు ధరిస్తారు. సీమసారాయి తాగుతున్నట్లు కూడా తెలుస్తుంది."

24-3-1832 తేదిన బ్రాకన్ గారు "కోవగల దేశీయులు చాలామంది యిప్పుడు సారాయి తాగుతున్నారు" అని అన్నారు. (*Colonization of India by Major B. D. Basu, p. 73.*)

## నవనాగరికయువకులు

క్రైస్తవవిద్యావిధానంయొక్క మొదటి ఫలితం హిందూయువకులలో మతాచారాలపైన గౌరవం పోవడమే. ఒక పోర్చుగీసుదొరకును, దేశీయస్త్రీకిని పుట్టిన హెన్రీ లూయీ వివియన్ డిరోజియో అనే పేరు గల 17 ఏళ్ల యువకుడు 1826 లో కలకత్తా హిందూకాలేజీలో ఉపాధ్యాయుడైనాడు. అతడు చాలా తెలివైనవాడు. ఇంగ్లీషులో కవిత్వం చెప్పగలడు. చాలామంది విద్యార్థులకు ఇతడు పరమగురువు. ఇతని నాయకత్వంకింద ఒక యువజనసంఘం బయలుదేరింది. వీళ్లకు మన దేశవేషభాషలపైన అభిమానం లేదు: మానసికంగా స్వేచ్ఛావిహారమే వీరి పరమలక్ష్యం. ఐరోపాలో చాలాకాలం కిందటనే వుద్భవించి మాటుమణగిన ఉద్యమాలు మళ్లీ యిక్కడ తలలెత్తినాయి. "స్వాతంత్ర్యం— సమానత్వం— సౌభ్రాతృత్వం—" అనే కేకలతో ప్రారంభమైన ఫ్రెంచివిప్లవభావాలూ, పద్దెనిమిదో శతాబ్దంనాటి తత్వశాస్త్రజ్ఞులూ, షెల్లీ బైరను మొదలైన ఆంగ్లకవులూ అంటే వీరికి యిష్టం. మూఢవిశ్వాసాలను నిరసించడంలో వీళ్లు మొనగాళ్లు. ఇందులో చాలా మోటుగా ప్రవర్తించేవాళ్లు. సనాతనుల యిళ్లలో గొడ్డుమాంసం పడవేసేవారు. "మేము తురకల రొట్టె తిన్నామండోహోయ్" అని కేకలు వేస్తూ తిరిగేవారు. అల్లరికి తురకమతంలో కలిసినట్లు అభినయించేవాళ్లు. సంఘసంస్కారంవిషయంలో చాలా ముందుఅడుగు వేసేవారు. ఈపరిస్థితులలో అలెగ్జాండర్ డఫ్ అనే మిషనరీ విద్యాబోధనద్వారా క్రైస్తవమతప్రచారం చేసి కులీనబ్రాహ్మణకుటుంబాలలోని పిల్లవాళ్లనీ, గొప్పయింటిపిల్లలనూ క్రైస్తవమతంలో కలుపుకున్నాడంటే ఆశ్చర్యమేమున్నది! కులీనబ్రాహ్మణయువకుడైన కృష్ణమోహనబెనర్జీ 1832 లో క్రైస్తవమతంలో కలిశాడు. అలాగే ఇంకా కొందరు గౌరవకుటుంబాలవాళ్లు మతంలో కలిశారు.

హిందూకాలేజీలో గుమాస్తాగా వుండే హరమోహనచటర్జీగారు ఈకాలేజీపిల్లవాళ్ల చర్యలను గురించి ఇలాగ వ్రాశారు: "హిందూమతధర్మాలనూ, ఆచారాలనూ బహిరంగంగానే తృణీకరించి ఖండించేవారు. నైతికవిషయాలనుగురించి తీవ్రమైన ఘర్షణలు జరిగేవి. హ్యూము అనే తత్వశాస్త్రజ్ఞుని అభిప్రాయాలు వ్యాపించాయి. డిబేటింగుసొసైటీ లనే వాగ్వాద సంఘాలు చాలా వెలిసినాయి. అందులో తీవ్రమైన వాగ్వాదాలు, మహోపన్యాసాలు జరిగేవి. హిందూ మతము చాలా కలుషితమైనదనిన్నీ, పాపిష్ఠిదనిన్నీ, మానవమాత్రులు హర్షించతగినది కాదనిన్నీ నిరసించేవారు. హిందువులు నీచస్థితిలో పడివుండడాన్ని గురించి చాలా చర్చలు జరిగేవి. వీరి అజ్ఞానమూ, మూఢ

విశ్వాసాలే దీనికి కారణాలని నిర్ణయించేవారు. మంచి ఇంగ్లీషువిద్య వ్యాపింపచేయడం తప్ప ప్రజలను బాగుపరిచే మార్గం లేదని తీర్మానించేవారు. స్త్రీలు అజ్ఞానాంధకారంలో మునిగియుండడాన్ని గురించి సిగ్గుపడుతూ రోషావేశం ప్రదర్శించేవారు. హిందూ స్త్రీలకూ విద్యనేర్పాలని ఒక పెద్దసభలో తీర్మానించారు." (*Life and experiences of a Bengali chemist: Sir P. C. Ray. vol. ii, pp. 17-18.*)

## బ్రహ్మసమాజం

వంగరాష్ట్రంలోని ప్రజలంతా క్రైస్తవులై పోతారా, ఈ హిందూసంఘము విచ్ఛిన్నమై నశిస్తుందా అనే అనుమానం చాలామందికి కలిగింది. ఇలాంటి సమయంలో దేవేంద్రనాథఠాకూరుగారు ప్రజలను రక్షించారు. రామమోహనరాయలవారు స్థాపించిన బ్రహ్మసభను ఉద్దీపింపజేసి హిందూమతంలో కనపడే కొన్ని లోపాలను సంస్కరించి క్రైస్తవమతములోకి పోవనక్కరలేకుండానే అలాంటి సిద్ధాంతాలే మన పరిశుద్ధాస్తిక ఉపనిషన్మతంలో ఉన్నాయనే సంగతి చూపి దేశాన్ని సంరక్షించారు. బ్రహ్మసమాజం అభివృద్ధిచెందడంతో క్రైస్తవమతప్రచారం తగ్గింది. (*Rise and fulfilment of British Rule in India by Edward Thompson and G. T. Garratt, pp. 310-311*)

## ఆంగ్లవిద్యాధికులు

కేశవచంద్రసేనుగారును, ఆయనజీవితచరిత్రను రచించిన ప్రతాపచంద్రమజుందారుగారును కాలేజీలో విద్య నభ్యసించి 1858 లో బయిటికి వచ్చేటప్పటికి వంగరాష్ట్రయువజనసంఘంయొక్క స్థితి చాలా శోచనీయంగా వుండేది. ఇంగ్లీషుగ్రంథాలను కొన్నింటిని గుడ్డిగా చదవడంమూలంగా కొంత భాషాజ్ఞానం సంపాదించడమే విద్యనేర్వడమని ఆకాలంలో అనుకునేవారు. ఎవరైనా ఒక పత్రికలో వ్యాసం వ్రాశాడంటే వాడిని అచుట్టుపట్లకల్లా చాలా గొప్పవాడనుకునేవారు. రాజకీయప్రజాజీవన మనేది లేదు. ఆకాలంలో కలకత్తాలో లిటరరీక్లబ్బు లనే భాషాభివృద్ధిసంఘాలు చాలా బయలుదేరినాయి. అందులో ఎవరైనా ఇంటిదగ్గర తయారుచేసుకొనివచ్చి ఒక ఉపన్యాసం యిచ్చాడంటే అతడు చాలా గొప్పరాజకీయవేత్త అనుకునేవారు. కేవలమూ పరమార్థచింతతో గాక తన యిష్టంవచ్చినవాళ్లతో కలిసి ఇష్టంవచ్చిన పదార్థాలను తినవచ్చు ననే వూహతో ఎవరో ఒకరు బ్రహ్మసమాజంలో చేరుతూవుండేవారు. అప్పుడప్పుడొక యువకుడు క్రైస్తవమతంలో కలిసేవాడు. అంతేగాని ఆకాలంనాటి చదువులు నిజంగా మనుష్యుల మనస్సులనుగాని, అంతరంగాలనుగాని ఉద్దీపింపజేయలేదు. అయితే పాశ్చాత్యవిజ్ఞానం వృద్ధిచెందినందువల్ల కలిగిన ఫలితం ఏమిటంటే, చదువుకున్నవాళ్లలో ఐహికసుఖాసక్తి ఎక్కువ అవడమే. యువకులలో అపనమ్మకము వర్ధిల్లి నీతి క్షీణించింది. పాశ్చాత్యవిద్యను ప్రజలలో వ్యాపింపచేయడానికి ప్రభుత్వంవారు నిశ్చయించినందుకు ఫలితంగా దేశభాషలకు ఆదరణ తగ్గిపోయింది. కొద్దికాలంకిందటివరకూ గౌరవింపబడుతూ వుండిన సంస్కృతము, అరబ్బీ, పారసీభాషలు పనికిమాలిన మొరటుభాషలుగా పరిగణింపబడి ఇంగ్లీషుకు గౌరవం వచ్చింది. 1851 లో స్థాపింపబడిన బెతూన్ సొసైటీ వంటి డిబేటింగు సొసైటీలు కలకత్తాలో చాలాచోట్ల స్థాపించారు. అవి విద్యార్థులలో కదలిక పుట్టించాయి. ఇలాంటి సభలలో వాగ్వాదాలలో నుండే రాజకీయపరిజ్ఞానం ఉద్భవించింది. ఒకటిరెండు ఇంగ్లీషు వార్తాపత్రికలు తలలెత్తాయి. వంగభాషలో చాలా వార్తాపత్రికలు బయలుదేరి ఒకదానినొకటి తిట్టుకుంటూవుండేవి.

## మద్యమాంసాలు, వ్యభిచారం

సనాతనధర్మంపైన నమ్మకం పోయిన యువకులు గుంపులుగా చేరి మతాలనుగురించి చర్చిస్తూ తమతోడి హిందువులలో పెద్దల మూఢవిశ్వాసాలను, ఆచారాలను అప్పుడప్పుడు విమర్శిస్తూ దూషిస్తూ వుండేవారు. ఇవన్నీ దేశీయజనసంఘంలో కల్లోలం కలిగించాయి. యువకులు నీతి నియమా లన్నీ ఉల్లంఘించి ఎలాంటి హద్దూ పద్దూ లేక తమ యిష్టం వచ్చినట్లు తిని తాగి యథేచ్ఛగా జీవించడానికి ప్రయత్నించారు.

క్రైస్తవ మిషనరీలూ, కంపెనీ అధికారులూ, యువకులైన పత్రికారచయితలూ, పరిపక్వం చెందని సంస్కర్తలూ కలిసి వర్ణాశ్రమధర్మాలపైన కత్తికట్టారు. కాలేజీలలో చదివే విద్యార్థిసంఘమంతా వారి కిందులో తోడయ్యారు. పాశ్చాత్య భోగ వస్తువులనూ, మద్య మాంసాలనూ స్వీకరించడమూ, దొరల జీవితపద్ధతులను అనుకరించడమూ, బ్రాహ్మణపురోహితుల ఆంక్షలను, బంధువుల మాటలను తృణీకరించడమూ దాని ఫలితాలు. చదువుకున్న వారిలో మద్యపానమూ ఎక్కువ అయింది. దానితోపాటు ఇతరదుర్వ్యసనాలు, అందువల్ల అకాలమరణాలు వృద్ధిచెందినాయి. స్త్రీలకు స్వాతంత్ర్య మివ్వాలనే ప్రచారం సాగింది. అక్కడక్కడ ఘోషా వదిలించి కొందరు స్త్రీలను బహిరంగంగా సభ్యలలోనికి రానిచ్చారు. స్త్రీలను గౌరవించేపద్ధతిని నేర్చుకోవడానికి పూర్వమే ఇరుగుపొరుగువారి స్త్రీలతో పరిచయం చేసుకోవడానికి ప్రయత్నించారు. చదువుకున్నవారిలో నీతినియమాలు లేక వ్యభిచారం మితిమీరినది. నాస్తికులు, శుష్కవేదాంతులు, నీతిమతబాహ్యులు, మెటీరియలిజం, పోజిటివిజం అనే పాశ్చాత్యసిద్ధాంతాలవారు మొదలైన వితండవాదులు దేశంలో విజృంభించారు. క్రైస్తవమతంలో కలియడానికిగాని, బ్రహ్మసమాజంలో చేరడానికిగాని ఒకడు వస్తే పదిమంది నాస్తికత్వాన్ని అవలంబించేవారు బయలుదేరారు. పాశ్చాత్యదేశాలవారి పద్ధతుల త్రాగుబోతుతనము, వ్యభిచారము హిందువుల పండుగలలోకీ, ఉత్సవాలలోకీ, శుభకార్యాలలోకీకూడా వచ్చి చెలిగాయి. అలాంటి సమయాలలో ఇంగ్లీషువర్తకులూ, ఉద్యోగులూ దేశవాలీభోగం వాళ్ల మేజువాణీలకు హాజరయ్యేవారు. నీతినియమాలపైనా, మతంపైనా నానాటికీ విశ్వాసం తగ్గిపోవడం ప్రారంభించింది. కలగాపులగపు నాగరికత దాని లాభనష్టాలతో దాపురించింది. గొప్పవాళ్లు మనుకునేవారందరూ అనుసరిస్తూ వున్న ఈ దుర్మార్గపు పద్ధతులకు హద్దూ పద్దూ లేకుండా పోయింది. క్రైస్తవమతబోధకులుగాని, ఆమతంలో కలిసినవారుగాని ఈ అవినీతికరమైన పద్ధతులను నిరసించడానికి ప్రయత్నించలేదు. ఆకాలంలో అలెగ్జాండర్‌డఫ్ గారి విద్యార్థులున్నూ, ఇతరయువకులున్నూ పందిమాంసపు గుట్టలను ఛేదించుకుంటూ సారాయపుమడుగులనుండి యీదుతూ తమ ఉన్నతగమ్యస్థానానికి పోతున్నారని ఒక పత్రిక వ్రాసింది. కృష్ణమోహనబెనర్జీ గారు ప్రకటించే 'ఇంక్వైరర్' పత్రికాకార్యాలయంలో చేరిన యువకులు కొందరు ఆపక్క కాపురంవున్న సనాతనుని యింట్లో గోమాంసం పడవేయగా దెబ్బలాట జరిగిం దనే సంగతి అలెగ్జాండరు డఫ్ గారి జీవితచరిత్రలో వ్రాయబడివున్నది. (*Life of Alexander Duff by George Smith; Keshubchandrasen and his times by Pratapchander Muzoomdar*)

## ఆంగ్లమానసపుత్రులు

ఇంగ్లీషువిద్య ఆరంభమైన పాతికసంవత్సరాలలోపుగానే మెకాలే చెప్పిన జోస్యం నిజమైంది. రంగులోనూ, రక్తంలోనూ, భారతీయులుగా వున్నా రుచులలోనూ, అభిప్రాయాలలోనూ, మనోభావాలలోనూ ఆంగ్లేయులుగా వుండే ఆంగ్లమానసపుత్రుల తరగతి యొకటి వంగరాష్ట్రంలోనేకాక భారతదేశమంతటా వుద్భవించింది. వంగరాష్ట్రంలో మొట్టమొదట సీమకు వెళ్లి బ్యారిస్టరై వచ్చిన ఆయన కలకత్తాలో ప్రాక్టీసు ప్రారంభించడానికి ధనవంతులు, నాగరికులు, దొరలూ వుండే చౌరింఘీపరిసరాలలోనే ఇల్లు కుదుర్చుకున్నాడు. ఆయింటిని ఇంగ్లీషుబల్లలు, బెంచీలు మొదలైన సీమవస్తువులతో అలంకరించాడు. తాను తన ఆంగ్లప్రభువుల దుస్తులు వేసుకొని వాళ్ల ఆచారాలు అవలంబించాడు. అతనితర్వాత వచ్చిన యువకు లంతా అతనిని అనుకరించారు. తెలివైన హైకోర్టువకీల్లు ఇవాళ చేసే పనిని మర్నాడు ప్రజలంతా అనుకరిస్తారు. ఈ నవనాగరికులను సామాన్యప్రజలు అనుకరించారు. న్యాయాధిపతి, న్యాయవాది, వైద్యుడు, బడిపంతులు, గుమాస్తా-వీరంతా విద్యాధికుల తరగతివారు. వీరందరూ రైతుపండించే పంటపైన బ్రతికేవాళ్లే. వీళ్లెవరూ దేశసంపదను ఉత్పత్తి చేసేవాళ్లు కారు. అందరూ సొమ్ము ఖర్చుపెట్టేవాళ్లే. వీళ్లు పాశ్చాత్యుల బాహ్యవేషభాషలను, జీవితాన్ని అనుకరించారేకాని వారి పూనిక, ధైర్యము, శౌర్య

నిర్వాహకత్వము, ఇంకా జాతియొక్క గొప్పదనానికి తోడ్పడే ఇతరగుణాలూ వీళ్లు నేర్చుకోలేదు. ఈ నవనాగరికులు బాహ్యవేషభాషలలో ఇలాగ జాతి వారిని అనుకరించినా ఇళ్లలోమాత్రం పూర్వాచారాలకు దాసులుగా వుండేవారు.

### 'దేశదౌర్భాగ్యం'

ఇలాగ పాశ్చాత్యవేషభాషలను, నాగరికతను అనుకరించడం ఒక గొప్ప కాకపోవడం అలా వుండగా ఇది చాలా అధఃపతనమనే చెప్పాలి. ఈదేశశీతోష్ణాలనుబట్టి మనకు తగిన పంచ, చొక్కా, ఉత్తరీయాలను వదలి పైనుండి కిందిదాకా బిగించుకునే సూటు బూటులు ఆరోగ్యానికి భంగకరా లనే సంగతి కూడా వీరు గమనించలేదు. ఇలాగే ఆహారవిహారపానీయాలలోనూ పాశ్చాత్యులను అనుకరించి టీ తాగడమూ, సిగరెట్టులను కాల్చడమూ మనకు పనికిరావని గమనించలేదు. తగినా తగకపోయినా ధనవంతులైన పాశ్చాత్యుల పద్ధతులు మన బీదదేశానికి ఎంతమాత్రమూ తగవనే సంగతిన్నీ గమనించలేదు. ఈపద్ధతులు అమిత ధనవ్యయానికి కారణాలై చాలామంది నాశనమయ్యారు. వీళ్ల పద్ధతులవల్ల దేశీయవస్తువుల ధరలు పెరగడమేకాక విదేశీయవస్తువుల ఉపయోగము ఎక్కువ అయింది. దుస్తులకు, జోళ్లకు, ఇతరవస్తువులకే కాక కొత్తరుచులనుబట్టి బంతిఆటలకు, బిలియర్డు ఆటకు చాలా ఖర్చు అవుతుంది. సినీమాలు, సర్కసులు కూడా వ్యయానికి కారణాలైనాయి.

ఎర్రయిండియనులు, జూలూలు మొదలైన అనాగరికజాతులవాళ్లలాగనే మనవాళ్లు ఈవిదేశవస్తువుల వ్యామోహంలో పడ్డారుగాని మన దేశంలో దొరికే ముడిసరుకులతో ఈభోగవస్తువులను తయారుచేసుకోలేని అసహాయస్థితిలోనే పడివున్నారు. బస్తీలలో వుండే గొప్పవారిని చూసి మన గ్రామస్థులుకూడా ఈభోగద్రవ్యాలను ఉపయోగించి నాశనం కావడం ప్రారంభమైనది. తినడానికి తిండీ, కట్టుకోవడానికి బట్టా లేకపోయినాసరే కాని ఈభోగద్రవ్యాలూ, విదేశీ దుస్తులూ లేకపోతే బ్రతుకలేరనేటంత పిచ్చిలో పడ్డారు ప్రజలు. జీవనానికి అవసరాలైన వస్తువులను వెనక్కి తోసి ఉబుసుపోకకూ, భోగానికీ, భోగం అని అనుకునే అనుకరణాలకూ కావలసిన వస్తువులకు అక్కర ఎక్కువఅయింది.

ఈపిచ్చి యిప్పటికీ వృద్ధి అవుతూనేవున్నది. ఇరవై ఏళ్లకిందట కని విని యెరగని కొత్తవస్తువులు పుట్టినప్పటినుండీ మనకు వున్నట్లూ, అవి లేకపోతే బతకలేనట్లూ అనుకునేటంత అలవాటు అయి అవసరములైనాయి. మోటారులు, గ్రామోఫోనులు, సినీమాలు, ఫోటో కెమెరాలు మొదలయినవాటి సంగతి చూడండి. ప్రజలకు వోటుహక్కులు గల ప్రజాసంస్థలను స్థాపించిన ఆంగ్లనాగరికత ప్రభావంవల్ల సమస్తభోగాలూ తాముకూడా అనుభవించాలనే భావం జనసామాన్యంలో వృద్ధిఅయింది. దీనికి తోడు యుద్ధాలు వచ్చి ప్రజలలో బాధ్యత, పొదుపు వుండాలనే భావాన్ని క్షీణింపచేసి ఐహికసౌఖ్యానుభూతినే జీవితపరమావధిగా చేశాయి. ఈవిషయంలో ఆసియా, ఆఫ్రికా దేశాలు అమెరికా, ఐరోపాఖండాల దారినే పట్టినాయి అని ఆచార్య ప్రఫుల్లచంద్రరాయిగారు వ్రాశారు. (*Life and experiences of a Bengali Chemist*: *Sir P. C. Ray. Vol. II. pp. 340–41*)

---

# చక్కని ముత్యాలసరాలు

— శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు —



ఎర్రకాలువ కప్పుకొని మా
ఇంటి కొచ్చిం దొక రివాల్వర్
బాధలో బెంజైన్ సీసా
ప్రేమలో డైమాన్ రాణీ.

మెడకి కాంచనమాల చక్కని
జడకి చుట్టిన పుష్పవల్లి
చావుబదుకుల జమిలిదుప్పటి
కప్పు కొచ్చింది.

ప్రేమగానం మోసుకుంటూ
మహాశంఖం మాటలాడదు
ఐంద్రకార్ముక మంత్ర బర్హాం
మబ్బుచాటున మాయమైనది.

పాతపీపా పీతపాపా
పాడుకుంటూ తిరుగుతాయట
కొత్త గొంతుక చెవిని పడితే
గుడ్లు నిప్పులు చెరుగుతాయట.

నేను వెళ్లిన నాటినించీ
నీడలోపలి మేడ దిగదట
కోడిగుడ్డు ప్రమాణకంగా
కృష్ణశాస్త్రిని చదవలేదట.

నన్ను తిట్టిన తిట్లతోనే
మల్లెపూవుల మాల కట్టెను
నాకు వ్రాసిన ప్రేమలేఖలు
పోస్టుచేయుట మానివేసెను.

వెయ్యిరాచిప్పలని మేసిన
వెర్రికుక్కకి గాలివాన
రోలు చెప్పిన కథకి పాపం
డోలు కంచికి పైనమైనది.

ఓరి కూపస్థ భల్లూకం
గోడపై రుద్రాక్షపిల్లీ
ఆటలోపల అరిటిపండా
పాట లెందుకురా.

ఎగురుతున్నాయ్ ఇనపకోటలు
పగులుతున్నాయ్ పాతపాటలు
రగులుతున్నాయ్ రాచబాటలు
రాజుకోవేరా.

ప్రేమకీ సంఘానికీ ఒక
జారుముడితో చాలు పోరా
నిన్ను తిట్టేవాళ్లకోసం
కళ్లు విప్పుకు, నిద్రపోరా.

ఇదే నాకడసారి సలహా
ఇలా తే సీమనీపర్సని
ఆంధ్రపత్రిక కప్పుకొని కా
రడవి కేగిం దా రివాల్వర్.

నేడు నా కంట్లో సివంగులె
నిద్రలో నిలిచే ఫిరంగులు
కాళ్లచుట్టూ కపాలాలే
కావ్యగీతి కలాపాలు.

## సహజ సౌందర్యము



'కామినియా నూనె' ప్రతిరోజూ వాడుట వల్ల వేల కొలది స్త్రీలు తమ కేశ సౌందర్యాన్ని పెంపొందించుకుంటున్నారు. దీనిని వాడినవెంట్రుకలు బాగా పెరిగి మెదడుకు చలవచేయును.

## కామినియా నూనె
(రిజిస్టర్డు)

సీసా 1-కి రూ 1/- 3 సీసాలకు రూ 2/10-
వి. పి. ఛార్జీలు వేరే. ఉచితమైన మాస్తరు సీసాకు మూడుకాన్ల బిళ్లలు పంపండి.

---

## ఓటో దిల్ బహార్
(రిజిస్టర్డు)

ప్రాచ్యదేశ విశిష్టతగల చక్కని సువాసన ద్రవ్యము. చాల సమ్మోహనము. ఎంతకాల మైనా వాసనపోకుండ నుండును.

¼ ఔన్సు రూ 1/4- ఒక డ్రాము అ॥ 12/-
వి. పి. ఛార్జీలు వేరే.

సువాసనగల కార్డు 1 అణా. ఉచితమైన మాస్తరునకు 2 అణాల బిళ్లలు పంపండి.

సోల్ యేజెంట్లు:

ANGLO-INDIAN DRUG &
CHEMICAL CO., BOMBAY. 2.



— అమృత తుల్యమగు —

## ఎ. పి. యాకుటి



నవ యౌవనము, దేదీప్యమాన పటుత్వము చేకూర్చు దివ్యౌషధము. రక్తమును పరిశుభ్రపరచును. ధాతుపుష్టి కలిగించును. క్షీణించిన నరములకు పటుత్వము చేకూర్చును. వివాహితులకు సంతృప్తి, ఆనందము కలుగజేయు శక్తివర్ధకము. సీసా వెల రు 10/.

**రమణవిలాసిని Raman Vilasini Vatika**

వీర్యమును గట్టిపరచి, ధారణశక్తిని వృద్ధిచేసి, ఎల్లరకము సంభోగములలో తృప్తినొందించు పరమ ఔషధము. వెల రు. 1/-

## మదనమంజరి ఫార్మసీ,

184, చైనాబజారు రోడ్డు, మదరాసు.
కర్నూలు:— కే. యస్. కోసిగి అండు సన్స్.
రాజమండ్రి: ఈశ్వరదాస్ & కో., మెయిన్ రోడ్డు







## వారు ప్రత్యేకించి మిమ్ములనే గురిచూచుట లేదు ..

••• కాని అనుభవించవలసిన దురదృష్టవంతులలో మీరొకరు కావచ్చును. విధి మీకు విరుద్ధముగా నుండిన—ఆ దుస్థితిని మీరు తప్పించుకొనజాలరు. కాని ఇన్సూరెన్సు ద్వారా మీ కుటుంబమును కాపాడగలరు.

సంప్రతింపుడు:— **నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్.**

7, కౌన్సిల్ హౌస్ స్ట్రీట్, కలకత్తా.

మద్రాసు బ్రాంచి:—
362 చైనాబజారు రోడ్డు,
మదరాసు.

# ఊహా ఊర్వశి

[కథ]

= శ్రీ చాగంటి సోమయాజులు =

వెళ్లేను పెళ్లికి వాళ్లందరితోటీ. పడవనిండా కిక్కిరిసి కూర్చున్నాము. పదిహేను మైళ్లు గోదావరిలో ప్రయాణం. ఎక్కింది ఏరువాకపడవ. పొంగుతూ తోసుకొచ్చింది సముద్రపుపోటు. తాటిచెట్టంత కెరటాల నెత్తి తిరగేస్తూ లేచింది గాలి. తెరచాపలు రెండూ బిగిసి పూరిస్తే కొయ్యలు కీచులు పెట్టాయి. ఎత్తి కుదేస్తూ ఇనపనాగలిలాగ పడవ నీళ్లని దున్నుతున్నాది.

పడవహోరెగరగొడుతూ పెళ్లివారు గొడవచేస్తున్నారు. వినవలసిన విషయాలే. మామ్మూలు మానవుల మురికిజీవితం అంతా వాళ్ల సంభాషణలో విమర్శ కొస్తోంది. రంకులు, రోగాలు, కుతంత్రాలు, కృత్రిమాలు, పెళ్లిళ్లు, పురుళ్లు, అప్పాస్తులు-సర్వం వాళ్ల పిచ్చాపాటీకి కీలకం అవుతున్నాది. జీవితాన్ని సారస్వతంలోకి ఎక్కించి విమర్శించదలుచుకొన్న సాహిత్యపరులకి అదంతా చాలా ఖరీదైన ముడిపదార్థం.

పదహారేళ్ల నాపెళ్లాం వాళ్ల మధ్య పెద్దపేరక్కలా పేలాపనలోకి దిగింది. పదహారేళ్లదైతే యేం? ఇద్దరు పిల్లల్ని కని, అబ్బో, అమ్మ అయిపోయింది. అమ్మలక్కలతో సరిగ్గా మాట్లాడుతోంది.

ప్రసాదరావుపెళ్లి. ఆఖరి కెలాగైతేనేం- అవుతోంది. అదృష్టవంతుడు. రెండువేల కట్నం డావుకొట్టున్నాడు. పద్దెనిమిదేళ్ల పిల్లని పెళ్లాడుతున్నాడు. పుస్తె ముడేస్తే చాలు రెక్కట్టుకొని అదే గదిలోకి లాక్కెడుతుంది.

పెళ్లిప్రయాణంలో, పుచ్చపువ్వులాంటి వెన్నెట్లో, నిండుగోదావరిమీద హుత్తారీ లేకపోయింది. పడవలో కళ్లని కదుపుతూ ఒక్క పడుచుపిల్ల ఉంటే పడవలాగే మనస్సూ ప్రయాణం చేసును, గుండెలు పాకుతున్ను. ఆడాళ్ల జనాభా ఎక్కువగానే ఉన్నాది. కాని అందమైంది లేకపోతే అట్టేపోమ పడుచుపిల్లకి కరవైపోయింది. అందికే యీ డంపున్ను (dumps).

లగ్నసమయం. శుభ్రమైన పెళ్లికొడుకు. ఎమ్మే చదివేస్తున్నాడు. పెళ్లికూతురు గుజ్జంలాంటి కొండముచ్చు. వొంటినిండా నగలు, జరీచీర, తలనిండా పువ్వులు ధరించింది. అంచేత ఆమె నిడదవోలుస్టేషన్లో మనం చూచే సూచీముఖం కాదు. సర్కసు ఎరీనాలోకి అలంకరించి తీసుకొచ్చే ఆడకోతి.

మూడు ముళ్లూ పడ్డాయి. తలంబ్రాలు పోసుకొన్నారు. పెద్దాళ్లకి కన్నుల వైభవంగా ఉన్నాది కల్యాణం.

నా కేం పెర్రా? ఎందుకొచ్చే సీపెళ్లికి? ఈమనుష్యుల మధ్యకి? మొగాళ్లంతా గాడిదలు; విజ్ఞానదరిద్రులు. ఆడాళ్లంతా పందులు. వాళ్ల మొహాలు పిడతలు. మొగాళ్లంతా తండ్రులు (పితృదేవో భవ); ఆడాళ్లంతా తల్లులు (మాతృదేవో భవ)! ఆడాళ్ల చంకల్లోనూ, మొగాళ్ల తొడలమీాదా, పందిరి రాటల కెగబాకుతుతూ పిలపిల్లాడుతున్నారు పిల్లలు.

మంగళహారతిపళ్లెం పట్టుకొని నలుగు రమ్మాయిలు పాట ప్రారంభించారు. భ్రాంతి అనుకొన్నానుకాని సరిగ్గా చూస్తే సత్యమే. అందులో చిట్టి ఉన్నాది.

చిట్టి పంధొమ్మిదేళ్లది. నాపెళ్లాంకన్నా మూడేళ్లు పెద్ద. నాపెళ్లాం పిల్లలతల్లి. చిట్టింకా అవివాహిత. పదివేలమంది పడుచులను చూస్తాము. అంతా సముద్రపు ఇసకలో అడుగుల్లాగ మనస్సులోంచి మాయమై పోతారు. చిట్టిరూపం చూచామంటే చెరక్కుండా మనస్సులో శాశ్వతంగా నిలిచి పోతుంది. "ఎందెందు" వెతకిచూస్తే "అందందు" దేముడు కనబడతాడు. కాని 'అందు' ఒక్క చిట్టిలోనే కనబడుతుంది.

ఒక్కొక్క స్త్రీ మనస్సులో బాగా ముద్రపడిపోతుంది. పదేపదే జ్ఞాపకాని కొస్తుంది. ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క రసాన్ని హృదయంలో ద్రవింపచేస్తుంది.

మాలతమ్మ జ్ఞాపకాని కొస్తే కరుణతో కళ్లు నానిపోతాయి. అంబాయమ్మ జ్ఞాపకాని కొస్తే వాళ్లు గంగవెర్రు లెత్తుతుంది. అవిణ్ణి గుమ్మంలోంచి 'ఛీఛీఛో' అనాలి. వాళ్ల లచ్చి జ్ఞాపకాని కొస్తే ఇంతనా బొద్దుని గుండె కాయ కసాయివాడి దైపోతుంది. లచ్చిని కొరతవెయ్యాలి. లేకపోతే పంజాబుపతాలానికి 'బాల్' చెయ్యాలి. చిట్టి జ్ఞాపకాని కొస్తే? సింహాసనం వేసి కూర్చోపెట్టి ఆరాధన చెయ్యడానికి మనస్సు ఆయత్తమూ తుంది! అందుకు కావలసిన పూజాద్రవ్యాలు అమర్చుకొంటుంది!

"ఏం చిట్టీ" అని పలకరించాను. ఎంతో తహతహలాడి అవకాశం చిక్కించుకొన్నాను.

"రాత్రి నిన్ను చూశాను." అన్నాది చిట్టి.

"ఐతే పలకరించావు కావు!"

"ఎక్కడో మొగాళ్లమధ్య నున్నావు' ఉంటావా?"

"మధ్యాన్నం పోవాలి"

"మావూరు రా."

"తప్పకుండా."

అంతటితో సంభాషణ అంత మైపోయిఁది. చిట్టిని నేనూ ఆకర్షించాను. అదిమాత్రం ఖాయం. కనబడ్డప్పుడల్లా ఎగాదిగా చూడండీ ఒదిలిపెట్టదు. చిట్టి నామనస్సుని దెయ్యంలా పట్టుకొంది. ఒంటరిగా పడకకుర్చీలో కూర్చుంటే, ఎదురుగా నవ్వుతూ నిలబడుతుంది. కాఫీ తాగుతూఉంటే పీల్చుపీల్చుకీ దాని అధరం మీాద కళ్లు వాల్తాయి. నిద్రలో కల కాదు. జాగ్రదవస్థలో ఉండగా చిట్టిలీల - నిజమైన

చిట్టిలాగే వెచ్చగా, బరువుగా మీాది
కొస్తుంది.

చిట్టితండ్రి కృష్ణారావు ప్లీడరు. రోజు
కూలి పావలా అయినా తెస్తున్నాడో లేదో.
పెళ్లంటే మాటలా! కట్నాలు పొయ్యాలి.
ఈజన్మ కతగాడు పెళ్లి చెయ్యలేడు. చిట్టికి
పంథొమ్మిదో యేడు! నాకు పెద్ద ఆశ పట్టు
కున్నాది. చెరువులో తామరలా ఆశ
బుర్రంతా చుట్టుకుంది. నాఆశకల్లా హేతువు
నాపెళ్లాం మళ్లా కడుపుతో టుంది.

ఆడదానికి ప్రసవమంటే పెద్ద గండం.
తల్లీ పిల్లా వేర్పాటుఅయ్యేవరకూ ప్రాణాలు
పిడికిట్లో పట్టుకోవలసిందే. ఈమాటు ప్రస
వంతో నాపెళ్లాం విధిగా చచ్చిపోతుం దని
నిశ్చయించుకొన్నాను. పెళ్లాం చావు కోరడం
చాలా జాలికరమైన విషయం. ఆమెతో
తృప్తి పొందకపోతే పైతిరుగుళ్లు తిరగొచ్చు.
తిరిగినా నాపెళ్లాం ప్రతిఘటించదు. అంద
వికారి అయిన పెళ్లానికి ఆరోగ్యం, అడకువ,
మొగుడంటే వెర్రివ్యామోహం, ఏవంక
పెట్టి తిడదామన్నా అవకాశ మివ్వని ప్రవ
ర్తనా ఉంటే ఎలాగ చావడం? దాని చావు
కోరడం ఘోరాతిఘోరం. కాని నా చిటికిన
వేలుకింద పెళ్లాల రేఖలు రెండున్నాయి.
ద్వితీయం ఎలాగూ తప్పదు. పెళ్లాం చచ్చి
పోడం, చిట్టిని పెళ్లాడ్డం ఖాయం.

"రెండోపెళ్లి వాడి కిస్తారా" అని సందే
హించడానికి నావిషయంలో భయం లేదు.
చిన్నప్పుడే పెళ్లయింది కాబట్టి పిల్లలు కలి
గారు. పట్టున పాతికేళ్లు లేవు. నాపెళ్లాం
కన్నా చిట్టే మూడేళ్లు పెద్ద! నేను కట్నం
అడుగుతానేమో అని వాళ్లే భయపడాలి.
"రెండోపెళ్లికి కట్నాలుకూడా ఎక్కడ" అం
డానికి నావిషయంలో వీల్లేదు. నేను తండ్రి
కొక్క కొడుకుని. నాలుగు డబ్బు లున్న
వాణ్ణి. నాలుగు డబ్బులు తెస్తున్నవాణ్ణి. ఇలా
గ పెళ్లాం చచ్చిపోతే అలాగ చిట్టితో పెళ్లి
అయిపోతుంది.

ఈమాటు నావివాహం ఆదర్శప్రాయం
గా జరగాలి. నాచిత్తసంస్కారం ఊరికే
పోకూడదు. పూర్వం పెళ్లి ఐదురోజులు.
పెళ్లివారి ప్రాణాలు తీస్తూ పీకలమీాద కూర్చు
నేవారు. ఇప్పుడు పెళ్లంటే వోరాత్రి. మర్నా
డంతా మర్యాదగా వెళ్లిపోవలసిందే. ఏక
రాత్రివివాహం సంస్కరణరీత్యా ముంద
డుగే.

నాసంస్కరణ మరీ విపరీతం. పెళ్లంటే
ఇద్దరు వ్యక్తుల వ్యవహారం. ఇద్దరు సాక్షులూ,
రిజిష్ట్రారు అవసరం. ఆజ్యహోమాలు, పురో
హితసంభావనలు, డిన్నరుపార్టీలు, అన్న
శాంతులూ పనికిరావు. కాణీ కట్నం పుచ్చు
కోను. పెళ్లానికి పసుపూ, కుంకం పెట్టక్క
ర్లేదు. పెళ్లిసంతకాలు కాగానే చకోరదంప
తుల మైపోతాము. వెన్నెల్లో కెగిరిపో
తాము.

మాయిల్లంతా పాడుపాడుగా ఉన్నాది.
ముందు డాబామీాద మేడ వెయ్యాలి. స్ప్రింగు
మంచం కొని పట్టుపరుపు కుట్టించాలి. బెంగు
ళూరు వేసంగి కల్లి రెండు కుక్కలిని
తేవాలి. ఇదంతా చిట్టి పెళ్లామైతే మాట.
లేకపోతే ఏముంది? చిలకలు చెక్కిన మా
తాతయ్యపందిరిమంచం, అట్టలుకట్టిన మా
నాన్నపరుపు, ఉచ్చకంపుకొడుతూ నాపెళ్లాం
నులకకుక్కి కలిస్తే నాపడగ్గది! చెప్పే

దేమిటి ? అవన్నీ నాపెళ్లాంతో మాయమై పోయి చిట్టితో నాయిల్లు ఒక మొగలాయి మహా లైపోవాలి.

హాయ్యా కాకినా డెళ్లేను ! చిట్టి పిలిచిందని, నాపెళ్లాం ఎలాగా చచ్చిపోతుందని పెళ్లికూతురుచూపుల కెళ్లేను ! రామారావుపేటలో కృష్ణారావుగారింటి కెళ్లేను.

"ఏం వోయ్ జ్ఞాపక మున్నాం ? ప్రసాదంపెళ్లిలో కాబోలు చూశాం. కూర్చో. మ రేమిటయ్యా మీవూరి విశేషాలూ ? మీరాజుగారి పిల్ల లెక్కడున్నారు ?" అంటూ కృష్ణారావుగా రడిగారు.

"అక్కడే ఉన్నారండి."

"ఎప్పుడేనా కనబడతారా ?"

"అప్పటప్పట,"

"మనం కోట్లో కెళ్లొచ్చా ?"

"ఖలేదారుగారి నడిగి."

"రావాలోయ్ విజయనగరం. మీ మహారాజకుమార్ కూడా ఘట్టివాడే. యీ మధ్య ఆయనస్టేటుమెంట్లు చెడ్డఘాటుగా ఉంటున్నాయి."

ప్లీడరుగారు విశాఖపట్నం హార్బరు మీదా, వాల్తేరువిశ్వవిద్యాలయంమీదా అరగంట హస్కు కొట్టేరు. ఇంతట్లో ప్లీడరుగారి పెళ్లాం, చిట్టీ నీళ్లబిందెల్తో కాళాయి కెళుతూ కనబడ్డారు. చిట్టిని చూడ్డం అయింది. ప్లీడరుగారి పెళ్లాం కుశలప్రశ్న వేసింది :

"ఏం వోయ్. ఎక్కణ్ణుంచేవిఁటి ? పురుటొద్దులుకాబోలు- నీపెళ్లాం అటూ ఇటూ తేలిగ్గా తిరుగుతున్నాదా ?"

"కులాసాగానే ఉన్నాదండి."

"ఇక్కడా, పుట్టింటా ?"

"మా యింటే."

"సరిసరీ. అన్నట్టు మూడో పురుడు దూ... భోయనాని కుండేం." అన్నాది. ఆమాట ప్లీడరుగా రన లేకపోయారు.

"ఉంటాను లెండి"

"వొస్తూ పోతూ ఉంటేనే చుట్టరికం. ఏవండీ విశాఖపట్నంవాళ్ల మాట ఇతనితో చెప్పేరూ ?" అని మొగు ణ్ణడిగింది.

"జొనేవ్ మరిచిపోయాను !" అన్నాడతను.

"సరిసరీ ! అలాగే ఉంటుంది మన వ్యవహారం. ఇంకెప్పుడు చేస్తారండీ పెళ్లి ? కన్యాదానమంటే గోదానమా ? ఇద్దరు పిల్లలు పుట్టేకా, వోచెంప నెరిసేకా ?"

"చిట్టికేనా పెళ్లి ?" అనడిగేను.

"ఇంకెవరికోయ్ ?"

"తొందరేవిఁటి లెండి ?"

"తొందర కా కేమిటోయ్?"

"అంత తొందరైతే నాకు చేసీయండి"

"ఫో" అన్నాది చిట్టి.

"నాకన్నా మంచివాడు దొరుకుతాడా?"

"అలాగే అయితే అడిగేవ్! అబ్బో! నీపెళ్లాం జుట్టట్టుకుంటుంది." అన్నా దావిడ.

"పిల్లా నొ్నదిలేస్తాను."

"సరిసరీ! ఆమూడోపిల్లో, పిల్లాడో పుట్టనీ తాపీగా వొదిలేద్దువుగాని. నాయ న్నాయన! దేముడిలా గొచ్చావు. ఆసంబం ధంగురించి కనుక్కొని భోగట్టా రాసిపెట్టు" అంటూ వీధిలోకి తోవతీసింది. తల్లి మాట్లాడుతూ ఉంటే పక్కగా చిట్టి చక్కగా నిలబడ్డాది. చిన్న మాట కలిపింది. నా కోరిక సిద్ధించింది. చిట్టిని నేనూ, నన్ను చిట్టీ తనివి తీరా చూచుకొన్నాము. చిట్టి సీళ్ల కెళ్లడం నామర్దాగా కనబడ్డా ఆమెచంకలో రాజమండ్రి రేకుబిందె అందంగానే అమిరింది.

భోజన మైంది. కృష్ణారావుగారు విశాఖ పట్నం పెళ్లివారి ఎడ్రెసు ఇచ్చి వాళ్ల స్థితిగ తులు కనుక్కొని రాయమన్నారు. మంచి ఉద్యోగమే. సావిట్లో ప్లీడరుగారి టేబిలు మీద 'జానోలండన్' పత్రిక కనబడ్డాది.

"ఇదెక్కడిది?" అనడిగాను.

"ఇంకో ప్లీడరుగారిది. ఇదేకాదు క్రైస్టి రియన్, మెర్క్యూరీ, దిబ్బా దిరుగుండం తెప్పి స్తాడు. ఏంటో అత నిలాంటి పత్రికలన్నిం టికీ డబ్బు తగలేస్తాడు. శుద్ధ్రకేకు" అన్నాడు కృష్ణారావుగారు!

'జానోలండన్' వగైరాలు తెప్పిస్తున్న వాడు శుద్ధ్రకేకు! ఆసంచిక పేజీలు తిరగేస్తే నేటి సారస్వతంమీద ఒక సనాతనుడి విమర్శ కనబడ్డాది. ఒక్కపేరా చదువుకోలేక పోయాను. అవతలగదిలో చిట్టి తిరుగాడు తున్నాది. అంత దగ్గరలో ఉన్న చిట్టికీ, నాకూ ఎంత ఎడమైనా ఉన్నాది. దాని వెనకాలే తిరిగే భాగ్యం ఉంటే? చిట్టి చిన్న ఘోషా పాటిస్తున్నాది. అంచేత వాళ్ల సావిట్లో కూర్చోడం ముళ్లమీద కూర్చు న్నట్టు ఉన్నాది.

"వస్తాను" అని లేచాను.

"బాబ్బాబు! ఉత్తరం రాయి. కట్నా లంటే నావల్ల కాదు. లాంఛనాల్లో లోపం చెయ్యను. వొచ్చిన వాళ్ల కింత అన్నం పెడ తాను. ఇంత అన్నం ఉంటే ముడెట్టేస్తాను" అన్నాడు.

"కనుక్కొంటాను" అని బయలుదేరాను.

విశాఖపట్నం వెళ్లి చిట్టికి సంబంధం కుదురుస్తానా? వెళుతూనే ఉత్తరం రా శాను- వాళ్ల కప్పుడే బరంపురంపిల్ల నిశ్చయ మైపోయిం దని. భయం పట్టుకొంది. నాకు తెలియకండా చటుక్కుని చిట్టికి పెళ్లయిపో తుంది. కాని ఎంత దుస్సాధ్యమైనా సాధ్యం గానే కనబడుతుంది. చిట్టికి పెళ్లే అయితే దాని మొగుడు తారని చస్తాడు. అప్పుడు విధ వని పెళ్లాడి సధవని చేస్తాను. చిట్టి విధవ అయి తేనే మంచిది. నేను ప్రాధేయపడుతూ పెళ్లాడితే నామీద స్వారీ చెయ్యొచ్చు. విధవ అయితే దీనురా లైపోతుంది. దీనురాలిని పెళ్లాడినవాడు దేముడైపోతాడు.

ఒకనా డర్ధరాత్రి నన్ను మావాళ్లు లేపి మంత్రసాన్ని తీసుకురమ్మన్నారు. చీక ట్లోపడి దేముడా అని వెళ్లేను. మంత్రసాని రాకండానే నాపెళ్లానికి పురుడొచ్చింది. ఆడ పిల్ల పుట్టింది. ఇహా న్నేను జాగ్రత్తపడక పోతే పెళ్లాం ఏటేటా తేలిగ్గా కని ఇల్లు నింపేస్తుంది. పురుడు దానికి గండం కాదు

కాని చిట్టిదెయ్యం నన్ను వొదిలిపెట్టలేదు. కోర్కెలు అణచివేస్తే మనోవికారాలకింద తేలుతాయి. కోర్కెలు సాఫల్యం చెయ్యడమో, లేక జయించడమో మనం చేస్తూ ఉండాలి. చిట్టితో కాపురం చెయ్యకపోతే ఇంకేం జన్మ? ఆకోర్కెతో నేను కుంగిపోవలసిందేనా? లేదు లేదు. వాంఛానివృత్తికి మార్గా లున్నాయి. లేని ఊర్వశితో కాపురం చెయ్యడాని కవకాశా లున్నాయి.

పడకకుర్చీలో మధ్యాహ్నం కునుకు. సగంనిద్రలో తలగడామెత్తదనం ఊర్వశి చెక్కిళ్ల దనుకో. ఊర్వశి సాక్షాత్కార మౌతుంది.

మెత్తటి పరుపుమీద పడుకుని పల్చటి కండువా ముసుగు వెయ్యి. ఊహించు. ఊర్వశి నీపక్కలో ఉంటుంది.

ఏటొడ్డుకి పోయి ఇసకతిన్నెక్కి కూర్చో. భావగీత మొకటి నీ కభిమానమైనది కూనిరాగం తియ్యి. భావప్రపంచంలో కెళ్లి మనస్సుని ఊర్వశివైపు మళ్లించు. నీ క్కావలసిన సన్నివేశాలు సంప్రాప్త మౌతాయి.

నీపక్కలో పెళ్లా మున్నాదా, సదవకాశం ఉన్నాది. పెళ్లాన్ని ప్రతిరాత్రీ ఊర్వశి అనుకో. చీకట్లో కళ్లకి కాదండానికి వాక్కుపోతుంది. మనస్సుతో చూడు. మసిబొగ్గు మాణిక్య మైపోతుంది.

నిజంగా ఊర్వశిని తెచ్చి నీ కప్పచెపితే నువ్వు చాలా చిక్కుల్లో పడిపోతావు. సంసారికి ఊర్వశి దరిద్రదేవత, దుఃఖకారణమూ అవుతుంది. ఊహాఊర్వశి రాజయోగాన్ని సిద్ధింపిస్తుంది. ఊహాఊర్వశిని పట్టుకొని 'చింబరోజో' అగ్నిపర్వత శిఖరాంచలాలకి షికార్లు పోవొచ్చు. ఆఫ్రికా ఎడారిలో బిడారిప్రయాణం చేసి తోవలో నువ్వూ, నీ ఊర్వశీ గుడారం వేసుకొని ఉక్కాపీలుస్తూ లొట్టిపిట్టపాల్తో కాఫీ పెట్టుకోవొచ్చు.

ఆవిధంగా చిట్టితో 'ఊహాఊర్వశి' కాపరం చేస్తున్నాను. భావకవుల ఆవేశం నాకు పట్టుకొం దనుకుంటారు కాబోలు. భావకవిత్వంమీద అనాదరణా, కవితలో వాస్తవికత, అతివాస్తవికత అంటే అభిమానం ప్రబలిన తరవాతనే నా యీ మనోజాడ్యం. మనోజాడ్యం కాదు, మనో మనోజ్ఞత.

నాభార్య మళ్లా గర్భవతి అయింది. ఇట్టే తిరిగొచ్చేయి నవమాసాలూ! కొడుకుట్టేడని అత్తవారు శుభలేఖ పంపారు. బారసాల కెళ్లాను. బారసాల్లూ, సత్యనారాయణవ్రతాలూ ఇష్టంలేనివే. అయితే నేం? శుభ్రమైన చాపూ, పెళ్లానికి చీరా, కొడుక్కి బంగారపు వొత్తులూ మామగారు పెట్టేరు. అంచేత పెళ్లాంతో పీటలమీద కూర్చుని అత్తారిని సంతోషపెట్టేను.

నెల కొక్కరోజు తక్కువచేసి, నడ్డి బిగించి పెళ్లాం చంటాడితో టింగురంగా మని వొచ్చింది. కాని చిట్టి కింకా వివాహం కాలేదు. నాకు నలుగురు సంతానం.

చిట్టికి పెళ్లి కావడం ఇప్పటికీ నా కిష్టం లేదు. పెళ్లే అయిపోతే జెలసీతో గింజుకు చస్తాను. చాలాకాలం ఎవరిదగ్గరా చిట్టి

అన్న అందాలరాణి పెళ్లి కున్నాదని మాటవరసకైనా చెప్పలేదు. ఎవడైనా పెళ్లాడేస్తాడేమోనని భయం ! ఎంతమంది పెళ్లికొడుకులైనా చిట్టిని చూచారు. అందం ఎవడికావాలి ? గజిటెడు ఆఫీసరుగారి కూతురుకోతైనా సరే తెనుగుప్రొఫెసర్లు పెళ్లాడతారు. చిట్టి కింకా పెళ్లి కాకపోడం, జీర్ణించిపోయినా, నాలో దురుద్దేశాలని రేపుతున్నాది. చిట్టి కింకా పెళ్లి కాకపోడం తెనుగుయువకుల రసజ్ఞతాదారిద్ర్యం వెల్లడిస్తున్నాది.

చిట్టి కింకా వివాహం కాలేదు. నాకు నలుగురు సంతానం. ఇప్పుడు చిట్టికి ఇరవయ్యొకటో ఏడు నిండిపోయింది. చిట్టి నా పెళ్లాంకన్న మూడేళ్లు పెద్ద.





# కొండమీది కుర్రవాడు

సర్వ జీవనాధారుడూ దివాకరుడూ అయిన సూర్య భగవానుడు తన అనంత కిరణాలను అంతటా ప్రసరిస్తున్నాడు. కుర్రవాడు గాలికి తన దోవతిని ఆరబెట్టుతున్నాడు. క్రమంగా శిథిలమవుతూన్న గోడలక్రిందా, విశాలమైన చెట్లక్రిందా నీడలు విస్తరించి ఉన్నవి. సేద్యగాండ్రు పొలాలలో పని చేసుకొంటున్నారు నదీతీరాన పశువులు మేస్తున్నవి దూరాన ఉన్న బస్తీనుండి అలికిడి వినవస్తున్నది .ఇది శాంతభూమి — దీనిని ప్రేమించేవారి కళ్లకెంత మనోహర దృశ్యం।

**ఈ విపత్తు మనదేశానికి కలగకుండా ఉండాలంటే మన మందరమూ ఏకీభవించి సైనికులకు సహాయపడుతూ శాయశక్తులా శత్రువును ప్రతిఘటించాలి.**

ఈ ప్రశాంతతలో ఇక్కడి జీవితం అనేక శతాబ్దాం పాటు శాంతియుతమార్గాల ప్రవహించగలిగింది. గొప్ప పట్టణాలలో జీవనం చేసేవారికి సహితం ఈ ప్రశాంతత అనుభవవేద్య మవుతూనే ఉంటుంది.

కుటుంబ వాతావరణంలోనూ సహవాసంలోనూ నాటుకొనిపోయిన చీనాదేశీయుల ప్రశాంత జీవితం జపాను సేనల ఆక్రమణవల్ల సమూలంగా పెల్లగించబడింది. నాలుగుకోట్లమంది చీనావారు తమ జీవిత మాధుర్యాలను కోల్పోయినారు.

## ఎవరికి వారాలోచించుకోండి;
## అందరూ కలసి పనిచెయ్యండి!
# అదే దేశీయ యుద్ధ రంగం.

CPUB.A T6

# రాజరాజనరేంద్రుని కలిదిండితామ్రశాసనము

= శ్రీ నేలటూరి వెంకటరమణయ్య =

•

కృష్ణామండలములోని కైకలూరుతాలూకాకు చేరిన కలిదిండి గ్రామమున నొక రైతు పాటిమట్టికై త్రవ్వుచుండగా వరాహముద్రతోటి కడియమున గూర్చిన యైదు రేకుల తామ్రశాసన మొకటి భూగర్భమున గానవచ్చెను. సదరు రైతు కడ దానిని గ్రహించి మిత్రులు శ్రీ గూడవల్లి రామబ్రహ్మంచౌదరిగారు ప్రచురణార్థము నా కిచ్చిరి. శాసనము నాచేతికి వచ్చి దాదాపు నాలుగేండ్లయినను కారణాంతరములవల్ల ఇంతకాలము పరిష్కరించి ప్రకటింప వీలుకలుగదాయెను. భూగర్భమున చిరకాలము స్థాపితమైయుండిన కారణముననేమో శాసనపురేకులను దట్టముగ చిలు మావరించి చిట్టెము గట్టుకొని యచ్చటచ్చట నందలియందలి యక్షరములనుసైతము దినివేసియుండెను; శాసనముయొక్క కడపటిరేకులో జాలభాగము తునిగి నష్టమైపోయెను. సంపూర్ణముగ లభించిన తక్కిన నాలుగు రేకులయందుగూడ నచ్చటచ్చట బెజ్జములు పడినవి. శాసనము నాచేతికి రాకపూర్వమే కడియ మెవ్వరిచేతనో తెగగొట్టబడియుండినది. శాసనపురేకులనుండి చిలుమును వదల్చి పరిశుద్ధముచేసి యిచ్చినందులకు మద్రాసుగవర్నమెంటుమ్యూజియము సూపరింటెండెంటగు డాక్టరు అయ్యప్పన్ గారికిని, ఆర్కియాలాజికల్ కమిష్టను డాక్టరు పరమశివన్ గారికిని నాకృతజ్ఞతాపూర్వకవందనములను సమర్పించుచున్నాను.



## పరిమాణాదులు

సంపూర్ణముగ నుండు నాలుగురేకులయందు ఒక్కొక్కటియు ౧౦ అం. నిడివియు, ౫ అం. వెడల్పును గలది. లభ్యమైన యైదవరేకుయొక్క తునకవెడల్పునిటివలె నైదంగుళములే యైనను నిడివి హెచ్చుతగ్గులుగలిగి యున్నది. దీని నిడివి కొన్నితావుల ౨ అం; మఱికొన్నియెడల ౩¼ అం. కడియము బటువైనది. ఘనము ¼ అం; మధ్యకొలత ౫ అం. రేకులలోని బెజ్జముగుండ కడియము దూర్చబడి రెండు కొనలును గలియుచోట రాజముద్రికతో కెర్చి తాపటము సేయబడియున్నది. వలయముతోగూడ రేకులయొక్క తూకము ౩౯-౨ తులములు. పరిమాణాదులను నిశ్చయించి నాకు దెల్పినందుకు (ఇప్పుడు) గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు శ్రీ రావుబహదరు సి. ఆర్. కృష్ణమాచార్యులు, బి. ఏ. గారికి నాకృతజ్ఞత నిందుమూలమున దెల్పుకొనుచున్నాను.

## రాజముద్రిక

ఇంతవఱకు లభించిన పూర్వచాళుక్యముద్రికలలో నిది కడు సొంపైనది. దీనితో బోల్పదగినవి పెక్కు కానరావు. ఉభయతలములను అంచు తీర్పబడియున్నది. అధోభాగము నాలుగురేకుల పువ్వువలె దీర్పబడి కర్ణిక యుండు చోట వలయముతో జాపటము సేయబడియున్నది. ఈ పరితలమధ్యమున

'త్రిభువనాంకుశం' అను బిరుదాక్షరములును, వాని పైభాగమున చాళుక్యనృపాలుర రాజ్యచిహ్నములును నిటముగా చెక్కబడియున్నవి: మధ్యభాగమున డాపలిముఖమై పరుగిడుచుండునట్లు చెక్కబడిన



[రాజముద్రిక.]

చాళుక్యుల వరాహలాంఛనమును, దాని యెదుట అంకుశమును వెనుక డమరుకను, పోత్రమునకు కొంచెము పైన శంఖమును, తలదోకలకడ చామరములును గానవచ్చెడిని. వరాహముయొక్క శిరమున కనుబడు ముద్రిక పైయుంచు సానుకొని ఛత్రమును, వీపున కనుబడు సూర్యచంద్రబింబముల రూపములును దెలియవచ్చుచున్నవి. బిరుదాక్షరములక్రింద ఎడమవైపు చిన్న గద్దెయు, మధ్య నాల్గురేకులతోడి పుష్పమును, కుడి ప్రక్క నాళముతోడి తామరపువ్వును గలవు.

## లిపి

ఇందలి లిపి తూర్పుసముద్రాంధ్రదేశమున క్రీ. శ. ౧౧-వ శతాబ్దమున సామాన్యముగ వాడుకయందుండిన ప్రాచీనాంధ్రలిపి. వ్రాత చక్కనిది. అక్షరములు ఇంతకుపూర్వము ప్రకటితములైన రాజరాజనరేంద్రుని కోరుమెల్లి నందంపూడి శాసనములవంటివే; లోతుగ చెక్కబడియుండుటచేత శిథిలమైన తావులయందు దప్ప తక్కినయెడల స్పష్టముగా గానవచ్చుచున్నవి. శాసనమునందు పెరసి ౧౧౭ పంక్తుల వ్రాత కలదు. మొదటిరేకు మొదటిప్రక్కను, ఐదవరేకు రెండవప్రక్కను వ్రాత యేమియు గానరాదు. తక్కిన రేకులన్నిటిలోను రెండుప్రక్కలను వ్రాతకలదు. మొదటిరేకు రెండవప్రక్కను, మూడునాల్గు రేకుల మొదటి ప్రక్కను నొక్కొక్కదానియందు ౧౬ పంక్తులును, రెండవరేకున ఉభయపక్షములనొక్కొక్కదానియందు ౧౪ పంక్తులును, మూడవరేకు ద్వితీయపార్శ్వమున ౧౫ పంక్తులును, నాల్గవరేకు రెండవవైపునను, ఐదవరేకు మొదటివైపునను ౧౩ పంక్తులునుగలవు. ప్రస్తుతము పరిష్కృతమగుచున్న దానితో గూడ రాజరాజనరేంద్రునివి మూడు తామ్రశాసనములు లభించినవి. వీని యన్నిటియందును సామాన్యముగ నొక విశేషము గానవచ్చుచున్నది. ఈశాసనములకు సంబంధించిన రేకులన్నియు వీనికొఱకే ప్రథమమున సిద్ధపఱచినవి కావు; కొన్ని ప్రాచీన తామ్రశాసనములనుండి సంగ్రహింపబడి యందలి ప్రాతయక్షరముల జడియగొట్టి తలమును సమముచేసి వాడబడినవి. ప్రాచీనాక్షరములు జడిసియు సంపూర్ణముగ రూపుచెడక సూక్ష్మముగ బొడకట్టుచున్నవి. ఇట్లు మొదటివ్రాతను దుడిచి దానిపై మరల వ్రాసిన వ్రాత కాంగ్లమున 'పాలింప్సెస్ట్'అందురు. కోరుమెల్లి శాసనమును బరిష్కరించు సందర్భమున డాక్టరు ఫ్లీటుగారిట్లు చెప్పియున్నారు: "ఇందలి మొదటిరేకొక పాలింప్సెస్టు: వెలుపలిప్రక్క, పంద్రెండుపంక్తుల ప్రాచీనతరమైన చదరపు టక్షరముల వ్రాతపాలకుబ స్పష్టముగ గోచరించుచున్నది. కాని యక్షరములన్నియు జక్కగ జడిసిపోయియుండుటచేత నేభాగ

మును నిర్ధరించి చదువుటకు శక్యముగాక యున్నది"[1]
నందంపూండి శాసనమున నీవిషయమునందు గొంత
వ్యత్యాసము గానవచ్చుచున్నది. కోరుమెల్లి శాసనము
వలె నదియు గొంతవఱకు ప్రాతశాసనపు రేకులలో
జదును సేయబడిన ప్రాచీనాక్షరముల మీద జెక్క
బడినదే (చూ: రే. 3, ప్ర. ౨, పం. ౫౦-౫౫).
ఇంతే కాదు. వంశవర్ణన గలయంతవట్టు నక్లు సం
గ్రహింపబడిన యొక ప్రాతశాసనపు రేకులతో
దానమును వివరించు క్రొత్త రేకులు జతసేయ
బడియున్నవి. ఈ విషయమై డాక్టరు కీల్హార్న్ గారిట్లు
చెప్పియున్నారు: "(నందంపూండిశాసనమునందలి)
యక్షరములు సర్వత్ర దక్షిణమున వాడుకయందుండి
నవే. కాని వీనియందు రెండు పూర్వోత్తరఘట్టములు
పొడకట్టుచున్నవి. ఏబదియవపంక్తి (మూడవరేకు
రెండవప్రక్కలోని ౬-వ పంక్తి) వఱకు నందలి యక్ష
రము లిమ్మడి యమ్మరాజు తామ్రశాసనముల యక్షర
ముల బోలియున్నవి. ఈ యక్షరములయందే మూడవ
రేకు కడవఱకు మొదట చెక్కబడియుండెను. కాని
౫౦-౫౫ పంక్తులలో నీయక్షరములు జదియగొట్ట
బడి, మూడవరేకునందు (౫౦-వ పంక్తిలోని మొదటి
మూడక్షరములుదప్ప) కడపటి ౬ పంక్తులు, ౪, ౫-వ
రేకులును గండాచార్యునిచే జెక్కబడిన మొదటి రాజ
రాజుయొక్క కోరుమెల్లిశాసనపు వ్రాతనుబోలిన
యక్షరముల లిఖింపబడియున్నవి".[2]

ప్రస్తుతము బరిష్కృతమగుచున్న ఈ కలిదిండి
శాసనములోని యుత్తరభాగముగూడ పైజెప్పినరీతినే
యక్షరములను జదిపి స్నిగ్ధము జేసిన ప్రాతశాసనపు రేకుల
మీదనే చెక్కబడియున్నది. డెబ్బదిరెండవ (రే. 3,
ప్ర. ౨, పం. ౯) పంక్తి మొదలుకొని శాసనాంతమువఱకు
ప్రాచీనాక్షరముల యానవాళ్లు స్పష్టముగ దెలియ
వచ్చుచున్నవి. అక్షరము లన్నియు జక్కగ జదిసిపోయి
యుండుటచే వానిని గుర్తించుటకు సాధ్యపడదాయెను.
మొదటి రెండు రేకులను జెక్కిన విశేఖరి తక్కిన
రేకుల జెక్కినవానికంటె భిన్నుడని తోచుచున్నది.
కాని శాసనమునం దన్నిరేకులను నక్షరములకు
గాఢమైన పోలిక లగపడుచుండుటచే నీయంశము నొత్తి
చెప్పుటకు వలనుపడదు. రాజరాజనరేంద్రుని కాలమున
ప్రాతశాసనములను జెరిచి వానిపై నూతనశాసనముల
వ్రాయు నాచార మేల ప్రబలెనో తెలియదు. రాగి
వలసినంత లభింపకపోవుటయే దీనికి కారణమై యుండు
నేమో.

## భాష

శాసనభాష సంస్కృతము; గద్యపద్యాత్మకము.
నానాజాతుల వృత్తములు ౪౧ కలవు; ౮ గద్యలు (పెద్దవి
చిన్నవి చేరి) పద్యములతో దిలతండులన్యాయమున
గలసియున్నవి. శాసనగ్రంథ మంతయు సంస్కృతమున
విరచితమైనను దానియం దచ్చటచ్చట గొన్ని తెనుగు
మాటలు గానవచ్చుచున్నవి. దానోద్దిష్ట గ్రామపు
పొలిమేర మొదలగువానిని వర్ణించు సందర్భమున
"ధరేవులు నామ విషయసహితం పల్లపు గుద్రవార
విషయం" (పం. ౮౪-౮౫); "తామరకొలని క్రొ
వ్విండి రేటం బాసిన తల్లిక్రొయ్య నామ నదీ" (పం.
౧౦౭-౯) యను వాక్యము లీయంశమును విదితము
సేయుచున్నవి. లేఖకుని ప్రమాదమున శాసనగ్రంథ
మున పెక్కుతావుల దప్పులు దొర్లియున్నవి. వీని
నన్నిటిని అధోజ్ఞాపికలయందు దెలుపుచున్నాను.

## ప్రశస్తి

ఈ శాసనమున కప్పటి యన్య చాళుక్య రాజ
శాసనములతో సన్నిహిత బాంధవ్యము కలదు. ముఖ్య
ముగ నీపట్టున రాజరాజనరేంద్రుని కోరుమెల్లి నందం
పూండి శాసనములును, వాని తండ్రియగు విమలా
దిత్యుని రణస్తిపూండిశాసనమును స్మరింపదగినవి. శబ్ద
జాలమందే కాక వాక్యములయందును బోలికలు గలవు.
శ్లోకములు కొన్ని కొంచెమైన మార్పు లేక గాన
వచ్చుచున్నవి; ఇంచుక మార్పుతో మఱికొన్ని
యగపడుచున్నవి. శాసన గ్రంథారంభమందలి 'శ్రీ
ధామ్నః' (పం. ౧-౩) 'తస్మాదభూత్' (పం. ౩-౪)
కొంచెము మార్పుతో నన్నిటి యారంభమునను గలవు.

1. Indian Antiquary, XIV p. 49.
2. Ep. Ind. IV. p.301

అందందు కతిపయశ్లోకములతో గూడ గానవచ్చు గద్య (పం. ౪౦-౪౧) యన్నిటియందును కించిద్వ్యత్యాస మేనియు లేక సర్వత్ర యేకవిధముగ నుండకపోయినను కేవలము భిన్నమని చెప్పుటకు వీలులేదు. ఒక శాసనమందలి గద్యకు మఱియొకదాని యందలి భేదములు పాఠాంతరములని చెప్పదగియున్నవి. పైపేర్కొనిన శాసనము లన్నింటిలోను గోరుమెల్లి శాసనగ్రంథము దీనికి గడు సన్నిహితము. ఈ పెద్ద గద్యయందు వచ్చెడి శ్లోకములు కొన్ని యన్ని శాసనములకును సామాన్యము. 'పుత్ర స్తస్య' (పం. ౧౨-౧౩) యను శ్లోక మించుక భేదములతో నన్నిటను గలదు. అట్లే 'తస్యాసీ ద్విజయాదిత్య' (పం. ౨౮) యనునది యన్నిటిలోను బొడగూపుచున్నది. ఈ శాసనములోని 'అమ్మరాజానుజో' (పం. ౪౧) యను నను ష్టుప్పించుక వ్యత్యాసముతో గోరుమెల్లి దానశాసనమున నగపడుచున్నది. 'తతః పరం' (పం. ౪౫-౪౬) రెంటను నొక్క తెరగుననే కలదు. దీని తరువాత వచ్చు 'అథ దానార్ణవా జ్జాతః' (పం. ౪౬-౪౮), 'యస్యోత్తమాంగం' (పం. ౫౫-౫౬) 'సద్వీపం' అను శ్లోకము లీషద్భేదముతో రెంటను గానవచ్చెడిని. మఱియు 'ఖ్యాతసమస్తవరనాథా' (పం. ౫౬-౫౮) యను శ్లోకముయొక్క పూర్వార్ధము కించిద్భేదముతో 'నాథసమస్తవరనాథా' యని గోరుమెల్లి శాసనమున చోళచక్రవర్తి ప్రథమరాజరాజును వర్ణించెడి యొక శ్లోకముయొక్క ఉత్తరార్ధముగ నగపడుచున్నది.

## శా స న గ్ర ం థ ము

శాసనగ్రంథమును నాలుగు భాగములుగ విభజింపవచ్చును: (౧) రాజరాజనరేంద్రుని పర్యంతము గల పూర్వచాళుక్యవంశానుచరితము, (౨) దానసందర్భ వివరణము, (౩) దానోద్దిష్ట గ్రామమర్యాదవర్ణన, (౪) దానఫలాదికథనము.

౧. మొదట వంశక్రమమునుగూర్చి కొంత చెప్పవలసియున్నది. వంశక్రమమును పౌరాణికము, చారిత్రకము అని రెండు పాయలుగ వేర్పఱచవచ్చును.

పౌరాణికము :— శాసనోక్త పూర్వచాళుక్య వంశానుచరితము భగవంతుడగు నారాయణుడు, బ్రహ్మ, అత్రి, చంద్రుడు మున్నగు దేవతలతో నారంభమై చంద్రవంశజుడగు శతానీకుని పుత్రుడు ఉదయనునివఱకు నవిచ్ఛిన్నముగ జెప్పబడినది. తరువాత కొంతయెడ మగిపడుచున్నది. ఉదయనుని తరువాతి రాజులను పేర్కొనక ప్రశస్తికారుడు అనామధేయులగు నేబదితొమ్మండ్రు రాజు లయోధ్యాపురము నుండి భూపరిపాలన మొనర్చి రని చెప్పి యాఘట్టమును దాటెను. తరువాత యరువదియవవాడగు విజయాదిత్యుడు దక్షిణాపథమునకు వచ్చి త్రిలోచనపల్లవు నెదుర్కొని యుద్ధమున నిహతుడయ్యెనట. ఇతడు మడిసినప్పుడు చూలాలైయుండిన ఇతని రాణి విష్ణువర్ధను డను నొక కుమారుని గనెను. అతడు స్వవంశము నభివృద్ధిపఱచి నర్మదాసేతువులమధ్య నుండు దేశముపై దన యధికారమును నెలకొల్పెను. సంగ్రహముగ నిందలి పూర్వచాళుక్యుల పౌరాణికవంశక్రమ మిది.

ఈ సందర్భమున చాళుక్యుల కీపౌరాణికవంశానుక్రమణిక యెట్లు సంక్రమించెనో మొదట దెలిసికొనవలసియున్నది. దీని పాలకుడ విమలాదిత్యునికి పూర్వము వేంగి నేలిన చాళుక్యరాజుల శాసనములలో దేనియందును గానరాదు. క్రీ. శ. ౧౧-వ శతాబ్దారంభమున గల్యాణి రాజధానిగ జేసికొని కర్ణాటపశ్చిమాంధ్ర దేశముల బాలించిన పాశ్చాత్యచాళుక్యుల శాసనముల యందుమాత్రము గొన్ని పోలిక లగపడుచున్నవి.[3] కాని యీ పోలికలు కాకతాళీయము లని తోచెడిని. ఒకవేళ రెండు రాజకుటుంబములలోను సామాన్యమైన గాథ యిట్టి దొకటి వాడుకయం దుండుటయే పైజెప్పిన పోలికలకు గారణమైయుండవచ్చును. సందర్భ చితాంశముల నన్నిటిని బరిశీలించిచూడగా, కీ. శే. శ్రీ. వి. లక్ష్మణరావుపంతులుగారు చెప్పినట్లు 4 విమ

3. అయోధ్యలో నేబదితొమ్మండ్ర నామధేయ నృపాలుర రాజ్యప్రసక్తియు, ననంతరదక్షిణాపథాగమనమును క్రీ. శ. ౧౦౦౯ నాటి రెండవ విక్రమాదిత్యుని కౌథేయముశాసనమున జెప్పబడియున్నవి. ఇం. ఆంటి. సం. ౧౬, పుట ౨౧.

4. లక్ష్మణరాయవ్యాసావళి, పుటలు ౫౯-౬౦.

లాదిత్యుని కాలమున నుండిన ప్రశస్తికర్తలే తమ్మేలిన రాజులను చంద్రవంశముతో సంపర్కమును గల్పించి దాని కనుకూలముగ నీశాసనమున గానవచ్చెడి పౌరాణికవంశానుక్రమణికను గల్పించి రని తోచుచున్నది.

పూర్వచాళుక్యప్రశస్తిపరిణామమున విమలాదిత్యుని కాల మొక ముఖ్యఘట్టమైయున్నది. కుబ్జవిష్ణువర్ధనుని కాలమునుండి గుణగవిజయాదిత్యునివఱకును గల రాజుల శాసనములలోని ప్రశస్తి కొన్ని యల్పభేదములతో నాంధ్రదేశమును బాలించిన ప్రాచీన నృపాలుర ప్రశస్తివలె నున్నది. వానియందు సాధారణముగ దాతయొక్క పితృపితామహులమాత్రమే పేర్కొనబడియున్నారు. వారినిగూర్చి మఱి యెట్టి విశేషములును నందు గానరావు. గుణగవిజయాదిత్యుడు సింహాసనము నధిష్ఠించినది మొదలు పూర్వచాళుక్యప్రశస్తియం దొక క్రొత్త మార్పు గానవచ్చెడిని. పితృపితామహులతోపాటు వేంగియం దాదినుండియు ప్రభుత్వమొనర్చిన పూర్వచాళుక్యరాజుల నందఱిని, వారి ప్రత్యేకరాజ్యకాలములను దెల్పు నాచారము ప్రారంభమాయెను. పురుషాంతరములు గడచుకొలదియు గ్రమక్రమముగ బ్రశస్తియు నభివృద్ధి జెందుచువచ్చి కడపటవంశచరిత్రగ బరిణామమునందెను. విమలాదిత్యుని రాజ్యాభిషేకకాలమువఱకు వేరుమార్పు నందక ఇట్లే వాడుకయం దుండెను. తరువాత నింకొక మార్పు బొడకట్టెడిని. పౌరాణికవంశక్రమమును, నయోధ్యాసంపర్కమును, విజయాదిత్య దక్షిణాపథగమనమును నప్పుడు నూతనముగ వంశచరిత్రతో జోడింపబడెను.

పౌరాణికవంశనిర్మాణమునకు గారణ మెద్దియో తెలియదు. క్రీ. శ. ౧౧-వ శతాబ్దారంభమునుండియు గలిగిన చోళరాజకుటుంబముతోటి సంబంధ మొక కారణమైయుండవచ్చును. అప్పటినుండియు బూర్వచాళుక్యులు చోళచక్రవర్తుల కాశ్రయులైరి. వేంగిరాజ్యము స్వాతంత్ర్యరహితమై చోళసామ్రాజ్యాంతర్గతసంస్థానముగ మారెను. పూర్వచాళుక్యవంశజులు చోళచక్రవర్తుల కొలువున బ్రవేశించి చోళరాష్ట్రమున రాజకీయోద్యోగము సేయ నారంభించిరి.[5] చోళచక్రవర్తి మొదటి రాజరాజు కుమార్తెయగు కుందవను వివాహమాడి విమలాదిత్యుడు దన రాజ్యాభిషేకమునకు బూర్వము చోళరాజధానియగు దంజనగరప్రాంతమున నుండు దిరువైయ్యారు ప్రాసాదమున నివసించుచుండెను. పట్టాభిషిక్తుడై రాజ్యము సేయుచుండగా నొక్క పర్యాయ మతడు మామగారి కడ కరిగినట్లు గానవచ్చుచున్నది.[6] చోళరాజకన్యను బెండ్లాడి, చోళరాజ్యమున నివసించుచుండుకాలమున విమలాదిత్యునకు దన వంశమునకు పౌరాణికరాజవంశములతో సంబంధము గల్పించుకొనవలయు నని యిచ్చ పొడమియుండును. చోళచక్రవర్తి దన వంశము స్వయంభువు, బ్రహ్మ, సూర్యుడు, మనువు, ఇక్ష్వాకు, రాముడు మొదలగు పురాణపురుషులనుండి యుత్పత్తిల్లె నని విశ్వసించి, తాను సూర్యవంశక్షత్రియుడ నని ప్రకటించుకొనుచుండెను. అంతటి యుదాత్తరాజవంశముతో వివాహసంబంధము గావించుకొనిన విమలాదిత్యుడు స్వవంశ మంతకు దీసిపోయిన దని చెప్పుట కంగీకరించునా? తాను చోళుల యాశ్రితు డైనంతమాత్రముననే చిరకాలము సామ్రాజ్యవైభవ మనుభవించిన నిజవంశప్రాధాన్యత యంతరించిపోవునా? కావున మామగారి వంశమువలె దన వంశమును బ్రాచీనక్షత్రియవంశ మని ప్రకటించుకొనుటకు విమలాదిత్యుడు పౌరాణిక వంశానుక్రమణికను నిర్మించుకొని శాసనస్థము గావించుకొనెను. చోళులు దమ వంశము సూర్యునినుండి పుట్టినట్లు చెప్పుకొన, విమలాదిత్యుడు దన వంశము సూర్యుని తోడగు చంద్రునుండి యుత్పత్తి యాయెననియు, మన్వాది పురాణపురుషులకు సములైన బుధ, పురూరవ, భరతపాండవాదులు దన వంశమునకు మూలపురుషు లనియు దెల్పెను.

ఈపట్టున విచారణీయమైన యంశ మింకొకటి కలదు. చాళుక్యవంశకర్త యనబడు విజయాదిత్యుడు చారిత్రకపురుషుడా, లేక కల్పితపురుషుడా? పరిశోధకపండితులు కొందఱు ఇతడు చారిత్రకపురుషుడనియు, త్రిలోచనపల్లవకరికాలచోళుల సమకాలికు

5. ARE 44 of 1896.

6. ARE 683 of 1902 (S. I. I. viii 384); 215 of 1894 (S. I. I. v., 514).

డనియు నభిప్రాయపడుచున్నారు.7 కాని ఈసిద్ధాంతమున కాశ్రయభూతములైన యాధారములు కేవల మర్వాచీనము లగుటచే విశ్వాసపాత్రములు గావు. చాళుక్యకులమునకెల్ల మూలకంద మనదగిన బాదామిచాళుక్యవంశమున నీవిజయాదిత్యునికి తావు లేదు. వంశకర్త ప్రస్తావనాసందర్భమున బాదామిచాళుక్యరాజులు విజయాదిత్యుని పేర్కొనకపోవుటయేకాక తమ వంశమునకు మూలపురుషుడు జయసింహవల్లభు డని తెల్పుదురు. జయసింహునికి విజయాదిత్యుడను నామాంతర మున్నట్లైనను లేదు. కల్యాణిచాళుక్యులుగూడ నీసందర్భమున విజయాదిత్యుని పేర్కొనరు. కాఢేయముశాసనమున విజయాదిత్యసంస్మరణ కలదు. కాని యది యొక ప్రత్యేకవ్యక్తిని దెల్పునామము గాదు; చాళుక్యరాజుల విశేషనామము: బిరుదని చెప్పవచ్చును. ఈ క్రిందివాక్యము దీనిని దెల్లము చేయుచున్నది :

"సమస్తభువనాశ్రయ సర్వలోకాశ్రయ విష్ణువర్ధన విజయాదిత్యాది విశేషనామానామ్ రాజరత్నానా ముద్భవభూమిః"8

కావున నీవిజయాదిత్యనామము ఇచ్చట సమస్తభువనాశ్రయ సర్వలోకాశ్రయ నామముల తరగతికి జేరినది; కట్టి బిరుదు. పూర్వచాళుక్యులయందుగూడ విమలాదిత్యుని పూర్వికు లెవ్వరు విజయాదిత్యుడు దమ వంశకర్త యని చెప్పియుండలేదు. వా రెవ్వరును వంశకర్తవిజయాదిత్యు నెఱుంగరు. పైజెప్పిన యంశముల నన్నిటిని కణిశించిచూడగా విజయాదిత్యుడు చారిత్రకవ్యక్తి యనియు, చాళుక్యవంశస్థాపకు డనియు జెప్పుట సమంజసముగాదని తోచుచున్నది.

చారిత్రకము:— పూర్వచాళుక్య ప్రశస్తియందలి చారిత్రకభాగము వంశానుచరితముగ చేర్పడుచున్న దని మీద జెప్పియున్నాము. పూర్వ చాళుక్యశాసనములలోని విశేషచరిత్రాంశము లెల్ల నిందు సూత్రప్రాయముగ వర్ణింపబడియున్నవి. కాని తగిన వ్యాఖ్యానము లేక వానిని గ్రహించుట సాధ్యము గాదు. శాసనోక్తవిషయగ్రహణమునకు వంశానుచరిత్రజ్ఞాన మంతగ నావశ్యకము కాకపోవుటచేతను, గ్రంథబాహుళ్యభీతిచేతను ఇచట వ్యాఖ్యానరచనకు బూనుకొనలేదు. పూర్వ చాళుక్య శాసనముల స్వభావము నెఱిగినవారి కందఱికిని వారి వంశానుచరిత్ర పరిచితమే. కుబ్జవిష్ణువు మొదలు రాజరాజనరేంద్రునివఱకు నడచిన చరిత్ర రాజరాజనరేంద్రుని యితర శాసనములం దున్నట్లే యిందును గలదు. కాని యల్పభేద మొకటి యిందు గానవచ్చుచున్నది. పూర్వచాళుక్య శాసనము లన్నిటియందును కుబ్జవిష్ణువును, నాతని తదనంతరము రాజ్యపాలన మొనర్చిన మొదటి జయసింహుని పేర్కొనిన పిమ్మట "తదనుజేంద్రరాజ స్నుత్తదినాని" యని యుండగా నీశాసనమునను, కోరుమెల్లి శాసనమునను "తదనుజేంద్రరాజనందన స్నుత్తదినాని" (పం. 33)9 యని యున్నది. ఇది కేవల ప్రమాదజనిత మని దెలచెదను. ఏలనగా 'ఇంద్రరాజనందనః' యని మఱే యే పూర్వచాళుక్య శాసనమునను గానరాదు. 'ఇంద్రరాజః' అనియే యన్నిటను గలదు. మీదుమిక్కిలి యేడు దినము లేలినవాడు ఇంద్రభట్టారకాపరనామధేయు డగు నింద్రరాజు గాని యతని నందనుడు గాడు. ఇంద్రరాజుకొమారు డిమ్మడి విష్ణువర్ధనమహారాజు. ఇతడు తొమ్మిదివర్షములు రాజ్యము సల్పిన ట్లన్ని పూర్వచాళుక్యశాసనములందును గలదు. కావున 'ఇంద్రరాజనందనః' యనునది తప్పనియు, నుల్లేఖకుని ప్రమాదమువల్ల గలిగిన యపపాఠ మనియు నిశ్చయముగ జెప్పవచ్చును.

పూర్వచాళుక్యశాసనములలో గానవచ్చు వంశావళియే యిందును గానవచ్చుచున్నది. రాజరాజనరేంద్రుని కోరుమెల్లినందంపూండిశాసనములు దీని కత్యంతసన్నిహితములు. కాని యిందు రాజరాజనరేం

---

7. ఆచార్య కె. ఏ. నీలకంఠశాస్త్రి: చోళ స్టడీస్. పుటలు ౫౩–౬౧. పూర్వము ప్రస్తుత వ్యాసకర్తగూడ నిట్టి యభిప్రాయమును గలిగియుండెను. కాని ఇటీవలి పరిశోధనమువల్ల నిది సమంజసము గాదని తోచుటచే దీనిని విసర్జించెను.

8. ఇం. ఆంటి. సం. ౧౬, పుట ౭౧.

9. ఇం. ఆంటి. సం. ౧౪, పు. ౫౦. (పం. 33.)

ద్రుని గూర్చి కొన్ని నూతనాంశములు గలవు. కోరుమెల్లి నందంపూండి శాసనములలోవలె నిచటను గుండ వాంబావిమలాదిత్యుల వివాహమును, రాజరాజనరేంద్రుని జననమును వర్ణింపబడినవి. ఇందును రాజరాజనరేంద్రుని పట్టాభిషేక కాలనిరూపణశ్లోకము గలదు. శకము ౯౪౪-వ సంవత్సర సింహ బ|| ౨ గురువారమున నుత్తరాభాద్రాసహితవణిజలగ్నమున నతని పట్టాభిషేకమహోత్సవము నడచెను. ఈ విషయములు చిరపరిచితములే. ఇవిగాక నిం దొకటిరెండు నూతనాంశములు బొడకట్టుచున్నవి. రాజరాజనరేంద్రుడు బాల్యదశయందే యౌవరాజ్యపదచిహ్నమైన రత్నకంఠికను బడసెనట. మఱియు నతని సుగుణసంపత్తిని విని సంతసించి యతని మాతులుడు చోళచక్రవర్తి రాజేంద్రచోళమధురాంతకదేవుడు దన కుమార్తెయగు నమ్మంగదేవి నిచ్చి యుద్వాహము గావించెనట. అమ్మంగదేవీ వివాహప్రసంగసందర్భమున నామెతండ్రియగు రాజేంద్రచోళచక్రవర్తిప్రశంస కొంత కలదు. అతని కీర్తివైభవమును, పరాక్రమాతిశయమును, రాజ్యవిస్తారమును విపులముగ వర్ణింపబడియున్నది (పం. ౫౪-౬౪). కాని యందు చేర్కొనదగిన విశేషచరిత్రాంశము లేవియు గానరావు. "ఏకస్యాసీదపి స హిమవాన్", "సద్వీపం చతురంబురాశిపరిఖాం" (పం. ౫౮-౬౨) అను శ్లోకములు రాజేంద్రచోళుని గంగా దండయాత్రను, బూర్వ సముద్రాంతర్గత ద్వీపవిజయమును సూచించుచున్నవేమో.

ఈ శాసనగ్రంథము రాజరాజనరేంద్రుని జీవితమున నడచిన ముఖ్యాంశములను నాల్గింటిని దెల్పుచున్నది: (౧) జననము, (౨) యౌవరాజ్యాభిషేకము, (3) రాజ్యాభిషేకము, (౪) వివాహము. వీనియం దొక్కొక యంశమును గూర్చియు జెప్పదగిన విషయము కొంత యున్నది.

౧. జననము:—రాజరాజనరేంద్రుని జన్మకాలమును దెల్పు గ్రంథ సామగ్రి యెద్దియు నింతవఱకు లభించలేదు. సూక్ష్మముగ నిర్ధారించుటకు సాధ్యము గాకపోయినను మన కింతవఱకు దెలిసిన చరిత్రాంశముల నాధారపఱచుకొని యూహ్యాయించి స్థూలముగ నతని జన్మకాలమును సూచించవచ్చును. బాల్యముననే రాజరాజనరేంద్రుడు యౌవరాజ్యపదచిహ్నమగు రత్నకంఠికను బడసెనని పరిష్కృతమగు నీశాసనమువల్ల దెలియుచున్నది గదా. యౌవరాజ్యపదచిహ్నమగు నీకంఠిక రాజనరేంద్రు డతని తండ్రియగు విమలాదిత్యుని రాజ్యాభిషేకమునకు బూర్వము బడసియుండజాలడు. విమలాదిత్యుని రాజ్యాభిషేకము క్రీ. శ. ౧౦౧౧ లో జరిగెను. రాజరాజనరేంద్రుని యౌవరాజ్యాభిషేక మతని తండ్రి సింహాసన మధిష్ఠించిన పిమ్మటనే జరిగియుండవలయును. ఒకవేళ నతని యౌవరాజ్యాభిషేక మతని తండ్రిపట్టాభిషేకముతో పాటు క్రీ.శ. ౧౦౧౧ లో నడిచెననియు, నప్పటికి రాజరాజనరేంద్రుడు పదునారేండ్లప్రాయము గలవాడనియు దలచినచో నతడు క్రీ. శ. ౯౯౫-వ సంవత్సరమున బుట్టియుండవలయును.

౨. యౌవరాజ్యాభిషేకము :—రాజరాజనరేంద్రుని యౌవరాజ్యాభిషేకము నిరభ్యంతరముగ జరిగియుండవలయును. అతడు విమలాదిత్యుని జ్యేష్ఠపుత్రుడు. [11] మీదుమిక్కిలి యొక చోళచక్రవర్తిమనుమడు; మఱియొక చోళచక్రవర్తి మేనల్లుడు. కావున యౌవరాజ్యపదమున కతనికి గల సహజమైనహక్కునకు దోడు తల్లివంకబంధువుల ప్రోద్బలమును జేకూడెను. ఇక నతని యౌవరాజ్యపట్టాభిషేకము నిరాటంకముగ జరిగెనని నిస్సంశయముగ బలుకవచ్చును.

3. యౌవరాజ్యాభిషేక మిట్లు నిర్బాధకముగ నొనసాగినను రాజ్యాభిషేక మంత సులభముగ జరుగలేదు. కోరుమెల్లి నందంపూండి తామ్రశాసనములవలె

10. పం. ౫౨-౫3. 'బాల్యే భూషణ మభవద్రత్నమయీ యస్య కంఠికా కంఠే'

11. మహాభారతకర్త నన్నియభట్టీయంశమును స్పష్టముగ దెలియపఱచియున్నాడు :

" సత్యాశ్రయకులశేఖర
నిత్యోదయరాజరాజనృపసుకవిజన
స్తుత్యమహాగుణవిమలా
దిత్యాగ్రతనూజ విమలధీరమణీయా."
(ఆం. భా. ఆది. ౪-౧౬౨)

నీశాసనమును రాజరాజనరేంద్రుని రాజ్యాభిషేకము శకము ౯౪౪-వ సంవత్సర సింహ బ. ౨ గురువారమున నుత్తరాభాద్రాసహితవణిజ లగ్నమున జరిగెనని తెల్పుచున్నదికదా! పూర్వచాళుక్యశాసనము లన్నియు విమలాదిత్యునియనంతరము రాజరాజనరేంద్రుడు సింహాసన మధిష్ఠించినట్లు తెల్పుచున్నవి. ఇందువల్ల విమలాదిత్యుని రాజ్యకాలము ముగిసినవెంటనే రాజరాజనరేంద్రుని పాలన ప్రారంభమాయె నను తలపు సహజముగ గలుగుచున్నది. కాని యిది సరియని చెప్పుటకు వీలుకాదు. విమలాదిత్యుడు శకము ౯౩౩-వ సంవత్సరమున బట్టాభిషిక్తుడాయెనని యతని రణస్తిపూండిశాసనము తెల్పుచున్నది. మఱియు నాశాసనోక్తదాన మాతని యష్టమవర్ష సింహమాసమున నిచ్చినట్లందే చెప్పియుండుటచే 12 విమలాదిత్యుడు శకము ౯౪౦-వ సంవత్సర సింహమాసమువఱకు రాజ్యమొనర్చెననుట నిస్సంశయము. తరువాత నాత డెంతకాలము రాజ్యము సేయుచుండెనో తెలియదు. కాని యతని సంతతివారి శాసనములం దన్నింటను నత డేడు సంవత్సరముల కాలమే రాజ్యపరిపాలన మొనర్చినట్లు చెప్పియుండుటచేత నతని యేలుబడి యష్టమ రాజ్యవర్షము సంపూర్తి కాకమునుపే సమాప్తమైయుండవలయు నని తోచుచున్నది. ఈయూహ సరియైనచో విమలాదిత్యుని యంతిమ రాజ్యవర్షమునకును, రాజరాజనరేంద్రుని పట్టాభిషేకకాలమునకును మధ్య నాలుగేండ్ల యెడ చేర్పడి పూర్వచాళుక్యరాజ్యకాలానుక్రమణికయం దొక విచ్ఛిత్తి కలుగుచున్నది. దీనికి గారణ మారయ నమకట్టి పరిశోధకులు భిన్నమార్గముల ద్రొక్కుచు కొన్ని యభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. గంజాంమండలములోని మహేంద్రగిరిపై నుండు కాలము దెలియని రెండు శిలాశాసనములను, చోళచక్రవర్తి మొదటి రాజరాజదేవుని ౨౧-వ రాజ్యవర్షమున (శకము ౯౩౬) దంజనగరపరిసరమున నుండు తిరువైయ్యారుగ్రామము నందలి పంచనదేశ్వరుని దేవాలయమున చెక్కించిన మఱియొక శిలాశాసనమును 13 నాధారపఱచుకొని, మొదటి రాజరాజచోళుడును, నాతని పుత్రుడును క్రీ. శ. ౧౦౧౩-౪ (అనగా శకము ౯౩౫)న వేంగిపై దండువెడలి విమలాదిత్యుని బందీకృతుని గావించి తంజనగరమునకు గొనిపోయి రనియు, నచ్చట గొంతకాలము గడచినపిమ్మట నతని బందివిముక్తుని గావించి చోళచక్రవర్తి దన కూతురగు కుందవాంబ నతని కిచ్చి యుద్వాహముగావించి క్రీ. శ. ౧౦౧౫-వ (శకము ౯౩౭) వర్షమున వేంగి నేలుటకు మరల నంపెననియు, నీకారణమువల్ల విమలాదిత్యుడు వాస్తవముగ శకము ౯౩౩ మొదలు ౯౪౪ పర్యంతము పదునొకం డేండ్లు ప్రజాపాలన మొనర్చినను దాని గణించక ఆతని సంతతివారతడు బందీవిముక్తుడై తిరిగి వేంగి నేలవచ్చినది మొదలు రాజరాజనరేంద్రుని పట్టాభిషేకకాలమువఱకు లెక్కచేసి యతని రాజ్యకాల మేడేండ్లని చెప్పిరనియు గొందఱి యభిప్రాయము. 14

ఈయభిప్రాయ మంగీకరింపదగినది కాదు. ఇచట చెప్పిన చొప్పున విమలాదిత్యుడు వాస్తవముగ శ. ౯౩౩ మొదలు శ. ౯౪౪ వఱకు పదునొకండు సంవత్సరములు రాజ్యపరిపాలనమే చేసియుండెనేని యతని సంతతివారతని రాజ్యకాలమున మొదటి నాలుగేండ్ల నేకారణమున వదలిపెట్టిరో తెలుపలేదు. అది యట్లుండగా మహేంద్రగిరిశిలాశాసనము లీ యభిప్రాయమున కాధారభూతములు గాజాలవు. ప్రప్రథమమున నందు పేర్కొనబడిన రాజేంద్రచోళు డెవ్వడో కనుగొనవలసియున్నది. ఇతడు చోళచక్రవర్తి మొదటి రాజరాజదేవుని కుమారుడగు మొదటి రాజేంద్రచోళచక్రవర్తి యని పరిశోధకు లందఱు నిశ్చయించియున్నారు. కాని యీవ్యక్తినిర్ధారణ సంశయగ్రస్తము. మహేంద్రగిరిశాసనములలోని రాజేంద్రచోళు డేరాజేంద్రచోళుడో నిశ్చయించి చెప్పుటకు దగు సాధనములు లేవు. వాదమునకై యతడు చోళచక్రవర్తి మొదటి రాజేంద్రచోళుడే యని యొప్పుకొన్నను నతనిచే బట్టుపడి చెఱబోయినవాడు చాళుక్యవిమలాదిత్యుడు గాడు.

---

12. ఎపి. ఇండికా. సం. ౬, పుటలు ౩౫౮, ౩౬౧.

13. ARE 396 of 1896 ( S. I. I. v. 215 of 1894 ( S. I. I. v. 514. )

14. ఎపి. ఇండి. సం. ౬, పుట ౩౫౦.

"నిరవద్యతపశ్శ్రీ జవిక్రమేణ విమలాదిత్యం కులోత్తేశ్వరం" అని స్పష్టముగ మహేంద్రగిరిశాసనమునఁ జే యతఁడు జైనుఁడైనదియు వివరించియున్నది.

ఇందువల్ల చాళుక్యవిమలాదిత్యుఁడు చోళచక్రవర్తిచేఁ బట్టుపడలేదని తెల్లమగుచున్నది. ఇఁక నతఁడు నిర్బంధితుఁడై తంజనగరమున నుండెనేమో విచారించవలసియున్నది. ఈ యంశమును రుజువుసేయుటకై యుదాహరింపఁబడిన తిరునై యూరుశాసనమునందు చెఱమాటయే లేదు. విష్ణువర్ధనమహారాజను పేరుగల విమలాదిత్యదేవుఁ డాయూర నుండిన లోకమహాదేవీశ్వర ముడయ మహాదేవుని యాలయమునకుఁ గొన్ని రజతపాత్రల నిచ్చెనని తెల్పుచున్నది.[15] విమలాదిత్య రాజరాజచోళుల యన్యోన్యబంధుత్వప్రస్తావ మిందు లేదు. ఆకారణమువల్ల విమలాదిత్యకుందవాంబల వివాహ మప్పటి కింకను జరుగలేదని తలచరాదు. ఏలన క్రీ. శ. ౧౦౧౦ (శ. ౯౩౨) నాటి తిరువలఞ్జులిశిలాశాసనము విమలాదిత్యుఁడు కుందవాంబయొక్క భర్త యని తెల్పుచున్నది.[16] ఇందుమూలమున విమలాదిత్యుఁడు నిజరాజ్యాభిషేకమునకుఁ బూర్వమే కుందవాంబను బెండ్లాడెనని నిశ్చయమగుచున్నది. కావున విమలాదిత్యుఁడు చోళులచేఁ జిక్కుటయు, దంజనగరమున జెఱయందు నిర్బంధితుఁడైయుంటయు నాకాశపురాణము లని నిశ్చయము.

ఈ సందర్భమున పరామర్శింపఁదగిన యభిప్రాయ మింకొకటి కలదు. రణస్తిపూండిశాసనమునందు 'పరమబ్రహ్మణ్య' 'పరమమాహేశ్వర' యను నభిధలు విమలాదిత్యుని కుండినట్లు చెప్పియుండుటవల్ల నతఁ డప్పటివఱకును (అనఁగా శాసనకాలమగు రాజ్యాష్టమవర్షమువఱకును) శైవుఁ డనియు, తదనంతరము

15. 215 of 1895, S.I.I. v. 514.

16. 633 of 1902, S.I.I. viii 234.

17. ARE 381 of 1917. S.I.I. ix, i 403.

18. జర్నల్ ఆఫ్ ది ఓరియంటల్ రిసర్చ్, సం. ౫, పుట ౪౨.

చెక్కఁబడిన కాలముదెలియని రామతీర్థ శిలాశాసనమున నతని గురువు త్రికాలయోగి సిద్ధాంతదేవుఁ డని చెప్పియుండుకారణమువల్లను[17] నతఁడు విరక్తుఁడై జైనదీక్ష బుచ్చుకొని దేశపాలనమును దన పుత్రుఁడైన రాజనరేంద్రుని కప్పజెప్పి శ. ౯౪౪ వఱకు దపోనిష్ఠాగరిష్ఠుఁడై యుండి దేహము జాలించెననియు, నాకారణమువల్ల శ. ౯౪౦ మొదలు రాజ్యపాలన మంతయు రాజరాజనరేంద్రుని మూలమున జరుగుచుండినను విమలాదిత్యుని మరణానంతరము గాని యతనిపట్టాభిషేకము నడచుటకు వీలుగాకపోయెననియు గొందఱు తలచుచున్నారు.[18]

ఈ యూహాసైతము దృష్టికర మైనది కాదు. రామతీర్థశాసనమున త్రికాలయోగిసిద్ధాంతదేవుడు 'విమలాదిత్యన గురుగళ్' అని చెప్పియుండుటచేత నతఁడు విమలాదిత్యునికి మతదీక్ష నొసగిన యాచార్యుఁడనుట కవకాశము గలదు. కాలముదెలియని యాశాసన మెప్పటిదో? విమలాదిత్యుని కడపటి దినముల లోనే దీనిని జెక్కియుండు రని నిర్ధారించి చెప్పఁదగిన సాక్ష్య మెద్దియు గానరాదు. రామతీర్థశాసనము విమలాదిత్యుని రాజ్యారంభదశ కేల జెందియుండఁగూడదు? మొదట జైనుఁడైయుండి యవ్వల శైవమతము నేల స్వీకరించియుండరాదు? కావున రామతీర్థశాసన మీ పట్టున నుపయోగించదు. ఇంకొకమాట. విరక్తుఁడై, జైనసన్యాసియై సర్వసంగపరిత్యాగము గావించిన విమలాదిత్యుఁడు శ. ౯౪౪ వఱకును నామకార్థమేనియు రాజుగ నుండెననుట యెట్లు పొసగును? శైవరాజులు సన్యసింప నిశ్చయించి తమ పుత్రులకు రాజ్యాభిషేక మొనర్చి యరణ్యములకుఁ బోయినట్లు జైనగ్రంథములు దెల్పుచున్నవి. విమలాదిత్యుఁ డట్లే రాజరాజనరేంద్రునికిఁ బట్టాభిషేక మొనర్చి సన్యసించియుండవచ్చునుగదా. సన్యసించి రాజ్యవిముఖుఁడై తపస్వియైపోయిన తండ్రిచావున కెదురుచూచు రాజరాజనరేంద్రుఁడు దన పట్టాభిషేకము నేల యాపుకొనవలసివచ్చెనో తెలియదు. కాన నీయభిప్రాయము గూడ సంగతము గాదు. (సశేషము)

ఆంధ్రదేశమున ప్రధానకేంద్రము లన్నిటిలోను

ఈ నెల 4 తేది మహాశివరాత్రి

విడుదలైనది.

B H A G Y A ★





నాగయ్య
మాలతి
N.S.కృష్ణన్
T.A.మధురం

L A K S H M I ★





☆ ☆ ☆ శ్రీ రేణుకా ఫిలిమ్స్ వారి ☆ ☆ ☆

# భాగ్యలక్ష్మి

☆ ☆ ☆ డైరెక్టరు :- P. పుల్లయ్య B.A. ☆ ☆

సౌందర్యరాశియగు ఒక స్త్రీని అనుమానించినచో, దాని ఫలితము గా దుఃఖ బాష్పములతో నిండిన ఎటువంటి విషాదనాటకం ప్రదర్శింపబడుతుంది! ఆమె అమాయకత్వము యెంతో మంది హృదయాలను ఛేదించింది. తుదకు తన సంసారాన్నే పాడు చేసుకొనేంతవరకు వచ్చింది. కాని నిరపరాధిని కఠినహృదయులు నిరాదరణచేసినప్పుడు సాక్షాత్తు భగవంతుడే జోక్యము కలిగించుకొని దీనుల ఆర్తిని బాపుతాడు. రేణుకావారి ఈ ప్రథమచిత్రంలో ఈకథను చూడండి.






DISTRIBUTORS – THE SOUTH INDIA PICTURES – KARAIKUDI

బ్రాంచీలు :—బెజవాడ, బెంగుళూరు, కోయంబత్తూరు

# ఆర్థికదుస్థితి-దాని చికిత్స

= శ్రీ కొమాండూరు శఠకోపాచార్యులు =



ఇటీవల మన దేశీయులలో నిరుత్సాహము, నాందోళనము పెరుగుచున్నవి. అందుకు ధరలు పెరుగుట యొక ముఖ్యకారణము. భూస్వాములకుమాత్ర మది లాభకరమే. కాని, వ్యవసాయకులలోను పాలికాపులకు, కూలివారికిని నష్టకరము. తక్కిన బీదలకు, మధ్యవర్గీయులగు వకీళ్లు, వర్తకులు, డాక్టర్లు వగైరాలకు బాధాకరమని వేరుగ చెప్పనక్కర లేదు. రోజువారీ జీవితమునకు వలయు బియ్యము, పప్పులు, నూనె, జొన్నలు, బెల్లము, బట్టలు, కాగితము ఇత్యాదుల ధరలు పూర్వముకన్న రెట్టింపు దాటినవి. ఇక గోధుమలు, కిరసనాయిలువంటి పేరుకైనను గ్రామాలలో దొరకుట దుర్లభమగుచున్నది. కోట్లకొలది జనులు వృత్తులు లేకయు, దొరికిన కొద్ది జీతపుసొమ్ముకు తగు నాహారము దొరకకయు బాధపడుచున్నారు. గుమాస్తాలు వగైరాల నెలవారీజీతములు కొంత హెచ్చినను, అవి ధరల హెచ్చింపునకు తగినట్లు లేవు. బీదలను పోషించు హరిజనవసతిగృహములు, అన్నదానసమాజములు మొదలగు ధర్మసంస్థలకు ప్రజలనుండి తగు ధనసహాయము దొరుకుట లేదు. యుద్ధకాలమం దిట్టి పరిస్థితు లుండక తీరదని కొందరు నిస్పృహ జూపుచున్నారు. కాని, క్రిందటి యుద్ధకాలమందు ధరలు హెచ్చుగ పెరుగలేదు. యుద్ధానంతరము 'కంట్రోలు' సంవత్సరాలలో ధాన్యపుధర పెరిగెను. కాని, అప్పుడుకూడ ఇంత విపరీతము లేదు. ఇప్పు డన్నివస్తువుల ధరలును రెట్టింపు దాటినవి. మరియు ఈయుద్ధాంతమునాటి కింకె నెంత పెరుగునో తెలియదు. ఇప్పట్లో తగ్గు సూచనలు కనబడవు. ఈలోగా అశాంతి, ఆర్థికప్రమాదము చేర్పడుట సహజము. ప్రజాక్షేమమునకు భంగకరమగు నిట్టి స్థితి యేర్పడుటకు కారణ మేమి? దీని నివారణ యెట్లు?

ఈ కని విని యెరుగని ధరల కన్నియో కారణములను చెప్పుట కలదు. పంటదినుసులు వగైరా నొక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు పంప సౌకర్యములు లేవని, ఈసాలున కొన్ని ప్రాంతాలలో పంటలు తక్కువయైనవని, వర్తకులు స్వలాభముకొరకు దురాశాపరులై దినుసులను, సరుకులను హెచ్చుగ నిలువచేసి, ధరలు పెంచుచున్నారని, జనులు తమకు వెంటనే కావలసినవాటికన్న హెచ్చు సరుకుల నింటనుంచుకొనుచున్నారని, సేనలు మొదలగు యుద్ధావసరములకై సర్కారు చాలా గింజలను, బట్టలను, పెట్రోలు ఇత్యాదులను కొని తీసుకొనుచున్నారని, కొందరు రైతులు ధర లింకను హెచ్చుటకొరకు కనిపెట్టుకొని తమ ధాన్యాదులను దాచుకొనుచున్నారని, బర్మాబియ్యపుదిగుమతి నిలిచిపోవుట, కొన్ని యావశ్యకవస్తువు లితరదేశాల కెగుమతి చేయబడుట—ఇట్లు వేర్వేరుగ హేతువులను చెప్పుచున్నారు. ఈ యారోపణలన్నిటి నిక్కడ పరిశీలింప నక్కరలేదు. వీటిలో కొంత సత్యముండవచ్చును. బర్మానుండి మామూలుగ వచ్చు ధాన్యము స్వల్పము. వాటివల్ల అన్నివస్తువులకును దేశమంతట ధరలు మారవు. తక్కిన మరికొన్ని ధరల హెచ్చుకు కారణములనుటకంటె అవి ఈ పరిస్థితివలని యాందోళనపు ఫలము లనుట న్యాయము. కనుక, ఇప్పటి విపరీతపుధరల కివియే కారణము లనుట సత్యముగ తోచదు. అందుకు ప్రజాసామాన్యమునకు తెలియని వేరొక కారణము కలదు. అది సర్కారు నోట్లను

హెచ్చుగ ముద్రించుట. దానినే ఇంగ్లీషు ఆర్థిక పరిభాషలో ఇన్ఫ్లేషన్ అందురు.

ఇప్పటి నాగరిక దేశము లన్నిటిలోను ఆయా ప్రభుత్వములో అధికృతమగు బ్యాంకులో ప్రజావసరమునకు వలయు కరెన్సీనోట్లను ముద్రింపజేసి జారీ చేయుట కలదు. అవి స్వదేశములో నాణెములకు బదులుగ చలామణీయగుటయు నిజమే. అయితే, తమ వద్ద బంగారము నిలవయుంచుకొని, ఆనిలవకు తగినట్లు మాత్రము నోట్లు జారీచేయుట సరియగు ఆర్థికనీతి. ఇదివరలో మన దేశములోను అట్టి బంగారపునిలవయు, అందునుబట్టి జారీచేయు నోట్లమొత్తమునకు తగు పరిమితియు ఉండేవి. ఇప్పు డాపరిస్థితి మారినది. మన బంగారపునిలవ తగ్గినది. ఉన్నదియు ప్రభుత్వమువా రీదేశమం దుంచలేరు. ప్రజలు తెచ్చు కరెన్సీ నోట్లకు వారు కోరినప్పుడు ఇదివరలో ప్రభుత్వపు బాంకులు కొనులు, అనగా బంగారపునాణెములు ఇచ్చుచుండిరి. ఈ యార్థికసూత్రమును బంగారపుప్రమాణము (Gold standard) అందురు. ౧౨ ఏండ్లనుండి మన ప్రభుత్వమువా రీబాధ్యతను వదలుకొన్నారు. అనగా కరెన్సీ నోట్లకు బదులు వాటి విలువ బంగారు నాణెము లిచ్చు బాధ్యత యిపుడు ప్రభుత్వమునకు లేదు. బంగారుప్రమాణ మిప్పుడు బ్రిటనులోను లేదు. అమెరికాసంయుక్తరాజ్యమం దున్నది. (కనుక డాలరువిలువ చెదరలేదు.) ౧౨ ఏండ్లక్రిందట మన ముఖ్యమైన నాణెము ౧— రూపాయను మనప్రభుత్వము బ్రిటిషువారి 'స్టెర్లింగు'కు, అనగా పౌనునోటుకు ముడిపెట్టినారు. ఆ రెంటికిని (అంతకుముందే) మన జాతీయక్షేమమునకు నష్టకరముగను, బ్రిటిషువ్యాపారములకు లాభకరముగను వినిమయపు దామాషా రేటును ప్రభుత్వమువారు మార్చివేసిరి. ఈ రెంటివల్లను మన దేశపు ఆర్థికస్థితికి నష్టము కలిగినది. ఆర్థికస్థితి సహజమైయుంటే సర్కారు రేటును, బజారు రేటును సుమారు సమానముగ నుండవలెను. కొద్ది తేడా యుండవచ్చును. కాని ఇప్పుడు సర్కారురేటు ప్రకారము కాసు సుమారు రూ. ౧౩-౮-౦. క్రియలో ఆరేటుకు రెండు మూడు రెట్ల రూపాయ లిచ్చినగాని బజారులో బంగారుకాసు దొరకదు. అట్టి స్థితికూడ ఆర్థికవ్యత్యాసమునకును, మన ప్రభుత్వపు ఆర్థికనీతిలోని దౌర్బల్యమునకును చిహ్నము.

ఇట్లుండగా, ఇప్పటి యుద్ధపరిస్థితిలో ప్రభుత్వపు ఆర్థికనీతిలో మరికొంత మార్పు కలిగినది. మామూలుగ ప్రభుత్వపు ఆదాయ వ్యయములు దాదాపు సమానముగ నుండును. మామూలుగ భారతసర్కారు సాలీనా యిటీవలి ఆదాయము సుమారు ౧౨౦ కోట్ల రూపాయలు. ఖర్చును అంతే. ఇప్పుడు రాబడికన్న రెండేండ్లనుండి ప్రభుత్వపుఖర్చు దాదాపు మూడు రెట్లు పెరిగినది.

ఈ యుద్ధకాలమం దిదివరలో నుద్దేశింపని చాల పనులకు మన ప్రభుత్వమువారు కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టుచున్నారు. ఇక్కడి సేనల జీతపు ఖర్చు విపరీతముగ పెరిగినది. వారి కాహారాదుల దినుసులు, వస్త్రములు, పెట్రోలు ఇత్యాదుల కొనుబడి కని మన ప్రభుత్వ మెంతో సొమ్ము వెచ్చించుచున్నది. మరియు ఇరాను, ఇరాకు, ఈజిప్టు మున్నగు బయటి ప్రాంతముల కంపిన సేనలకును, వాటి సాధనసామగ్రులకును ఎంతో ఖర్చగుచున్నది. ఇక్కడి బ్రిటిషుసేనలకును, అమెరికనులకును ఆ రాజ్యముల తరఫున భారత ప్రభుత్వమువారు కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టుచున్నారు. అట్టి కొనుబడులకు (అంతర్జాతీయసూత్రముల ప్రకారము) కొనువారు బంగారునాణెములో, లేక మన కవసరమగు మరొక సరుకో యివ్వవలెను. (అమెరికాలో మన కవసరమగు లోహయంత్రాది వస్తువు లెన్నియో కలవు.) మన భారతప్రభుత్వము స్వతంత్రము, ప్రజాయత్తము నయియుంటే, అట్టి జాతీయప్రభుత్వ మితరులనుండి బంగారమో, మారు సరుకులో పుచ్చుకొనియే వారికి మన సరుకు లమ్ముదురు. కాని ఇప్పటి భారతప్రభుత్వము పరాధీనము, విజాతీయమును. అది లండనులోని బ్రిటిషుప్రభుత్వపు మంత్రి చెప్పినట్లే నడుచుకొనును. వారును, అమెరికా వారును సంప్రదించుకొందురు. కనుక, వారి లాభము వారు చూచుకొందురు. ఫలితమేమన, బ్రిటిషుప్రభుత్వము, అమెరికాప్రభుత్వముగూడ ఈ కొనుబడులకు మనకు బంగారముగాని, డాలర్లుగాని, మనము కోరు

సరుకులుగాని యిచ్చుట లేదు. చెల్లింపు అంతయు లండనులో స్టెర్లింగులో, అనగా పౌనునోట్లను భారత ప్రభుత్వపు లెక్కనుు నిలవయుంచు రూపముగా జరుగుచున్నది. లక్ష్మీప్రసన్నత లేని యిట్టి సరస్వతీప్రసన్నత వల్ల మన ప్రభుత్వపుస్థితి బాగుపడుట లేదు. వారి తరఫున సామానుల కొనుబడికి వారి యేజెంటుగ మన భారతప్రభుత్వము ప్రతినెలా కోట్లకొలది రూపాయలు ఖర్చు చేయకతప్పదు. మన దేశపు యుద్ధకార్యముల ఖర్చుకు నట్టిసొమ్ము కావలెను.

ఈఖర్చు లన్నిటికొరకు బ్రిటిషుప్రభుత్వపు సూచన ప్రకారము కోట్లకొలదిగ కరెన్సీనోట్లను మన ప్రభుత్వము చ్చుచేయించుచు, వెనుకటికన్న చాలరెట్లు హెచ్చుగ వేసిన రూనోట్లను జారీచేసి వాటితో సరుకుల కొనుబడి వగైరాలు జరిగించుచున్నారు. ఈయుద్ధమునకు పూర్వము, అనగా ౩న్న ఏండ్లక్రిందట మనదేశములో సుమారు ౧౮౦ కోట్ల రూపాయలనోట్లు అమలులో నుండెను. ౧౯౪౨ సాలాఖరుకు సుమారు ౫౦౦ కోట్లరూపాయ లీరీతిగ చలామణికి వచ్చినవి. ఇందుకు తగిన బంగారునిధి ప్రభుత్వమునకు లేదు. ఇట్టి ముద్రితప్రసారము (Inflation) మన కార్థికముగ హానికరము. ఇందువల్ల బ్రిటను, అమెరికాల కిప్పుడు లాభించవచ్చును. కొద్ది ఆస్తిరాబడి గల వ్యక్తి తన తాహతుకు మించి ఖర్చు చేయుట, ప్రామిసరీనోట్లు వ్రాయుట జరిగించినచో, ఆర్థికముగా అతనికి, ఆనోట్లకు విలువ తగ్గును. ఈ సూత్రము ప్రభుత్వమునకును వర్తించును. కనుక ఈ స్థితిలో మన ప్రభుత్వపునోట్ల విలువ తగ్గిపోవుట సహజమే. ఇదివరలో రూపాయకు గల కొనుగోలుశక్తి (Purchasing power) ఇప్పుడు లేదు. రెండేండ్ల క్రిందట రూపాయకు వచ్చు ధాన్యాదులలో సగము నిప్పుడు దొరకుట కష్టమగుచున్నది. ఇట్లే, మునుపటి వేయిరూపాయలకు దొరకు భూమి యిప్పుడు రెట్టింపు సొమ్మకుగాని దొరకుట లేదు. నిలవ నోట్లకు బదులు ఎట్లైనను భూములు సంపాదింప ధనికులు యత్నించుచున్నారు. కనుక, భూముల ధర లంతగా పెరుగుటకును రూపాయవిలువ పడిపోవుట యొక ముఖ్య కారణము.

ఈసందర్భమున, ఈ నోట్లహెచ్చింపునకు ఇటీవలి 'చిల్లరగిరాకీ'తో సంబంధ మున్నదని గ్రహింపవచ్చును. అమలులో నున్న రూపాయనోట్లవాడుకలో జనులకు తరుచు చిల్లర నాణెములు కావలసియుండును. కనుక జారీయయిన నోట్ల సంఖ్యకు తగిన దామాషాను చిల్లర నాణెములనుగూడ ప్రభుత్వమువారు జారీచేయుట న్యాయము, అవసరము. లోగడ నున్నంత చిల్లర యిప్పుడు నున్నను, ఇప్పుడు కొత్తగా జారీచేసిన హెచ్చునోట్లసంఖ్యకు తగిన చిల్లర నాణెములను సర్కారు జారీచేయలేదు కనుక ఈ చిల్లర నాణెముల దామాషాసంఖ్య బొత్తిగా తక్కువ యయినది. అట్టి స్థితిలో నోట్లసంఖ్య హెచ్చుటనుబట్టి హెచ్చుమంది నోట్లకు చిల్లర నాణెముల ఫిరాయింపు కోరుటయు, చిల్లర దొరకకపోవుటయు సంభవించుట సహజమే. ఇటీవల నాలుగునెలలలో పరిస్థితి యింత మారినది. ఈ యుద్ధ మెప్పటికి ముగియునో, యుద్ధాంతమున కింకను నెంత కష్టపరిస్థితు లేర్పడునో చెప్పలేము. ప్రభుత్వమువారు కరెన్సీసందర్భములో తమ యార్థిక నీతిని వెంటనే మార్చుకోనియెడల ధర లింకను పెరుగవచ్చును. అందువల్ల బీదలకు, మధ్యవర్గపు ఉద్యోగులకు, సామాన్యకుటుంబీకులకును బాధ లింకను హెచ్చును.

యుద్ధము త్వరలోనే సమాప్తము కావలె నని కోరుదుము. కాని అది మన వశములోనిది కాదు. ధాన్యాదుల ధరలనిర్ణయము, సరుకుల సరఫరా గూర్చి నియమములు, నిబంధనలు దాటినవారికి శిక్షలు జరుగవచ్చును. కాని అట్టి ప్రభుత్వచర్యలవల్ల ఆందోళన హెచ్చునేకాని, అసలువ్యాధికి చికిత్స యేర్పడదు. యుద్ధావసరములకై ధాన్యాదులు, బట్టలు, పెట్రోలు వగైరాలను ప్రభుత్వము కొనుట యెట్లును తప్పదు. ఈ దేశపు మిల్లులలో ఉత్పత్తియగు మొత్తములో ౘ వంతు ప్రభుత్వమువారు తమ కార్యములకు తీసుకొనుచున్నారు. ఇందుకు తోడు తప్పుసూత్రములతో ఆర్థికనీతి సాగించుట ప్రజాసామాన్యమున కన్యాయము చేయుట యగును. ఇక్కడికన్న బ్రిటనులో పంటలు, ఆహారవస్తువుల సరఫరాయు చాల తక్కువ.

యుద్ధపుబాధ లిక్కడికన్న నధికములు. బ్రిటిషువారి యుద్ధపుఖర్చు నిక్కడికన్న చాల హెచ్చు. కాని అక్కడ ధరలు నాల్గవవంతు మాత్రము పెరుగు నరికి మన దేశమందు రెట్టింపు దాటిపోయినవి. ఈ భేద మునకు ముఖ్యకారణము బ్రిటిషు ప్రభుత్వమువారు తమ ప్రజలకు క్షేమకరమగు ఆర్థికనీతి నవలంబించిరి. వా రిక్కడవలె బంగారునిలవతాహతు చూచుకో కుండ హెచ్చుసంఖ్యనోట్లు ముద్రించుపద్ధతి పెట్టుకో లేదు. పన్నులు హెచ్చించుటకన్నను నోట్లు విపరీత ముగ ముద్రించుటయే తుదకు ప్రజల యార్థికస్థితి కెక్కువ నష్టకరమని వారికి తెలియును. వారు తమ బంగారపునిలవను వీలైనంతవరకు కాపాడుకొను చున్నారు. వీలైనంతవరకు తమ ప్రజలవద్దనే ఋణము చేయుచు ఆర్థికసంపత్తిని కాపాడుకొనుచున్నారు. కొనుబడులు వీలైనంతవరకు నోట్లహెచ్చింపు లేకుండ, అరువుకవులుపద్ధతి, రొక్కపు చెల్లింపు వగైరాల ద్వారా చేయుచున్నారు. లేదా సరుకుల మార్పు జరిగింతురు.

మన భారతప్రభుత్వముకూడ తమ ఖర్చుల నిమిత్త మిట్లు నోట్ల ముద్రణనే చేయుపద్ధతి మానుకోవలెను. అమెరికావారును, బ్రిటిషువారును మన ప్రభుత్వముద్వారా ఈ దేశములో నెన్నియోకోట్ల రూపాయల సరుకు కొనుచున్నారు. అందు కిప్పుడు స్టెర్లింగు సెక్యూరిటీలు, అనగా పౌనులనోట్ల కట్టల పోమీయే ఆధార మగు చున్నది. ఈ నోట్ల పోమీ మన ప్రభుత్వమున కింగ్లండులో నున్నది. మన ప్రభుత్వ మిదివరలో బ్రిటిషు ప్రభుత్వమునకు చాల పౌనులు బాకీయుండెను. అది తీరి పోగా, మన కా ప్రభుత్వమువద్ద సుమారు ౮౫౦ కోట్లు నిలవయున్నది. కాని పౌనుల కిమ్మత్తు తగ్గినకొలది యీ నిలవరొక్క. కిమ్మత్తు తగ్గి మనకు నష్టము కలుగును. కాని, ఈ సొమ్మును వెంటనే బంగారుగనో, డాలర్లుగనో మన ప్రభుత్వము మార్పించి భద్రపరచ వలెను. అందువల్ల ఆర్థికముగా ఈ దేశపు పరపతియు, వ్యాపారశక్తియు హెచ్చును. అట్లమెరికా రాజ్య మీ దేశములో చేయు కొనుబడులన్నిటికిని బంగార మిచ్చుట వీలు కాదన్నను, కొంతవరకట్లు చేసి మిగి లినవాటి కీదేశములోనే ఆ ప్రభుత్వమువారు రూపా యలఋణము చేసి దాని యాధారమున కొనుబడి చేయవచ్చును. అందువల్ల అమెరికావారు మనకు ఋణపడుదురు. మరియు మన సరుకులకు, ఆ బగులుసొమ్మునకు ప్రత్యామ్నాయముగా (అమె రికాప్రభుత్వమువద్ద విశేషముగా నిలవయున్న) బంగారమో, లేక మన కవసరమయి అమెరి కాలో దొరకు యంత్రసామగ్రులనో మనము ఫిరా యింపుదిగుమతి చేసుకోవచ్చును. ఇందువల్ల మన దేశపు ఆర్థికస్థితి బాగుపడును. క్రొత్త పరిశ్రమల స్థాపన జరిగి, నిరుద్యోగులగు జనులకు మంచి వృత్తి యేర్పడును. మన కవసరమగు రసాయనాదివస్తువుల కితరదేశాల పయిన ఆధారపడవలసిన యవసరము కొంత తగ్గును. అట్లు యంత్రములను దెప్పించినచో ఈ యుద్ధకాలమం దెన్నియో మంచి పరిశ్రమ లిక్కడ యేర్పడి వృద్ధియై యుండును. కాని ప్రభుత్వ మందు కవకాశ మీయ లేదు.

బ్రిటిషుప్రభుత్వమువద్ద మన లెక్కను పౌనులు నిలవయుండుట క్షేమకరమా ? ఆప్రభుత్వము చెప్పినట్లు మన ప్రభుత్వము నడుచుకొందురు కనుక యుద్ధానం తరమున పౌనుకు, రూపాయకు గల దామాషామారకపు రేటును (క్రిందటి యుద్ధానంతరమున చేసినట్లే) హఠా త్తుగా ప్రభుత్వము మార్పించి జమాఖర్చు చేస్తే మన నిల వకు చాల నష్టముగలుగవచ్చును. కనుక ఈ స్టెర్లింగు సెక్యూరిటీలను వెంటనే మనము మన కవసరమగు యంత్రసామగ్రికొనుబడికి ఇంగ్లండులో వినియోగింప దగును. లేదా డాలర్లు కొనవచ్చును. మరియు మన ప్రభుత్వము బ్రిటిషువారి కీదేశపు పోమీమీద సుమారు ౧౨౦౦ కోట్ల ఋణ మీయవలసియున్నది. ఈ 'జాతీయఋణము'పైన సాలీనా మన ఖజానానుండి వడ్డి చెల్లుచుండవలెను. ఈ ఋణములో కొంతభాగ మును తీర్చివేయుట కానిలవసొమ్మును వినియోగించి నచో ఆ ఋణభారము తగ్గును.

ఈ దేశములో బ్రిటిషుకంపెనీల వశములో చాల పరిశ్రమ లున్నవి. ఇట్లు విదేశీయుల యధికారములో మన కవసరమగు పరిశ్రమ లుండుట చాలవిధముల

మనకు హానికరము. కనుక ఆ కంపెనీలనుండి ఆ పరిశ్రమలను మన ప్రభుత్వము కొనివేయుట క్షేమకరము. అది ప్రభుత్వనిబంధన చేసినప్పుడే సులభసాధ్య మగును.

కాని బ్రిటిషువారికి గలుగు లాభములకు వ్యతిరేకముగా, మన ప్రజాక్షేమమునకై యిప్పటి ప్రభుత్వ మిట్టి కార్యములను జేయునా? మన ప్రజలకు బాధ్యత వహించు జాతీయప్రభుత్వమే అట్లు చేయును. ఇప్పటి పరాధీనప్రభుత్వము బ్రిటిషుప్రభుత్వము చెప్పినట్లే చేయకతప్పదు. బ్రిటిషుప్రభుత్వమువారి చెప్పుచేతలలో నుండుచు, వారి సూచనలప్రకారమే నడుచుకొను ప్రస్తుతపు భారతప్రభుత్వ మిప్పటి మన దుస్థితిని పోగొట్టుటకు పైపద్ధతుల నవలంబించు ననుటకు వీలు లేదు. అందుకు ప్రజాక్షేమమునే కోరు స్వతంత్ర ప్రభుత్వ మేర్పడవలెను.

మరొకసంగతి. ఈ యుద్ధములో మన ప్రభుత్వముకన్న హెచ్చుసొమ్ము ఖర్చుపెట్టుచున్నను, బ్రిటిషు అమెరికనుప్రభుత్వములు ఇన్‌ఫ్లేషన్ పద్ధతికి బదులు తమ దేశపు ధనికవర్గముపైన హెచ్చుపన్ను వేసియు, తమ దేశీయులవద్దనే ఋణము చేసియు యుద్ధపు ఖర్చుకు వలయు సొమ్ము సంపాదించినారు. ముద్రిత ప్రసారమునకు బదులు ఇట్లే మనప్రభుత్వముచేతను బ్రిటిషువా రెందుకు చేయించరు! ఇక్కడ పెద్దభూస్వాములపైన, లక్షాధికారులపైన పన్నువేయవచ్చును. కాని అందువల్ల వారికి అసంతృప్తిగలిగి వారును 'రాజభక్తి' వదలి జాతీయవాదు లగుదురని ప్రభుత్వమునకు భయము. మన సామాన్యజనులరాబడి బొత్తిగా తక్కువ. కనుక వా రింకను పన్ను చెల్లించుట సాధ్యము కాదు. ఈ దేశములోనే ఋణము చేయుట ఇన్‌ఫ్లేషన్ కన్న క్షేమకర మయినను, ఈప్రజలందు నమ్మిక, ప్రేమ లేని తమకు ప్రజలు నమ్మికతో బదులీయరని మన పరాయిప్రభుత్వ మెరుగును. (ఇటీవలనే వారు ౧౫ కోట్ల రూపాయలఋణము కోరిరి; ఎంతో ప్రచారణచేయగా ౩౪ కోట్లుమాత్రము వచ్చెను). మన దేశములోను జాతీయప్రభుత్వ ముంటే, మన ధనికులు బాంకులలో నిప్పుడు వ్యర్థముగా నిలవయున్న సొమ్ము సులభముగా ప్రభుత్వమునకు బదులిచ్చియుండెవారు. కనుక జాతీయప్రభుత్వ ముంటేనే ఇన్‌ఫ్లేషన్ అక్కర లేకపోవును.

గతసంవత్సరపు ఏప్రిలునెలలో బ్రిటిషుమంత్రి క్రిప్సుగారీ దేశమునకు వచ్చిరి. వారు యుద్ధానంతర మధికార మిత్తు మని కొన్ని సూచనలను జేసినప్పుడు "యుద్ధవ్యవహారము బ్రిటిషు సేనానియు, బ్రిటిషుప్రభుత్వమునే నడిపింపవచ్చుగాని కొన్ని రక్షణాధికారములకు, ఈ దేశపు అంతరికవిషయాలలోను (అనగా ఆర్థికసూత్రాదులకును) భారతీయులకు స్వాతంత్ర్యమిచ్చిననే జాతీయప్రభుత్వ మేర్పడి పూరాసహకారముతో భారతీయులము మంత్రిత్వము వహింతు మని కాంగ్రెసునాయకులు చెప్పిరి. అందుకు బ్రిటిషు ప్రభుత్వ మొప్పుకోలేదు. కనుకనే రాజీ కుదరలేదు. ఇట్టి పరిస్థితులలో సరియైన జాతీయప్రభుత్వ ముంటే (గవర్నరుజనరలును, బ్రిటిషుప్రభుత్వమును వ్యతిరేకించినను)కనడా ఆస్ట్రేలియాలలోవలె మన ప్రజలకు క్షేమకరమగు ఆర్థికసూత్రముల నవలంబించి, ఆహారాదిసామగ్రులధరను సరియైన స్థితిలో నుంచి, అందరికిని అన్నవస్త్రములు తగుధరకు దొరుకునట్లు చేయగల్గును. ఇప్పటి ప్రభుత్వమును కొంతవరకు 'కంట్రోలు' చేయుచున్న సంగతి నిజమే. కాని వట్టి కంట్రోలువల్ల ప్రజలకు లాభ ముండదు. అసలు ఆర్థికనీతి మారవలెను. దానికిప్పటిప్రభుత్వముపైన ఆశపడుట వ్యర్థము. అందుకు జాతీయప్రభుత్వమే కావలెను. కనుక, ఇప్పటి విపరీతపుధరలు, ఒడుదుడుకులు, ఆర్థికవ్యత్యాసమును, తగ్గి ప్రజల దుస్థితి తొలగవలెనంటే, వెంటనే మన దేశపు పాలనకు జాతీయప్రభుత్వ మేర్పడునట్లు అందరును న్యాయము, అవసరము నగు కృషిని దీక్షతో చేయవలెను.



# ఆంధ్రాభ్యుదయము

యుగ. సుందరరామశాస్త్రిగారు (యం. ఏ., యం. యస్. సి.)



వీరు మద్రాసు విశ్వవిద్యాలయములో స్టాటిస్టిక్సు డిపార్టుమెంటు అధికారిగానున్నారు. వీరికి ఇటీవలనే మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఎకనమిక్సులో పి. హెచ్ డి. బిరుదము నిచ్చినారు. ఎకనమిక్సులో ఈబిరుదము సంపాదించుటకు ఆంధ్రులలో వీరే ప్రథములు.

---

డా॥ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి
& సన్సు, రాజమండ్రి.

## ప్రకటన

ఔషధములను తయారు చేయు దినుసులన్నిటికిని ధరలు విపరీతముగ పెరిగిపోయినవి. అందుచే మేముకూడ కొన్ని మందులకు ధరలను కొద్దిగ హెచ్చింపవలసి వచ్చినది. మరియు జవరలుగ ఇచ్చుచున్న రెండు అణాలు కమీషనును కూడ తగ్గించడమైనది. గాన ఈవిషయము అందరకును తెలియపర్చడమైనది.

ఇట్లు,
డాక్టర్ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

మానవుల అవసరాలు

బలం ఆరోగ్యం సౌఖ్యం

ఇంచుమించు అందరికీ ఇవి కొరవడివున్నా, అనుభవించడానికి అందరికీ హక్కు అవకాశాలు వున్నవి. జీవామృతము సేవించిన వారికి బలం, ఆరోగ్యం, సౌఖ్యం అలవడుతవి.



జీవామృతము

ఆయుర్వేదాశ్రమము :: మదరాసు



డోంగ్రేగారి

బాలామృతము
బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును.



ఆర్యరసాయనశాల
ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925

ప్రశస్తాయుర్వేదౌషధముల కు నిలయము. ఏమందు కావలసినను మాకు వ్రాయుడు. నమ్మకమైనవి లభింపగలవు

ఆయుర్వేదభూషణ
వేమూరి శంకరశాస్త్రి
CONSULTING PHYSICIAN



## పొగ తాగితే
## పోలీసులు పట్టుకున్న రోజులు!

ఈనాడు భూలోకమందు పొగ తాగనివారు ఇంచుమించు ఎవ్వరూ అగపడరు. ఈ అభ్యాసాన్ని ప్రారంభించిన మొనగాళ్లు ముగ్గురు: కొలంబస్, జీన్ నికొట్, సర్ వాల్టర్ రాలెయ్. దీని పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోటానికి చాలా చిత్రంగా వుంటాయి:

కొలంబసు అమెరికాను కనిపెట్టటానికి ఎంతో కాలంముందుగానే అమెరికాలో చుట్ట, పైపు అమల్లో వుంటూవచ్చాయి. పురాతనకాలపు 'మయాన్'–'ఆజ్ టెక్' నాగరికత వెల్లివిరిసినప్పట్లోనే పొగాకు పవిత్రాన్ని గురించి నాటి ప్రముఖులు శిలాక్షరాలు చెక్కి వదిలారు.

సరదాకి కొలంబసు తనతో కూడా కొద్ది పొగాకు మొక్కలు స్పెయినుకు తీసుకపోయాడు. అతని పార్టీకి చెందిన మెంబరు—రోడ్రిగో అనే అతడు—సాహసించి, తన యింటి యెదుట తమాషాకోసం, మెయిన్ రోడ్డుమీద భుమాగా ధూమపానం చేయడం జరిగింది. వెంటనే అరెస్టు చేసి, అతన్ని ఈ నేరానికి గాను అనేకవత్సరాలు కారాగారవాసంపాలు చేశారు.

యూరప్ దేశంలో పొగ అలవాటయి ఇప్పటికి ఒకవందయేళ్లవుతుంది. అంతే. పొగతాగటం వైద్యం కోసం వినియోగించేవారు. జీన్ నికట్ అనే ఫ్రెంచి ప్రముఖుడు దీన్ని దగ్గులకూ, ఉబ్బసాలకూ అమోఘమైన ప్రక్రియగా నిరూపించాడు. అతని పేరు 'నికట్' నించే 'నికొటిన్' అనే పదం పుట్టింది.

యూరప్పునకు పొగ తాగడం నేర్పింది ఇంగ్లండు. ఇంగ్లండులో తొలుత ఈవాడుక తెచ్చి పెట్టింది సర్ వాల్టర్ రాలెయ్ అని చెప్పి ఒక పుక్కిటిగాథ వుంటున్నది. కాని, అది సత్యం కాదు. ఇంగ్లాండుకు నేర్పినది బ్రిటిష్ నావికాశాఖ కప్తానులు. వారు అలవాటుచేసినపిమ్మటనే చిరకాలానికి రాలెయ్ పొగతాగటం నేర్చాడు. అయితే,—పొగాకు వర్తకాభివృద్ధికి బాటవేసినవాడు రాలెయ్.

బ్రిటిష్ నావికాశాఖకప్తాన్లు అమెరికానించి వస్తూ, లండన్ పట్టణరాజబాటలవెంట గుప్ గుప్ మని పొగవదుల్తూ జల్సాగా నడవటం చూడటానికి జనం విరగబడేవాళ్లు. ఈ బ్రిటిషుకప్తానులు పొగతాగటం భారతీయులవద్దనుంచి నేర్చుకున్నట్టు తెలుస్తున్నది. ఏదయితేనేం, కొద్దికాలంలోనే లండనులో ఈ అలవాటు అపారంగా అలుముకు పోయింది.

ఆనాడు–పైపు ఎక్కువగా ఉపయోగించటం చేత 'పొగ తాగట'మనేగాని 'పొగ పీల్చట' మని అనేవారు కాదు.

అప్పుడు పుగాకువెల ఇంత అని చెప్పతరం కాకుండా వుండేది. పొగాకుయెత్తుకి సరిగ్గా వెండి నాణాలు వేసి తూచి, తీసుకునేవారట వర్తకులు! అంత గిరాకీ. వర్జీనియాలో ఒకప్పుడు పొగాకుతప్ప తదితర మేమీ పండించేవారు కాదు.

ఆకాలంలో పొగ తాగే పైపులు చాలా విలువయిన వస్తువులుగా పరిగణింపబడేవి. మఠాల్లో (అనగా సత్రాలు–వీటినే హూటెల్సు అని చెప్పవచ్చు) జనం మన దేశంలో గంజాయిదమ్ముల్లాగ—ఒకొక్కరు ఒకొక్క గుక్క పీల్చి, ఆచేతికి ఆచేతికి అందిచ్చేవారు. ఆడవాళ్లు పురుషులతో కలిసి యథేచ్ఛగా పొగ తాగేవారు.

పదిహేడవ శతాబ్దినాటికి ఈ అలవాటు హాలెండు, ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియా దేశాలకు పాకిపోయింది. (౧౬౧౮-౪౮) 'ముప్ఫయి ఏళ్ల' యుద్ధంలో జర్మనీదేశమందు సమావేశమయిన సైనికులు ఈఅలవాటును వాళ్లవాళ్ల దేశాలకు తీసుకపొయ్యారు. తరవాత జరిగిన యుద్ధాలన్నీ ఈపొగతాగుడుని ప్రపంచంనలుమూలలకీ వ్యాపింపచేశాయి.

పుగాకుపంట పెంపొందించటానికి అన్ని దేశాలూ ఆయత్తపడ్డాయి. కాని, అమెరికాపుగాకుకి తుల్యంగా వుండే పసందయిన సరుకు ఉత్పత్తి చేయటానికి ఒక్క టర్కీ, పరిసరప్రాంతాలకుమాత్రమే అనుకూల్యత అమిరింది.

పోర్చుగీస్ వాణికులు ఈ అభ్యాసాన్ని జపాను, చీనా, ఫిలిప్పయిన్సుకు వ్యాప్తిచేశారు. ౧౭-వ శతాబ్ది నాటికి జగత్తు యావత్తూ పొగతాగుడికి లోనైంది.

పద్ధెనిమిదో శతాబ్దాంతమందు అమెరికాదేశం పుగాకును చుట్టస్వరూపంలో ఎక్కువ వాడుకచేయ జొచ్చింది. ఈపద్ధతి యూరప్పులోకూడ వాయువేగాన అలుముకుపోయింది. తదుపరి ౧౮౪౪ లో ఫ్రాన్సుదేశమందు సిగరెట్టు అవతరించింది. ఫ్రెంచివారు పొడుం పీల్చటంకూడా విరివిగా వాడుకలోకి తెచ్చారు. పొగతాగటంకంటె పొడుం పీల్చటం ఘరానా అనే వుద్దేశంతో కోర్టులో నోబిల్సు పొడుమే పీల్చేవారు.

౧౮౫౪ సంవత్సరపు క్రిమియన్ యుద్ధంలో సిగరెట్టుకి ప్రచారం, గౌరవం హెచ్చయింది. కానయితే,—అది ఎంతగా ప్రజల్ని వశ్యం చేసుకున్నప్పటికీ ఆవెంటనే ప్రతిఘటన సంభవించింది. సిగరెట్టునిషేధ ప్రచారకసంఘాలు లేచాయి. అమెరికాలో కొన్ని స్త్రీసంఘాలు ఈవిషయంలో తీవ్రంగా పనిచేశాయి. ఇంతెందుకూ! — పన్నెండు అమెరికన్ రాష్ట్రాల్లో కచ్చితంగా సిగరెట్టు నిషేధించబడింది!

'సిగరు'కు పర్యాయపదం 'సిగరెట్'. 'సిగ్రా' అనేది స్పానిష్‌పదం. అనగా 'చిన్నితోట' అని అర్థం. కొలంబసు అమెరికానించి తెచ్చినప్పుడు మొదట్లో స్పానిష్‌దేశస్థులు పొగాకును పూలతోటల్లో వేసి పెంచారు. అట్లా తోటల్లోనించి తీసి ఈ పొగాకును చుట్టడాన్నిబట్టి 'సిగరెట్'పదం యేర్పడింది.

ముద్దా విశ్వనాథం

---

## పాకిస్థానము : మున్షీగారి ఖండన

చిన్న తరగతులలో నున్న బాలకులవలె జిన్నాగారి జ్ఞానము చాలసంకుచిత మైయున్నది. పాకిస్థాన వీక్షణముతోడ తిలకించి యూతడు ప్రపంచమునకు తెలియబఱచిన హిందూదేశచరిత్రయం దిటు లున్నది: "గత ౧౦౦౦ సంవత్సరములనుండియు హిందువులు ఇండియా దేశమును పాలింపలేదు. హిందువులు ౭౦౦ సంవత్సరములు మహమ్మదీయ పరిపాలనకు లోబడియుండిరి. గత ౨౦౦ సంవత్సరములనుండియు హిందూ మహమ్మదీయు లిరువురును బ్రిటిషు పరిపాలనయందున్నారు. మహమ్మదీయులు రెండువందల సంవత్సరములనుండి మాత్రమే బానిస లైయున్నారు. కాని, హిందువులు వేయి సంవత్సరములనుండియు బానిసలు."

ఇట్టి జిన్నాగారి విపరీతసిద్ధాంతమును సహేతుకముగాను, సోదాహరణముగాను ఖండించి యథార్థమును తెలియబఱచిన కె. ఎమ్. మున్షీ గారి ప్రకటన గమనింపదగియున్నది.

౧౧౯౨ లో మహమ్మదుఘోరీ యను విదేశ మహమ్మదీయుఁడు హిందూదేశముపై దండెత్తి రాజ్యము స్థాపించెను. ఈప్రథమదండయాత్ర యిప్పటిల్లి యింకను ౭౦౦ సంవత్సరములు కాలేదు. ఆకాలమున ప్రబలియుండిన రజపుత్రులు, చోళ, విజయనగర సామ్రాజ్యములు మూడును నాటి ఢిల్లీరాజ్యముకంటె చాల విశాలమైనవి.

అల్పాయువు గల అల్లాయుద్దీను ఖిల్జీయొక్క సామ్రాజ్యము ౧౨౯౬ లో స్థాపితమై ౧౩౨౧ లో శిథిలమయ్యెను. హైందవుల సాహాయ్యమువలన తొలిసారి అక్బరు ౧౫౫౬ లో స్థిరమైన సామ్రాజ్యమును స్థాపించెను. కాని, అక్బరుసామ్రాజ్యము దక్షిణమున గోదావరివఱకుగాని, గాంధ్యావాదఱకుగాని వ్యాపింప

లేదు. ఏ చిన్నచరిత్రను తీసినను ఈవిషయము తెలియ గలదు.

కాని, ౧౬౭౦ నాటికి దక్షిణమున శివాజీ స్వాతంత్ర్యము ప్రకటించెను. ఖాల్సా యను సిక్కు సంస్థను గురుగోవిందసింగు స్థాపించెను. రాజపుత్రులు ఢిల్లీప్రభుత్వమును ధిక్కరించిరి. ౧౭౦౭ లో ఔరంగజేబు మరణించినంతనే మొగలు సామ్రాజ్యము విచ్ఛిన్న మయ్యెను.

బ్రిటిషువారు హిందూదేశమును మహమ్మదీయులచేతినుండి గ్రహింపలేదు. హిందువులనుండియు, సిక్కులనుండియు వారు గ్రహించిరి. హిందూసామ్రాజ్యదండమును ధరించిన పూనా బ్రాహ్మణుని-పీష్వాను ఆంగ్లేయులు కిర్కీయుద్ధమున ౧౮౧౮ లో జయించి, యాసామ్రాజ్యదండమును తామే వహించిరి. పంజాబు దేశమును గోల్పోయినది సిక్కులుగాని మహమ్మదీయులు గారు. రాజపుత్రస్థానమును గోల్పోయిన వారు రాజపుత్రులుగాని మహమ్మదీయులు కారు.

కనుక, మొగలాయీవంశజులు పాలించిన ౨౦౦ సంవత్సరములను, మహమ్మదీయువిజేత లిరువురు చిర కాలముక్రిందట తమ సేనాసాహాయ్యమున శాసించిన యల్పకాలమును మినహాయింతుమేని, విశేష దేశమంత యు సర్వకాలమును హైందవహస్తగత మైయుండెను. హిందూజనసంకీర్ణములైన కొన్ని సంస్థానములను మహమ్మదీయులు పాలించిరేని, మహమ్మదీయజన సంకీర్ణములైన యితరసంస్థానములను హిందువులు పాలించిరి.

మహమ్మదీయులు రెండువందల సంవత్సరముల నుండిమాత్రము బానిస లైయున్నారు అను వాదమును ఎంత మఱుగుపఱచిన అంత మంచిది. హిందూదేశమునం దున్న మహమ్మదీయులు విదేశస్థులగు తుర్కీ మొద లగు జాతుల సంతతివారు కారు. తురుష్కులును, మొగలులును హిందూదేశముపై దండెత్తివచ్చినప్పుడు హిందువులు కొందఱు వారికి లొంగి ఇస్లాముమతమును గైకొనిరి. వారిని నిరోధించిన హిందువులు అట్టులే యుండిరి.

జాతీయవాది స్వాతంత్ర్యమునకై నేడు పోరాడు చున్నాడు. ముస్లిములీగుసభ్యుడు బ్రిటిషువారికి వినయ విధేయుడై యున్నాడు.

మఱియొకటి. హిందూమహమ్మదీయు లిరువురును గలసి రెండువందల సంవత్సరములనుండియు బ్రిటిషు ప్రభుత్వాధీన మైయున్నా రనుట సత్యము గాదు. కిర్కీయుద్ధము ౧౮౧౮ లో జరిగెను. గత హైందవ స్వాతంత్ర్యయుద్ధము ౧౮౫౭ లో నయ్యెను.

రాజకీయము లనగా మిథ్యాచరిత్రయును, తప్పు లెక్కలును గాదు. ఉత్తమబానిసత్వ లాంఛనముకొఱకును, అధమబానిసత్వ లాంఛనముకొఱకును ఇరువురు బానిసలు స్పర్ధ వహింతురేని, ఎవ్వరికిని స్వాతంత్ర్యము లభింపదు.

౧౩-౧౦-౪౭ తేదీని ఒకానొక లండనుపత్రికా విలేఖరితో జిన్నాగారు చెప్పినట్లు మన పత్రికలలో ప్రకటించిన యమూల్యసిద్ధాంత మిట్లున్నది: "హిందూ దేశమునకు గల యనేకసమస్యలలో నొక్కటియైనను తాను స్వయముగా పరిష్కరించుకొన జాలకుండెను. బ్రిటిషువారు కావించు పరిష్కారముచే హిందూదేశ మూపొందించుచుండెను" జిన్నాగారు కోరున దేమనగా--యుద్ధానంతరము పాకిస్థానమును స్థాపించుటకు బ్రిటిషువారు హామీ యిచ్చినచో, హిందువులకు సమానసంఖ్యగల స్థానముల నిచ్చి తాత్కాలిక ప్రభుత్వము నందు ప్రవేశించుటకు జిన్నాగారు సంసిద్ధులైయుందురు. "బ్రిటిషుప్రభుత్వ మట్టి హామీ లేపు ఇచ్చెద రేని, అది యమోఘ మని హిందువు లంగీకరింతు రని నేను భావింతును" అనికూడ నాతడు చెప్పెను.

జిన్నాగారు ప్రతినిధులై యున్న ముస్లిములీగు విజాతీయము కావలయు; లేదా హిందూదేశమునం దొక యంగము కావలయు. విజాతీయ మగునేని, తన తోపాటు హిందూదేశమును బలవంతముగా శాసించుటకై యట్టి సంస్థకు నాయకుడైన జిన్నాగారు ఆపత్రికావిలేఖరిద్వారమున అన్యరాజ్యము నాహ్వానించెను. అట్టివ్యక్తి దేశశత్రు వని చెప్పుట న్యాయము. కాని, ముస్లిములీగు ఇండియాయం దొక యంగమగునేని, అధి

కసంఖ్యాయుతమైన జాతిని అణగద్రొక్కుటకు అన్య రాజ్యము సాహాయ్యనించి బేరములాడు బందవుని ఏమన వలయు ?

మొసలికంటి సంజీవరావు.

---

## చిత్రకళనుండి నృత్యకళకు !

నృత్యకళలో నేడు అంతర్జాతీయ విఖ్యాతి గడించియున్న ఉదయశంకరు తొలుదొల్త చిత్రకారుడుగా నుండి తరుపరి యీవిద్యకు దిగె నను విషయము ప్రాయశః చాలమంది యెరుగరు. ఈకళావినోది చిత్రకళనుండి నృత్యకళకు దాటువేసిన వృత్తాంతవివరములను కొన్నిటిని ఫిబ్రవరి ' జయకర్ణాటక ' యిట్లు వెల్లడించినది.

ఉదయశంకరు చరిత్రప్రసిద్ధి గాంచిన ఉదయపురములో ఒక పురాతనమైన బ్రాహ్మణకులమందు జన్మించెను. ప్రాథమిక మాధ్యమికాది సామాన్య విద్య ముగించుకొని యితడు చిత్రకళ నేర్చుకొను తలపుతో ౧౯౧౮ లో బొంబాయి ఆర్టుస్కూలులో ప్రవేశించెను. రెండుమూడేండ్లపాటు తదేకదీక్షతో చదువు సంధ్యలు సాగించెను. చిత్రకళయందు ఇతనికి గల ఆసక్తిని కనిపెట్టి ఇతని తండ్రియైన డాక్టరు శ్యామశంకర చౌధరి (అప్పు డితడు ఝాలావారుసంస్థానమునకు మంత్రిగా నుండెను) ఇతని కందులో ఉన్నత శిక్ష నిప్పింపదలచి ౧౯౨౦ లో ఇతనిని లండనునందలి రాయల్ కాలేజ్ ఆఫ్ ఆర్ట్సుకు పంపెను. అక్కడ ఇతడు సాంగోపాంగముగా విద్యనభ్యసించి పరీక్షలలో కడతేరుటయేకాక పెక్కు బంగారుపతకములనుగూడ సంపాదించెను. అంతతో పోలేదు. సందర్భవశాత్తుగా అక్కడ ఇతనికి నృత్యకళావ్యాసంగము అంకురించి నవలువేయసాగెను. లోలోన మాటుమణగియుండిన నృత్యకౌశలము బయటపడసాగెను. ఆదేశమునందు అక్కడక్కడ మిత్రబృందము ఏర్పాటుచేయుచుండిన ఇష్టాగోష్ఠులలోను, ఉత్సవసమావేశములలోను తన కాజన్మసిద్ధమైన నృత్యవిద్యను చేతనైనంతమట్టుకు ప్రదర్శించుచువచ్చెను. క్రమశః ఇతడు తదేకముగా నృత్యవ్యాసంగములోనే దిగిపోయెను. అనేక సంగీత కార్యక్రమములలోగూడ పాల్గొనెను. ఆసందర్భములోనే ఇతనికి రష్యాదేశపు ప్రసిద్ధ నర్తకియైన అన్నాపవ్లోవాతో పరిచయ మేర్పడెను. ఆపరిచయము పరిచయము ఆ పాశ్చాత్యనర్తకి తనకు భారతీయనృత్యకళను నేర్పుమని ఇతనికి శిష్యురాలుగా చేరుటగా మారిపోయెను. మరికొన్నిరోజులకే ఇతడు ఆమెనాట్యమండలివెంట వెళ్లి అమెరికాలో సంచారము సాగించెను. అనేక కష్టముల ననుభవించి, పెక్కు అనుభవములను గడించి, నృత్యకళలో గొప్ప పేరు సంపాదించెను. ఈరీతిగా విజయయాత్ర సాగించి ఇతడు ౧౯౩౦ లో భారతదేశమునకు తిరిగివచ్చెను. ఆయేటనే కలకత్తాలో జరిగిన ఒకానొక ప్రదర్శనమునందు ఇతని నృత్యకళాపాండిత్యమును ప్రప్రథమముగా చూచి పెద్ద లందరును ముగ్ధులైపోయిరి. ఆ మరుసటిసంవత్సరమే ఇతడు మిస్ బోనర్ అను పేరుగల ఒక స్విజ్జర్లాండుయువతిసహాయముతో భారతీయనృత్యమండలి నొకదానిని లేవదీసెను. ఆమండలిని వెంటబెట్టుకొని యితడు మరియొకసారి బయలుదేరి యూరపు, అమెరికాలలో సంచారముచేసి, భారతీయ నృత్యకళయొక్క వెలుగును నలుమూలలకును విరజిమ్మి తిరిగివచ్చెను. అంతమాత్రముతోనే ఇతనికి తృప్తికాలేదు. ఒక రిద్దరు వ్యక్తులతోనే ఈవిద్య అంతరించిపోకుండ చిరస్థాయిగా నుండునట్లు విద్యార్థులను పోగుచేసి సక్రమశిక్షణ నిచ్చి, యీవిద్యయొక్క గొప్పదనమును చాటవలె నను కోరిక ఇతనిలో గాఢమాయెను. పలువురు ప్రాచ్య, పాశ్చాత్యకళావేత్తల సానుభూతిసహాయములతో ఒక నృత్యకళాకేంద్రమును స్థాపించెను. హిమాలయపర్వతముల నీడలో అతిలోక రమణీయమైన అల్మోరాక్షేత్రమున వెలసిన ఆకళాకేంద్రమునకు దేశము నాలుగంచులనుండియు శిష్యులు మూగుచున్నారు. అంగప్రత్యంగములతో నృత్యకళాసర్వస్వమును సలక్షణముగా నేర్పగలిగిన విద్వాంసులు ఉదయశంకరుకు చేదోడు వాదోడుగా ఉన్నారు. తలవని తలంపుగా చిత్రకళనుండి నృత్యకళకు దాటువేసిన ఉదయశంకరు చిరతపఃఫలమైన ఈ కళాకేంద్రము భారతజాతినాగరికతను, సంస్కృతిని దేశదేశాలకును చాటుచున్నది. ఆరిపోనుండిన కళాజ్యోతిని ఎగసనదోసినది.

# రహస్యము!

మీ వ్యాపారము అభివృద్ధిజెందుటకు ఒక్కటే రహస్యము. విడువకుండ మీ సరకుల గురించి పత్రికలో ప్రకటించుటయే.

ఆంధ్రదేశమున యెన్నోపట్టణము లున్నవి. పల్లె లున్నవి. కోస్తా లున్నవి. వీరందరికి మీ వ్యాపారసందేశమును అందజేయగలది ఒక "ఆంధ్ర పత్రిక" మాత్రమే. పత్రికలో ప్రకటించి క్రొత్త ఖాతా దారులను సంపాదించుకొనండి.

ప్రకటన రేట్ల వివరములకు :

మేనేజరు,

ఆంధ్ర పత్రిక

పో. బా. 212, :: మద్రాసు.



# విమర్శనము

## అద్వైతమతము

చిన్నది యగు కరపత్రము. ౧౩ పుటలు. వ్యాస రచయితలు : శ్రీ కామకోటి పీఠాధిపతులు. అనువాదకుడు : సాహిత్యవిద్యాప్రవీణ అవ్వారి వాసుదేవ శాస్త్రిగారు. దొరకుచోటు, వెల పేర్కొనబడలేదు.

ఇందు సర్వజనసులభమగు తేటతెలుగులో అద్వైతమతగ్రంథములు, సామాన్య సిద్ధాంతములు వివరింపబడినవి. అసామాన్య ప్రతిభావిరాజితులగు శ్రీ కామకోటి శంకరాచార్యులవారినుండి లోకమిట్టి స్వల్పవిషయముల నపేక్షింపదేమో! దుఃఖింపవలసిన విషయము : ఇట్టి ప్రవచనమే ఏతత్తుల్యులగు ఏ క్షేత్రస్థలపీఠాధిపతినుండియో వెలువడిన, ఇతోధికముగ ముద్రణాసౌకర్యమునకు నోచుకొనెడిది. అట్టి భాగ్యము మనకు నాస్తి. శ్రీ శంకరముఖ వినిర్గతమగు ఈ వ్యాసరత్నమును ధర్మకాముకులు సహర్షముగ పఠింతురనుటలో సందేహము లేదు.

పూర్ణానంద.

---

## శ్రీభక్తవిజయము

గ్రంథకర్త: మహాకవి అయ్యగారి వీరభద్రరావుగారు, తెలుగుపండితుడు, బోర్డుహైస్కూలు, వుండి, పశ్చిమగోదావరిజిల్లా. ౨౬ పుటల లఘుగ్రంథము. విషయము శివభాగవతుడైన తిన్నని కథ. యక్షగాన ప్రబంధరూపమున సంకలితమైనది. రచనాశైలి సామాన్యమైనది.

---

## వేళాకోళం

రచయిత: విద్వాన్, శతావధాని అనుముల వెంకటశేషకవిగారు. ప్రకాశకులు : సరస్వతీ పేపరు మార్టు, హాస్పిటల్ రోడ్డు, కర్నూలు. వెల రూ. ౦-౪-౦.

ఒక చిన్న ప్రహసనము. ఆధునిక ఆంధ్రనాటకరంగముపైన కొన్ని విసుర్లువేయుతలపుతో ఆరంభించి ప్రసంగవశాత్తుగా యమలోకమును ప్రవేశపెట్టి ఒక వింతరీతికథావస్తువును సమకూర్చుకొనిన ఈ ప్రహసనము ప్రధానముగా వేళాకోళము వెక్కిరింపులతో నడచినది. రూపకశిల్పము తక్కువైనను రచనలో హాస్యధోరణిని నిండుగా పదిలపరచుకొన్నది. ముగింపు చక్కగా పొందుపడలేదు. ప్రథమప్రయత్న ఫలితము కానోపును. ఈరచయితనుండి ముందుముందు మంచిరచనలను ఆకాంక్షింపవచ్చును.

---

## ఉభయకుశలోపరి

రచయిత : గోపీచంద్ గారు, మం. తాశ్రమము, తెనాలి.

ఆయాసమయములలో రేడియోద్వారా ఆంధ్రులకు వెల్లడించిన ప్రసంగాల సప్తకము. ప్రసంగాలన్నీ పల్లెటూళ్లలోని ఆధునిక జీవితవిషయాలకే సంబంధించివున్నవి. అందులోనూ రైతుల విషయములకు చెందినవి. వీనికితోడుగా 'చిత్తగించవలెను' అనే ఉపోద్ఘాతమును, 'పి. యస్.' నామక ఉపసంహార వాక్యములును చేర్చబడియున్నవి. 'చిత్తగించవలెను' అను శీర్షిక క్రింద వ్రాసిన సంగతులన్నీ వర్తమాన పరిస్థితులనే మనస్సులో పెట్టుకొని అవ్యాపదేశంగా ఇట్లు

చిత్రించారా అనిపిస్తుంది. ఈ ప్రసంగసప్తకములోని సంగతులు పాశ్చాత్య ఉపన్యాసాలలాగు చదువుటకు చాలా ఇంపుగా వున్నాయి. ఆఖరు 'పి. యస్.' లోని సంగతులు రచయిత యొక్క అభిప్రాయాలు. ఆధునిక నవయువకుల కిది ముఖ్యంగా చదవవలసిన పుస్తకము.

---

## ఉద్యోగము

గ్రంథకర్త: చిట్నా తిమ్మారెడ్డిగారు, బి. ఏ. ప్రాప్తిస్థానము: మాడరన్ సరస్వతీ సేవరుమార్టు, హాస్పిటల్ రోడ్డు, కర్నూలు. వెల రూ. ౦-౬-౦.

నిరుద్యోగియైన ఒక పట్టభద్రుడు కూటికి, గుడ్డకు లేక అల్లాడుచు, ఉద్యోగసంపాదనకై పడిన పాట్లు ఈ చిన్న నవలలోని కథావస్తువు. ఆ ప్రయత్నములో ఒక అభాగినిప్రాపకమును సంపాదించి కథానాయకుడు సంఘసేవకు గడగుటతో నవల ముగిసినది. రచన సామాన్యమైనది. నవలారచనలో ఈ గ్రంథకర్త ఇంకను ఎక్కువగా కృషి చేయవలసియున్నది. ఈ మెందటి మెట్టు క్రమశః పైమెట్టుకు దారితీయగలదని నమ్ముచున్నాము. ఈ గ్రంథమునందు అక్కడక్కడ రచనలో చక్కని సుభాషితములు సూత్రప్రాయముగా కూర్పబడి రచన కొక సొయగమును స్థాపించుచున్నవి.

---

## విద్యావిలాసము

గ్రంథకర్త: గుదిమెళ్ల రామానుజాచార్యులు గారు, ముక్తిపల్లి అగ్రహారము, రేపల్లెతాలూకా. వెల రూ. ౧-౦-౦.

స్వకపోలకల్పితమైన యొక కథ ప్రబంధకవితా శైలిలో ఈ పద్యకావ్యస్వరూపమును దాల్చినది. కథాకల్పనమునుబట్టి చూడగా ఈకావ్యము శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారన్నట్లు నిజముగా పిల్లకళాపూర్ణోదయమే. కవితాధారకూడ శుద్ధమై, సుమధురమైయున్నది. ఐహికజీవితములోని సంసారపు లంపటల యథార్థస్వరూపమును వేదాంతపరముగా చర్చించి తన తత్త్వశక్తిని గ్రంథకర్త యిందులో చక్కగా విశదీకరించినారు. కావ్యమంతయు ఆమూలాగ్రముగా ఏకదీక్షతో పఠింప వనువైయున్నది. భావలో మంచి పటుత్వమున్నది. కాని పద్యపదములలో పైకము పెక్కుచోట్ల సంయుక్తాక్షరములకు ముందున్న యక్షరములను తేల్చిపలుకవలసినరీతిగా వదలియుండుటమాత్రము - పఠకదృష్ట్యా అయినను యుక్తముగా కనిపించుటలేదు. ఇతరథా ఈ కావ్యము చాల బాగుగా నున్నది.

---

## గ్రంథ స్వీకారము:

### రంగనాథ రామాయణము

గ్రంథకర్త: శ్రీ గోన బుద్ధారెడ్డి. పరిష్కర్త: వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ప్రకాశకులు: ఆంధ్ర విశ్వకళాపరిషత్తు. రాయల్ సైజు. పుటలు ౨౧+ Viii+౭౮౩. వెల రూ. ౩-౮-౦.

---

### The Early Muslim Expansion in South India

గ్రంథకర్త: డా. వేటూరి వెంకటరమణయ్య గారు, యం. ఏ., పిహెచ్. డి. మద్రాసు విశ్వకళా పరిషత్తువారి చారిత్రకగ్రంథావళిలో ౧౩-వ ప్రచురణము. రాయల్ సైజులో ౨౦౬ పుటలు. వెల రూ. ౬-౮-౦.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.